# హిందూమతం, కుల వ్యవస్థ, భారతీయ సంస్కృతి

ఆర్వియార్



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్ 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

HINDU MATAM-KULA VYAVASTHA,
BHARATIYA SAMSKRUTI By RVR (R. Venkateswara Rao)

గత ముద్రణలు : 1992, 1994

ప్రచురణ నెం. : 2252

ప్రతులు : 1000

తృతీయ ముద్రణ : ఫిబ్రవరి, 2001



వెల: రూ. 40-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన్ భవన్, అబిడ్స్, హైదరాబాద్-1.

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్, సుల్తాన్ బజార్ - హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హైదరాబాదు-29. ఫోన్: 3229831

# ముందుమాట

మతపరమైన ఆచారాలన్నిటి వెనక ఏదో గొప్ప అంతరార్థ ముందని అదేపనిగా అన్వేషణ చేస్తూ సమర్థించేవారు కొందరు, ఈ ఆచారాలన్నిటిని ఒక్కసారిగా ధ్వంసం చేస్తే తప్ప పురోగతి సాధ్యం కాదని భావించేవారు కొందరు.

కాగా ఈ ఆచారాలకు ఎందుకంత పట్టువచ్చింది? ఇవి ఆయా కాలాలలో ఎలా మారుతూ వచ్చాయి? అని తెలుసుకోవటం ద్వారానే, వీటిలోని అసంగత అంశాలను ఎలా మార్పు చేయగలమో గ్రహించగలం.

అలాంటి విశ్లేషణకు తోడ్పడగలదనే ఉద్దేశంతో శ్రీ ఆర్వియార్ హిందూమతం, కులవ్యవస్థ, భారతీయ సంస్కృతిపై రాసిన ఈ చిన్న గ్రంథాన్ని ప్రచురిస్తున్నాం. ప్రాచీన ఆచార్ల్ని తెలుసుకునేందుకూ, కాలదోషం పట్టిన, ఈ ఆచారాల ఎడల విమర్శనాత్మక దృష్టిని పెంపు చేసుకునేందుకూ ఈ రచన తోడ్పడగలదని విశ్వసిస్తున్నాము.

ప్రకాశకులు

# హిందూమతం

హిందూ తత్వం అనేది వో మతమా కాదా? సామాన్యార్థంలో మతం అంటే ఓ అవగాహన వుంది. ఓ వ్యవస్థ, నిర్మాణ సంవిధానం, అధికారపీఠం, ఓ సుసంగతమైన సిద్ధాంతం వుండాలి. యెవళ్ళైనా యిష్టాపత్తిగా ఆ సిద్ధాంతాన్ని స్వీకరించి మారగలిగే అవకాశం ఉండాలి. కాని హిందూ మతానికి సుసంగతమైన ప్రత్యేక సిద్ధాంతం అనేది లేదు. చర్చిలాంటి వ్యవస్థలేదు. యెవళ్ళైనా ఈ మతంలోకి మారగలిగే అవకాశం లేదు. పుట్టుకతోనే 'హిందూ' కులాల్లోని యేదో వో కులంలో పుట్టాలి తప్ప యీ 'మతస్వీకారానికి' అర్హత లేదు.

మత స్వీకారం సంగతి సరేసరి, ఆయా కులాల వాళ్ళు తమ తమ కుల ధర్మాన్ని విధిగా అనుసరించి తీరాలి. రాజ్యాల్ని ఏలే చక్రవర్తులు వర్ణాశ్రమ ధర్మ అతిక్రమణ జరగకుండా కాపాడుతూ వుండాలి. "భారత కథాప్రస్తావన"లో నన్నయగారు "కృష్ణద్వైపాయనుండను బ్రహ్మర్షి దాల్లి" చేసిన అనేక కార్యక్రమాల్లో "చతుర్వర్ణాశ్రమ ధర్మ క్రమంబు" కూడా "తన విమల జ్ఞానమయంబైన వాగ్దర్పణంబునం దేర్పడ వెలుంగు చుండె"నని అన్నారు. ఇక భారతమంతా "వర్ణాశ్రమాచార స్థిరతను నిలబెట్టుటకు ప్రచారము" చెయ్యడమే. "రామరాజ్యం" "రామరాజ్యం" అని గాంధీగారు పదే పదే తాపత్రయపడ్డ ఆ రామరాజ్యం యెలా వుండేదని? "సర్వ వర్ణములవారును స్వధర్మము తప్పక తమ తమ వృత్తులాచరించుకొనుచు నిత్యసంతుష్టులై" పరస్పర కలహాలు, పరహింస లేకుండా సుఖంగా వుండేవారట. వాల్మీకి గ్రంథాంతంలో -

"బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రాలోభ వివర్జితః
స్వకర్మసు ప్రవర్తన్తే తుష్టాః స్వైరేన కర్మభిః
అన్య ప్రజా ధర్మరతా రామేశానతి నానృతా
సర్వే లక్షణ సమ్పన్నా స్సర్వే ధర్మ పరాయణః"

అని రామరాజ్యవైభవం చాటాడు. అంటే, వర్ణవిభజన అంతరాలు వుంటేనే "పాల్యపాలక ధర్మములు" నడిచేయి. ఇలాంటి అంతరాలు పాటించవలసిన మత ధర్మం జన్మతః వచ్చేదే కాని స్వీకార యోగ్యత లేనిదే కదా? స్వీకరించాలి అని భావిస్తే అంతరాల దొంతర్లో ఎందులోకి వెళ్ళాలి? ఎవళ్ళు రానిస్తారు?

"క్రీ.పూ. 150 ఏండ్లనాడు హెలియోడరస్ అను గ్రీకువాడు హిందువై, భీల్సా స్టేషన్ సమీప మందలి చెస్నాగర్‌లో గరుడస్తంభ మెత్తించి శాసనము వ్రాయించి తాను భాగవత మతమును స్వీకరించినట్లు తెలుపుకొనెను" అని "ఆంధ్రుల సాంఘిక చరిత్ర"లో శ్రీ సురవరం ప్రతాప రెడ్డిగారు రాశారు. హెలియోడరస్ భాగవత "మత" మవలంబించి విష్ణుభక్తుడయేడు. కాని 'హిందువు' అయినట్లు చెప్పలేం. ఇవాళ శ్రీకృష్ణ భక్తులు ప్రపంచమంతా వున్నారు. భగవద్గీత పఠిస్తూ వుంటారు. గుండు కొట్టించుకుని, పంచకట్టి, లాల్చీ వేసుకుని భక్తి గీతాలు పాడుతూ వుంటారు. ఆడవాళ్ళు చీర జాకెట్ సింగారించుకుని బొట్టు పెట్టుకుంటారు – ఇవే యీ మతానికి చిహ్నాలైనట్టు! దయానంద సరస్వతి (1824–1883) ఆర్యసమాజం స్థాపించి మత సంస్కరణకి పూనుకున్నాడు. హిందూమతంలోకి అన్యుల్ని మార్చడం వో ఉద్యమంగా సాగింది. కచ్చితంగా చెప్పాలంటే అన్యమతాల్లోకి మారిన హిందువుల్ని మళ్ళీ "హిందూమతం"లోకి మార్చడం మాత్రం జరిగింది! కాని అసలు హిందూ మతంలోకి 'రావడం'అనేది జన్మ వల్లనే – యేదో వో కులంలో పుట్టడం వల్లనే సాధ్యమవుతుంది. క్రైస్తవ మతంలోకి, ఇస్లాం మతంలోకి మారినట్లు 'హిందూమతం'లోకి మారడం యెందుకు కుదరదు? అలా మారే పరిస్థితి లేదు కాబట్టే. వర్ణవ్యవస్థ, కుల వ్యవస్థ దీనికి కొంత కారణం. యేదో వో కులంలో జన్మించక పోయినట్టయితే హిందూచట్టంలో స్థానం వుండదు. పెళ్ళిళ్ళకి భోజన భాజనాలకి, సంతానం సమాజంలో పొందే మర్యాదలకి, సమాజంలో సంబంధాలకి ప్రాతిపదిక కులమే. ప్రతి కులానికీ కట్టుబాట్లు, ఆచార వ్యవహారాలు, సాంఘిక ధర్మాలు బిగిసిపోయివున్న వ్యవస్థ 'హిందూ మతం'. వో ఇంగ్లీషు కృష్ణభక్తుణ్ణీ, ఆస్ట్రేలియన్ భక్తుణ్ణీ, రష్యన్ భాగవతుణ్ణీ భారత దేశంలోని హిందువులు తమలో కలవనిస్తారా? పెళ్ళికి పిల్లనిస్తారా? వో కులానికి యింకో కులానికీ మధ్యనే ఇలాంటి సంబంధాలు వుండని పరిస్థితిలో అలాంటిది సాధ్యమా? వో కులం నుంచి ఇంకో కులానికి

మారడమే అసాధ్యం అయిన పరిస్థితిలో అన్యమతస్థులు యీ మతంలోకి మారడానికి అవకాశం వుందా? వోరకంగా చెప్పాలంటే వో కులానికీ ఇంకో కులానికీ మధ్య, వో 'మతాని'కీ యింకో 'మతానికి మధ్య వున్నంత అంతరం యేర్పడ్డ పరిస్థితిలో 'హిందూమతం'లోకి పైవాళ్ళు రావడం సాధ్యమా?

'వేషమునకైన దాసరి కావచ్చు
హంగుదప్ప వేళ జంగమగును
పదియువేలకైన బాపడు కారాదు'

కదా అని వేమనగారు అననే అన్నారు. "వేరే జాతివాడు విప్రుడు"[1] కాలేనప్పుడు ఈ మతంలోకే మారడం యెలా? కాలేజీల్లో సీట్లకోసం, ఉద్యోగాలకోసం అప్లికేషన్లు పెట్టేవాళ్ళు Nationality, Religion అనే వాటితోబాటు Caste అనే విభాగం కూడా నింపుతూ వుంటారు. (రిజర్వేషన్‌కి అర్హమవునో కాదో తెలియచేసేందుకు మాత్రమే caste విభాగం నింపాల్సి వచ్చినా 'హిందువు'లంతా అక్కడ కులం యేమిటైందీ రాస్తూ వుంటారు.) మరి ఏ దేశంలోనూ లేని ప్రత్యేక అంశం యిది! కులం అనేది భారతదేశంలోని హిందువుల్లో మాత్రమే కాదు, యీ దేశంలో క్రైస్తవ మతం పుచ్చుకున్న వాళ్ళల్లో, మహమ్మదీయుల్లో, సిక్కు మతస్థుల్లో కూడా పాదుకుంది. కులం గట్టిపట్టు అదే! అలాగే 'కులవ్యవస్థ' అనే విభజన కిందికి కచ్చితంగా చేరని తెగలూ 'హిందూ మతం'లో చాలా వున్నాయి.

వివిధ వర్ణాల వాళ్ళు, వివిధ కులాల వాళ్ళు[2] హిందూమతం అనే విస్తృత విశ్వాసాల పరిధిలో జీవిస్తూ వున్నారు. 'హిందూ' అని వ్యవహరించే యీ 'మతం'లో అందరికీ వొకేరకమైన విశ్వాసాలు లేవు, అందర్నీ వొకే అధిపత్యం కిందికి తెచ్చే పీఠం లేదు, ప్రామాణికమైన

---

1. కొంకణంబు పోవఁ నక్క సింహము కాదు
కాశిపోవఁ బంది గజము కాదు
వేరె జాతివాడు విప్రుడు కాడయా
విశ్వదాభిరామ వినురవేమ. (జాతి అంటే కులం అనే గ్రహించాలి.)

2. సామాన్యంగా వర్ణం, కులం అనే వాటిని వొకే అర్థంలో వాడుతూ ఉన్నా యీ రెండింటికీ తేడా వుంది. దీన్ని గురించి విడిగా అధ్యయనం చెయ్యాలి. కాని వర్ణ వ్యవస్థ అనేది హిందూ మతంలో భాగం.

గ్రంథం అనేది లేదు – క్రైస్తవులకు బైబిల్‌లాగా, మహమ్మదీయులకి ఖురాన్‌లాగా, "భగవద్గీత" హిందూ తత్వానికి ప్రతీకగా తర్వాత యెదిగింది. పోనీ హిందువులనే వాళ్ళందరికీ వేదాలు శిరోధార్యం కదా, వేదాలే ప్రమాణంగా వుండాలి కదా? అలా వున్నాయా అంటే అదీలేదు.

హిందూ దృక్పథంలో అగమ, నిగమ విభేదాలు వున్నాయి. ఉత్తర భారతంలో అగమ విధానాన్ని తంత్రశాస్త్రపరంగా వాడతారు. దక్షిణ భారతంలో అగమమనే పేరుతో ప్రత్యేక తరహా సాహిత్యం వుంది. ఇవి ఓ 28 దాకా వున్నాయట. శైవ అరాధన ముఖ్యంగా వుంటుంది. "అగమ విధానం కూడా వైదికేతరమైనను వైదిక విధాన సన్నిహితమై వేదోక్తమంత్రముల కలయికతో దేవాలయము లందాచరించబడుచున్నది" అని, "యంత్రములు విగ్రహములు ధ్వజస్తంభములు తత్ప్రతిష్టలు మొదలగునవన్నియు నాగమోక్త విధానముననే జరుగుచున్నవి" అని శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు రాశారు. నిగమం అంటే వేదం. అగమంలోని "ఉపాసనా విధాన మత్యంతము భిన్నము సవిస్తరము" – అంటే నిగమంలో దానికంటే, "యీ రెండింటి మార్గములే వేఱు" అని శాస్త్రిగారే రాశారు. శాక్తమతంలోని ఒక్క మంత్రమూ వేదంలో లేదు. ఇదీ వేద ప్రామాణ్యం!

బసవేశ్వరుడు లింగాయత మత స్థాపకుడు, వేద ప్రామాణ్యం అంగీకరించలేదు. అలాగే చార్వాకులూనూ. కాని వీళ్ళందర్నీ 'హిందూ' పరిధిలో వున్నట్టు పరిగణిస్తూనే వున్నారు!

'హిందూ' తత్వం అనేది భారతదేశంలో అనేక విభాగాల్ని యిముడ్చుకుంది. ఆ రకంగా వో విధమైన మార్పు యెప్పుడూ జరుగుతూనే వుంది. ఈ మార్పుని మతాంతీకరణం అని నిక్కచ్చిగా అనలేం కాని 'హిందూ' విశ్వాసాల విస్తృతి అని మాత్రం చెప్పచ్చు. "పరానికి యిన్ని నీళ్ళచుక్కలు వొదిలే వాడుండాలని" బోధచేస్తూ "కన్యాశుల్కం"లో రామప్పంతులు లుబ్ధావధాన్లని పెళ్ళికి వొప్పించచూస్తాడు. "అలా అయితే తమరెందుకు పెళ్ళి చేసుకున్నారు కారూ?" అని లుబ్ధావధాన్లు యెదురు అడిగేటప్పటికి.... "పరానికా? నేను శాక్తేయుణ్ణి, యోగసాధనం చేస్తాను. నాకు మరి కర్మతో పనిలేదు. లోకం కోసం తద్దినాలు పెడుతున్నాను" అని రామప్పంతులు తనకున్న అవకాశం యేకరువు పెడతాడు. ఇంత వెసులుబాటు హిందూ విశ్వాసమే కల్పించింది. హిందువులు భగవంతుడు సర్వాంతర్యామి అంటారు. జగత్తంతా వ్యాపించి వుంటుంది పరతత్వం అంటారు.

"త్రయీ సాంఖ్యం యోగం పశుపతి మతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిద మదః పథ్యమితిచ
రుచీనాం వైచిత్ర్యాత్ ఋజుకుటిల నానాపథజుషాం
నృణామేకోగమ్యః త్వమసి వ. యసా మర్ణవమివం॥"

(వైదికం, సాంఖ్యం, యోగం, పశుపతి మతం, వైష్ణవం మొదలైన అసంఖ్యాక విభిన్నమార్గాల్లో యిదే శ్రేష్ఠం, యిదే గ్రహణీయం అని భావిస్తూ అభిరుచిని బట్టి మంచి చెడ్డలైన మార్గాల్లో నడుస్తూ వున్న మానవకోటికి గమ్యం నీవేకదా ఈశ్వరా! నదులకు సాగరం కాక వేరే గమ్యం యేముంది?) యిలా పరతత్వం "మానవకోటి"కి - అంటే హిందువులందరికీ-వొకటే నంటారు.

నదేవో విద్యతేకాష్టే నపాషాణే నమృణ్మయే
భావేతువిద్యతే దేవః తస్మాద్భావోహి కారణమ్

(కొయ్యలో, రాతిలో, మట్టిలో దేవుడు లేడు. భావంలోనే దేవుడున్నాడు. భావనే దానికి కారణం.)

అని ఐకాంతిక భక్తి భావనని బోధిస్తూనే అనేకమంది దేవుళ్ళని విగ్రహారాధన చేస్తూ కొలవడం హిందువుల్లో వుంది. ఏ దేవుణ్ణి పూజించేవాళ్ళు ఆ దేవుడే గొప్ప అనుకుంటూ వుంటారు. ఆ గొప్పతనం రుజువు చెయ్యడానికి అష్టాదశ పురాణాల్లోనూ వున్న అనేక కథలని సాక్ష్యం తెచ్చుకుంటూ వుంటారు. "ఏకోదేవః కేశవోవాశివోవా (కేశవుడో శివుడో వొకడే దేవుడు) అని విష్ణుభక్తులు, శివభక్తులు శ్రుతిమించి అతిగాపోయి వీర రసమూర్తులై[1] తన్నుకు చావడం చరిత్రలో కనిపిస్తుంది.

---

1. ఇటీవల కూడా వైష్ణవ శైవ భేద తీవ్రతకి దాఖలా వున్నట్టు 'ఆమ్నాయ కళానిధికి ఆదిలోనే హంసపాది' అన్న సామెతవల్ల తెలుస్తోంది. "నెల్లూరు పండితుడు నేలటూరు పార్థసారది అయ్యంగారు (వెంకటగిరి ఉన్నత పాఠశాల ఆంధ్రాధ్యాపకులు) 'ఆమ్నాయ కళానిధి' పేర ఆంధ్రభారతం ఉద్యోగ, స్త్రీ, శాంతి పర్వములకు టీకను వ్రాసి ప్రచురించారు. మొదటి 'శ్రీయన గౌరి నాబరగు' అనే పద్యములో గౌరికి అర్థమును చెప్పక వదలివేసినారు. (వైష్ణవఛాందసం కామాల.) దీనిమీద పూాండ్ల రామకృష్ణయ్యగారు తమ 'అముద్రిత గ్రంధ చింతామణి' పత్రికలో యీ శీర్షిక కింద తీవ్రంగా విమర్శించినారు." (తెలుగు సామెతలు, మూడవ కూర్పు, ఆంధ్రసాహిత్య అకాడెమీ, పేజీ 93. మరుపూరు కోదండ రామిరెడ్డి (కన్వీనర్) నోట్ )

కాని శివుడు, విష్ణువు కూడా పరబ్రహ్మ స్వరూపాలే అంటూ ఏదో రాజీచేసి అన్ని నమ్మకాలనీ సమంగా చూడ్డానికి 'తత్వవిదులు' సాధనాలు కనిపెట్టారు. ఆయా సందర్భాలకి తగ్గట్టు హిందూమతం భగవంతుణ్ణి గురించిన భావనలని సర్దుబాటు చేసింది. గ్రామదేవతలనుంచి - గొంతెమ్మ, పోలేరమ్మ, ఎల్లారమ్మ, వగైరా వగైరా - నిరాకార నిర్గుణ నిరంజన బ్రహ్మదాకా హిందూమతంలో పీటలున్నాయి. దేవుళ్ళల్లో కూడా కాలాన్నిబట్టి ఉచ్ఛదశలో వుండే దేవుళ్ళూ వున్నారు, వెనక స్థానాలకి తగ్గిన వాళ్ళూ వున్నారు. ఈ 'కలియుగం'లో తిరుపతి వేంకటేశ్వరుడు - వడ్డీకాసులవాడు - వైభవంగా భోగం జరిపించుకుంటున్నాడు. ఇంకా యీ మధ్యకాలంలో 'అయ్యప్ప' ప్రభ వెలిగిపోతూ వుంది. సాయిభక్తి యిటీవల మరీ ప్రాచుర్యం పొందుతోంది. మొత్తం మీద అంతా హిందూమతం పేరుకిందనే జమ అవుతోంది. కాని, హిందూ మతానుయాయు లందరికి యేక సూత్రంగా వర్తించే యేకైక సిద్ధాంతం అనేది లేదు. అనేక సిద్ధాంతాలతో హిందూమతం యింత విశాలంగా ఆకాశం అంత పందిరీ, భూదేవి అంత అరుగు వేసుకుని, మతం అంటే మామూలుగా బోధపడే నిర్వచనానికి వొదగకుండా ఉంది. హిందూతత్త్వం అనేక సిద్ధాంత విశ్వాసాలని సహిస్తుంది. కాని సాంఘిక జీవితంలో కులం కట్టుబాట్లని, ఆచార వ్యవహారాలని, విధి నిషేధాలని సడలనివ్వదు, ఆ సహనం లేదు. వో పక్క అన్ని ధోరణుల్నీ సహించే వెసులుబాటు, మరో పక్క ఏమాత్రం బెసకని కట్టుబాటు - యిది హిందూ మతంలో వున్న (నిక్కచ్చిగా మతం అనడానికి నిర్వచనం చోటివ్వక పోయినా వాడుకలో వొక అవగాహనని అందిస్తోంది కాబట్టి అలాగే వ్యవహరించాల్సి వస్తోంది) పెద్ద వైరుధ్యం.

భారతదేశంలో ఈ హిందూ జీవిత విధానంలో పుట్టిన వాళ్ళకి యీ వైరుధ్యాల సంగతి తెలీదు, అసలు వైరుధ్యం వుందనీ గ్రహించలేరు. ఏదో వో కులంలో పుట్టడం, ఆ కులం ధర్మం అనుసరించడం, భగవన్నామస్మరణ చేసుకోవడం, ముక్తి మార్గం చూసుకోవడం మేరకే మతం అంటే వాళ్ళకి వున్న అవగాహన. కులాల పట్టకంగుండానే హిందూమతం వెల్లడవుతూ వుంటుంది; యీ భిన్నత్వంలో నుంచి హిందూ మత ఏకత్వం అవగాహన అవుతుంది, యీ ఏకత్వం ఆ భిన్నత్వంలోనే వెల్లడవుతుంది.

యీ భిన్నత్వాన్ని చూసినవాళ్ళకి హిందూమతం వొకలా బోధపడితే, ఆ ఏకత్వాన్ని తాత్వికంగా గ్రహించిన వాళ్లకి మరోలా బోధ పడింది.

వేదాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, షడ్దర్శనాలు, మహాభారత రామా యణ ఇతిహాసాలు పురాణాలు విశిష్ట జీవిత దర్శనం అందిస్తున్నట్టు అనేకమంది పాశ్చాత్యులు మురిసిపోయేరు. సర్ విలియమ్ జోన్స్, ఛార్లెస్ విల్కిన్స్, మాక్స్ముల్లర్ లాంటి ఉద్దండులు హైందవ తాత్త్విక చింతన లోని ఔన్నత్యాన్ని హర్షించేరు. సంస్కృతభాష ఔన్నత్యాన్ని విదేశీయులకి చాటేరు. వాళ్ళు పొగిడిన దగ్గర్నుంచే మనదేశంలోని విద్యాధిక అగ్రవర్ణాలవాళ్ళూ మన గొప్పతనం యిది కదా అని దృష్టి సారించేరు.

సంస్కృత భాష ద్వారా హిందూ చింతన విశిష్టతని, హిందూమత ఏకత్వాన్ని వాళ్ళు అందుకుంటే, సామాన్య జీవితాన్ని - హిందూమత ఏకత్వం వెల్లడయే భిన్నత్వాన్ని - చూసినవాళ్ళు 'ఇదేం మతంరా బాబూ' అని మొత్తుకున్నారు. వర్ణాధిక్యత, వో కులం మీద యింకో కులం పెత్తనం చలాయించడం వాళ్ళు చూశేరు. సతీసహగమనం, జంతుబలులు, కింది కులాల్లో వున్న అవిద్య, మూఢత్వం, దాస్యభావం వాళ్ళు చూశేరు. సాంఘికంగా వెలపరం పుట్టించే ధోరణులు ఉన్నట్టు చూశేరు. గ్రామ దేవతల జాతరులు, తాంత్రిక పూజలు, దెయ్యంపూనకాలు, అంజనాలు, తాయెత్తులు, మూఢనమ్మకాలు జనాన్ని అధోగతిలో వుంచేస్తున్నట్టు వాళ్ళు చూశేరు. ఇదంతా హిందూమతం భిక్ష అని వాళ్ళు భావించేరు. దీన్ని సంస్కరించి, యీ దేశప్రజల్ని బాగు చెయ్యాలని, అలా బాగుచెయ్యడం తమ కర్తవ్యం అని క్రైస్తవ మత మిషనరీలు అనుకున్నారు.

గత శతాబ్దంలో విద్యాధికులైన మన దేశీయులు కూడా ఈ పరిస్థితిలోని రెండు పార్శ్వాలనీ పాశ్చాత్య ప్రభావం వల్ల చూశారు. సంస్కరించాలని నడుం కట్టేరు. రాజా రామమోహనరాయ్ లాంటివాళ్ళు అందుకు ఆద్యులయేరు.

సంస్కరించడం అనేది కాలానుగుణంగా అన్ని జీవిత దర్శనాలకీ ఎప్పుడూ జరగాల్సిందే, తప్పదు; అడ్డినా, సంస్కరణ ఆగదు. కాని హిందూమతం ప్రపంచానికి సమదర్శనం ఇవ్వగలిగిన సిద్ధాంతం అని అభిమానులు ఆకాశానికి ఎత్తుతూ వుంటే అనాగరిక జీవితాన్ని అలా నిలబెట్టే మూఢవిశ్వాసాల పుట్ట అని విమర్శించేవాళ్ళు ఖండిస్తూ వున్నారు. అంటరానితనాన్ని ఆమోదించే మతం ఏమి మతం అని అంబేద్కర్ జీవితమంతా పోరాడి పోరాడి చివర్లో బౌద్ధ మతం స్వీకరించాడు. అంటరానితనాన్ని నిర్మూలించాలనీ, అసలు హిందూ ఆధ్యాత్మిక చింతన

ఔన్నత్యం నిలబెట్టాలనీ 'సనాతనిస్టు'నని చాటుకున్న మహాత్ముడు కృషిచేశాడు.

అంటరానితనం కులవ్యవస్థలో భాగం. కులవ్యవస్థ హిందూమతంలో పెనవేసుకుపోయింది. వర్ణవ్యవస్థకి మూడు వేల సంవత్సరాలకి పైబడి వెనకదన్ను వుంది. హిందువుల నడవడిక, ఆచారాలు వర్ణవ్యవస్థకి అనురూపంగానే పెరిగాయి. కులం మార్చుకోవడం అసాధ్యం, మతం మార్చుకోవచ్చుగాని. ఏదో వో కులంలోకి మారాలి హిందూమతంలోకి రావాలంటే. కట్టుబాట్లతో బిగిసిపోయిన కులాలు అందుకు అవకాశం యివ్వవు.

ఇలాంటి జీవిత విధానం భారతదేశంలో పాతుకు పోయింది. ఈ దేశ సాంఘిక వ్యవస్థలో, సంస్కృతిలో రూపరహితమైన – లేదా బహురూపమైన – హిందూ జీవిత విధానం అంతర్భాగమైపోయింది. కులం, కుటుంబం, గ్రామం వ్యక్తిని అనేక నియమాలతో శాసించి వుంచేవి. ఆ కర్తవ్య పాలనకే ప్రతి వ్యక్తీ బద్ధుడు. ఏది, ఏమిటి, ఎందుకు అని ప్రశ్నించడం మాట సరేసరి, ఆ జీవిత నియమాల్ని పాటించకపోతే యిహ–పరలోకాల్లో రుచి చూడాల్సిన చిక్కులు భయావహంగా వుండేవి. వోరకంగా స్వయం పోషకంగా వుండే గ్రామీణ జీవిత విధానం కాబట్టి ఆ పద్ధతి ఆటుపోట్లు లేకుండానే సాగింది. ఆ ఉత్పత్తి విధానం వున్నంతకాలం ఆ నమ్మకాలు నిలుస్తూనే వుంటాయి. 'కాలం చెల్లిన ధోరణులు' అని పాశ్చాత్యులు పిలిచేవి భారతదేశంలో నిలిచి వుండడానికి యిదేకారణం. జీవిత విధానం మారి 'పుట్టకేట్లు కదిల్చే' ఇంగ్లీషు చదువులు అబ్బేటప్పటికి దృక్పథంలో మార్పు వచ్చింది.

"ఈ వెధవ ఇంగ్లీషు చదువు నుంచి బ్రాహ్మణ్యం చెడిపోతుంది. దేవభాషలాగా భోజనాల దగ్గర కూడా ఆ మాటలే కూస్తారు. 'సంధ్యావందనం, శ్రీసూక్త, పురుష సూక్తాలూ' తగలబడిపోయినాయి కదా?" అని అగ్నిహోత్రావధాన్లు 'గట్టిగా కేకవేసి' చెప్పేడు అంటాడు గిరీశం "కన్యాశుల్కం" నాటకంలో.

ఇంగ్లీషు చదువువల్ల మన 'మతం'లో లోపాలు గుర్తించి సంస్కరించాలని రామమోహన్‌రాయ్ లాంటివాళ్ళు ఉద్యుక్తులయితే, ఆ చదువువల్ల 'బ్రాహ్మణ్యం' చెడిపోయిందని సనాతనవాదులు అక్కసు వెళ్ళగక్కేరు.

ఇప్పుడు వో ప్రశ్న: హిందూ మతం అనకుండా బ్రాహ్మణ్యం చెడిపోతూందని ఎందుకన్నట్టు?

హిందూమతం పునాది అదే. ఇది వొక మతంకాదు – వో జీవిత విధానం.

## 2

'హిందూమతం' అన్న పేరు క్రీ.శ. 8వ శతాబ్దంలో అరబ్బుల వల్ల వ్యాప్తిలోకి వచ్చింది. ('హిందూ' అనేది పర్షియన్ పదం, ఆ భాషలో నల్లని అని అర్థం.) "ఉదయం బస్తనగంబు సేతువు హిమ వ్యూహం" ఎల్లలుగా వున్న యీ భూఖండంలోని జీవిత విధానానికి హిందూమతం అనే పేరు స్థిరపడింది. ఈ దేశాన్ని 'హిందూదేశం' అని వ్యవహరించడం వాడుక అయింది. (స్వాతంత్ర్యం వచ్చేక మత వాసన సోకకుండా భారతదేశం అని రాజ్యాంగంలో నామకరణం చేశారు. చారిత్రకంగా అదే సమంజసం కూడా.)

పేరైతే అలా వచ్చి వుండవచ్చు. కాని అంతకుముందు ఎన్నో వేల యేళ్ళుగా ఆ జీవిత విధానం వుందికదా! అప్పుడు ఎలా వ్యవహరించేవారు?

బ్రాహ్మణ మతం అనీ, ఆర్షధర్మం అనీ, వైదిక మతం అనీ పిలవడం కనిపిస్తుంది. సనాతన ధర్మం అనీ వాడుక వుంది.

ఋషిప్రోక్తం (ఆర్ష) వేదవిహితం (వేదాలు చెప్పింది) బ్రాహ్మణవర్ణ ప్రవర్థితం యిది. శివుణ్ణి, విష్ణువుని ఆరాధించడం యీ మతంలో ప్రాచుర్యంగా వుంది. కుల వ్యవస్థ వుంది. కర్మగురించీ, ధర్మం గురించీ నమ్మకాలు వున్నాయి. వేదాలు అపౌరుషేయాలు అన్న నమ్మకం వుంది. అంటే మనిషి కృతం కాదు అని. అవి శ్రుతులు, వెల్లడైనవి. వేదాధికారాన్ని ప్రశ్నించే హక్కు ఎవళ్ళకీ లేదు. అంచేత వేదంలో వున్న వ్యవస్థ అలా సాగాల్సిందే. ఋగ్వేదంలోని పురుష సూక్తం నాలుగు వర్ణాలూ ఎలా ఏర్పడ్డాయో వివరిస్తుంది.

"బ్రాహ్మణోస్య ముఖమాసీత్ బాహూ రాజన్యకృతః, ఊరుతదస్యయ్యై ద్వైశ్యః పద్భ్యాగం శూద్రో అజాయత" అని పురుష సూక్తంలో వుంది. బ్రాహ్మణులు విరాట్ పురుషుని ముఖంనుంచి, క్షత్రియులు భుజాలనుంచీ, వైశ్యులు ఊరువుల నుంచీ, శూద్రులు పాదాల నుంచి ఉద్భవించేరు అని అర్థం. యీ చాతుర్వర్ణ విభాగంలో అస్పృశ్యులు లేరు. అందుకని

వాళ్ళని పంచములన్నారు. ఈ విభజన కిందికి రాని అలాంటి వాళ్ళు కూడా యీ దేవతల్ని, వర్ణవ్యవస్థ హెచ్చు తగ్గుల్ని వొప్పుకుని హిందూ మత విశ్వాస పరిధిలోకి వచ్చేరు. వర్ణ వ్యవస్థ స్వాభావికంగా అలా వున్నటువంటిదేనని హిందువులందరి అభిప్రాయమూనూ. "చాతుర్వర్ణం మయాసృష్టం" అని భగవద్గీతలో సాక్షాత్తూ శ్రీమన్నారాయణమూర్తి అవతారం అయిన శ్రీ కృష్ణ పరమాత్ముడే చెప్పేడు, యిక సందేహం ఏముంది? ఆ రకంగా యీ వర్ణ వ్యవస్థ అనేక కులాల వూడలు దించుకుని – పాతుకుంది. మనిషి జీవితమంతా కుల నిర్దేశిత మార్గంలోనే సాగాలి.

హైందవ చింతనలో రెండు ముఖ్యాంశాలున్నాయి. మోక్షం సాధించడం వొకటి. రెండవది అందుగ్గాను అనుసరించాల్సిన ఆధ్యాత్మిక శిక్షణ. పుట్టిన దగ్గర్నుంచి కిట్టేదాకా ప్రతివాళ్ళూ బోలెడు కర్మలు చెయ్యాల్సివుంది. అనేక సంస్కారాలు పొందాల్సి వుంది. ఈ కర్మ కాండంతా వైదికాచారమే. మనిషి చెయ్యాల్సిన కర్మలు, పొందాల్సిన సంస్కారాలు చేటలో పడ్డప్పట్నుంచి కాటికి చేరేదాకా వో నలభై వుంటాయని వో పండితుడు రాశేడు. ఇవికాక పునర్జన్మ, కర్మ, పుణ్యం, పాపం, ధర్మం, మోక్షంలాంటి విశ్వాసాలు వర్ణ వ్యవస్థతో పెనవేసుకుపోయేయి.

ఉదాహరణకి 'కర్మ' అనే నమ్మకం తీసుకోండి, ఇవాళ తాత్వికంగా ఆ పదాన్ని యెలా వాడుతున్నా నిత్య వ్యవహారంలో వొక్క అర్థంలోనే వుంది; పూర్వ జన్మలో చేసుకున్న పాప – పుణ్యాల్ని బట్టి ఈ జన్మ వుంటుంది. యే కులంలో పుట్టుక వుంటుందో, యే ప్రాణిగా పుట్టుక వుంటుందో దాన్ని పూర్వజన్మ కర్మఫలం నిర్ణయిస్తుంది. సత్కార్మలు చేసుకున్నవాళ్ళు అగ్రవర్ణాల్లో పుడతారనీ, దుష్కర్మలు చేసుకున్నవాళ్ళు ఛండాలులుగా, హీన పశువులుగా పుడతారనీ ఛాందోగ్యోపనిషత్తు చెపుతోంది. అసలు 'దుర్లభోమానుషీ దేహః' (మనుష్య జన్మమే దుర్లభం). 'భూతానాం ప్రాణినః శ్రేష్ఠా, ప్రాణినాం బుద్ధి జీవినః, బుద్ధి మత్సునరాః శ్రేష్ఠాః, నరేషు బ్రాహ్మణా స్మృతాః' (సమస్త భూతాల్లోనూ ప్రాణులే శ్రేష్ఠం, ప్రాణులలో బుద్ధితో వున్నవి, బుద్ధి వున్నవాటిలో మనుష్యులు శ్రేష్ఠం, మనుషుల్లో బ్రాహ్మణులు) అని ఆర్య ధర్మం చాటుతోంది. ఇదే విషయాన్ని ధర్మశాస్త్రాలూ చాటుతున్నాయి. ఇలా పుడుతూ ఛస్తూ కర్మనిబట్టి జీవుడు 'సంసార బంధాన్ని' తెంచుకుని మోక్షం సాధిస్తాడని సూత్రకారులు చెప్పేరు. ఆయా కులాల్లో పుట్టుకే కర్మ ఫలాన్నిబట్టి. ఆ హెచ్చుతగ్గుల అంతరంవున్న కులంలో పుట్టుకే కర్మఫలాన్ని బట్టి సిద్ధిస్తుంది. అంటే

తక్కువ కులంలో పుట్టడం కాని, హెచ్చుస్థాయిలో జన్మించడం గాని సాయుజ్యానికి సూచికగా పనిచేస్తుందన్నమాట. స్వర్గనరకాలు ఆ జన్మలో చేసుకున్న కర్మనిబట్టి సిద్ధిస్తూ వుంటాయి. అలా వొక్కొక్కమెట్టే పై జన్మలకి పాకి, సంసారచక్రం నుంచి, జనన మరణాల సుడిగుండం నుంచి తప్పించుకోవడానికే ప్రతివాళ్ళూ ధ్యానించాలి. పుణ్య పాప రూప కర్మలకి ఫలభూతమైన స్వర్గ నరకాల్ని అనుభవించాక మిగిలిన పాప పుణ్యాల వాసన వున్నవాణ్ణి "అనుశాయి" అంటారని, ఆ దశకి వో పేరుకూడా వుంది. ఇలా "బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" (అనేక జన్మలనెత్తి చివరకు జ్ఞానవంతుడై జీవుడు వాసుదేవుణ్ణి పొందుతాడు) అని గీతలో వుంది.

అయా వర్ణాలవాళ్ళూ యెలా నడుచుకోవాలో 'ధర్మం' నిబద్ధిస్తోంది. ధర్మశాస్త్రకారులు ఆ ప్రవర్తనా నియమావళిని సంపుటీకరించారు. ధర్మశాస్త్రకారులు చాలా మంది వున్నారు. ధర్మం యేమిటో నిర్వచించారు. కాని మనుధర్మశాస్త్రానికి అన్నిటికంటే ఎక్కువ ప్రామాణికత వచ్చింది. ధర్మమే ప్రజల్ని ధరిస్తూవుందనీ, సంఘాన్ని కట్టుబాటులో వుంచేదే ధర్మమనీ మహాభారతం చాటుతోంది. వర్ణాలవారీగా ధర్మాచరణ యెలా వుండాలో చాటుతూనే నాలుగు వర్ణాలవారికీ వర్తించే పరమధర్మం యేమిటో కూడా మనువు చెప్పేడు.

*శమోదమోధృతిః క్షమా శౌచమింద్రియ నిగ్రహః*

*ధీర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మలక్షణం*

(శమ, దమ, ధైర్యం, ఓర్పు, శుచిత్వం, ఇంద్రియ నిగ్రహం, తెలివి, జ్ఞానం, సత్యం, కోపం లేకపోవడం అనే పదీ ధర్మలక్షణాలు) అని అర్యధర్మం ఉపదేశిస్తోంది. 'భగవద్గీత' పద్దెనిమిదవ అధ్యాయం "మోక్ష సన్యాస యోగం" లో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర విహిత కర్మలు యేమిటో శ్రీకృష్ణుడు వివరించేడు.

*బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాంచ పరంతప*

*కర్మాణి ప్రవిభక్తాని స్వభావ ప్రభవైర్గుణైః*

(పరంతపా! బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులకు వారి వారి స్వభావం వల్ల కలిగిన గుణాలనుబట్టి కర్మలు విభజించబడ్డాయి.)

శమోదమస్త పశ్శౌచం క్షాంతిరార్జవ యేవచ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మంకర్మస్వభావజమ్

(బ్రాహ్మణులకు స్వభావ సిద్ధమైన కర్మలు ఇవి: మనోనిగ్రహం, బాహ్యేంద్రియ నిగ్రహం, తపస్సు, శుచిత్వం, ఓర్పు, సత్ప్రవర్తన, శాస్త్రజ్ఞానం, అనుభవజ్ఞానం, దేవుడిమీద నమ్మకం.)

శౌర్యం తేజోధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్య పలాయనమ్
దానమీశ్వర భావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్

(పరాక్రమం, పౌరుషం, ధైర్యం, దక్షత, యుద్ధంలో పారిపోకపోవడం, దానం, పరిపాలనా సామర్థ్యం – ఇవి క్షత్రియుల కర్మలు.)

కృషి గోర్క్ష వాణిజ్యం వైశ్యం కర్మ స్వభావజమ్
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్

(వైశ్యులకు స్వభావం వల్ల కలిగిన కర్మలు: వ్యవసాయం, పశుపోషణ, వ్యాపారం, ఇక శూద్రుల కర్మ సేవ చేయడం[1]) వాళ్ళు వాళ్ళ వాళ్ళ కర్మలు ఆచరించడమే ధర్మం అన్నాడు.

శ్రేయాన్ స్వధర్మో నిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వభావ నియతం కర్మ, కుర్వాన్నా ప్నోతికిల్బిషం

(ఇతరుల ధర్మంలో మెరుగులు కనిపించినా, తన ధర్మంలో లోట్లు కనిపించినా యితరుల ధర్మాన్ని కాకుండా స్వధర్మాన్నే అనుసరించాలి. స్వభావనియతమైన కర్మలు చేసేవాడికి పాపం అంటదు) అని శ్రీకృష్ణుడు హామీ యిచ్చేడు. ఇదే విషయాన్ని మనువు చెప్పేడు. ఆ రకంగా వర్ణవ్యవస్థ, దానికి అనువర్తించే ధర్మం శాసితమయేయి.

హిందూమత విశ్వాసాల్లో యిలా కర్మలు చెయ్యడానికీ ధర్మం అనుసరించడానికీ ఆచార నియమాలు విధించేరు. మడి, మైల, అంటు – సొంటు, జపం – తపం లాంటివి హిందూమత ఆచారాలకి ఆయువుపట్లు. దేశంలో ఆయా ప్రాంతాల్నిబట్టి, కులాల్నిబట్టి ఆచారాల్లో భేదాలు వుండచ్చు కాని, ఈ నియమాలు మాత్రం సాంఘిక జీవితంలో చాలా విస్తారంగా వున్నాయి. ఎక్కడ ఏ ఆచారాన్ని ఉల్లంఘిస్తే ఏం పాపం

---

1. శ్రీమద్భగవద్గీత; భావానువాదం: రావుల సూర్యనారాయణమూర్తి; తిరుమల – తిరుపతి దేవస్థానములు, తిరుపతి, 1988.

చుట్టుకుంటుందోనన్న భయం ప్రతివాణ్ణీ పీడిస్తూనే వుంటుంది. "ఆచార లక్షణోధర్మః" అని మహాభారతం చాటుతోంది.

"ఆగమానాం హి సర్వేషాం ఆచారః శ్రేష్ఠ ఉచ్యతే
ఆచార ప్రభవో ధర్మః ధర్మాదాయుర్వివర్ధతే"

(శాస్త్రాలన్నిట్లోకీ ఆచారం శ్రేష్ఠం అంటారు. ఆచారం నుంచే ధర్మం ప్రభవించింది. ఆ ధర్మం వల్ల ఆయుష్షు వృద్ధిచెందుతుంది అని మనువు చెప్పేడు.) దురాచారం మహాపాపం. ("అసలు ఆచారం లేనివాణ్ణి వేదాలు కూడా బాగుచెయ్యలేవని" కోనసీమలో సదాచార సంపన్నులు అంటూ వుండడం నేను చాలాసార్లు విన్నాను.) ఆచారం అంటే నడవడిక, ప్రవర్తన అని మామూలు అర్థం వుంది కాని, మతపరమైన నడవడిక అనే గ్రహించాలి. ఆ అర్థంలోనే ఈ 'ప్రవర్తన' అనేది స్థిరపడింది. అన్నిటికంటే శ్రేష్ఠమైన ఆచారం మడి, మైల, అంటు, సొంటు లాటి వాటితో ముడిపడి వుంది. కులాల మధ్య సంబంధాలన్నీ వీటి నిర్దేశకత్వంలోనే వుంటాయి. పెళ్ళిళ్ళు ఆయా కులాల మధ్యనే జరగాలి. సహపంక్తి భోజనాలు ఆ కులాలమధ్యనే సాగాలి. వొకళ్ళ నొకళ్ళు స్పృశించడం, వొకళ్ళు అందించిన నీళ్ళు వొకళ్ళు తాగడం, యెక్కడేనా భోజనం చెయ్యడం లాంటివన్నీ ఆ నియమాల మేరకే. అంటు, మైలపడ్డం అనేవి హిందూ మత వర్ణ వ్యవస్థలో చాలా బలమైనవి. కొన్ని సందర్భాల్లో చూడ్డంవల్ల కూడా మైలపడి పోవచ్చు. అలా అంటు, మైల సోకిన సందర్భాల్లోనూ మళ్ళీ శుచి శుద్ధి కావాల్సిందే. అందుగ్గాను మైలపడిన సందర్భాన్ని బట్టి శుచి నియమాల స్థాయి యేర్పడింది. వర్ణాల హెచ్చు తగ్గుల్ని బట్టి శుచికీ మైలకీ మెట్లు ఏర్పడ్డాయి. బ్రాహ్మణ్ణి బ్రాహ్మడు తాకితే మైలకాదు. కాని మడికట్టుకున్న బ్రాహ్మణ్ణి బ్రాహ్మడు తాకితే, తాకినవాళ్ళకి ఆ మడి సోకదు కాని వాళ్ళ మడిమట్టుకు కుక్క ముట్టుకు పోతుంది. అప్పుడు మడి కట్టుకున్నవాడు శుచి కావాలి. యిదే రకంగా కులాల హెచ్చు తగ్గుల్ని బట్టి ఈ అంతరాలు వుంటాయి. మడి, మైల, శుచి అనేవి కులాల సంబంధాల్లోనే కాదు – వొకే కులంలో, కుటుంబంలో కూడా సందర్భాన్నిబట్టి వర్తిస్తూ వుంటాయి. పురుడు పుణ్యాల్ని బట్టి అవి ఏర్పడుతూ వుంటాయి. అలాంటి సందర్భాలన్నిట్లోనూ శుచి కర్మకాండ జరగాల్సిందే. ఇక శ్రాద్ధక్రతువులు వుండనే వున్నాయి. పితృదేవతల తృప్త్యర్థం వాటిని యథావిధిగా జరిపించాల్సిందే. వీటికి హిందూ

భావనలో చాలా ముఖ్య స్థానం వుంది. జాతాశౌచ, మృతాశౌచాల సూతకం గురించిన కర్మకాండ చాలా వుంది. మృతాశౌచ సూతకం ఏడాది వుంటుంది. దాన్నే ఏటిసూతకం అంటారు. వాళ్ళు పూజలకీ, పునస్కారాలకీ దూరంగా వుండాలి.

ఇక తిండి తీర్థాలకి సంబంధించిన నిషేధాలు కోకొల్లలు. వీటికి అంటు, శుచి అనేవి హెచ్చుస్థాయిలోనే వున్నాయి. కింది కులాల వాళ్ళ చేతినుంచి పై కులాల వాళ్ళు తీసుకోరు. పై కులాల నుంచి అవరోహణ క్రమంలో కింది కులాలవాళ్ళు తీసుకోచ్చు. అదే విధంగా కులాల మధ్య సందర్భాన్నిబట్టి శుచీ, అశుచీ వుంటాయి. పురుళ్ళు, మరణాలు తాత్కాలికంగా ఆ కుటుంబంలో అశుచి కలిగిస్తాయి. అప్పుడు వాళ్ళనుంచి తిండి తీర్థాలు ఆ కులస్థులు కూడా తీసుకోరు.

ఇవికాక తినేవాటికి సంబంధించి, తాగేవాటికి సంబంధించి నిషేధాలు వున్నాయి. శ్రోత్రియులు ఉల్లిపాయకూడా తినకూడదు. మాంసం సంగతి చెప్పనే అక్కర్లేదు. మద్య మాంసాలు తక్కువ కులాల వాళ్ళు తీసుకుంటారు. ఆ మాంసాహారంలో మళ్ళీ అంతరాలున్నాయి. మొత్తం హిందువు లందరికీ గోమాంసం నిషేధం. పంది, ఎలుకలాంటివి హిందువుల్లోనూ తక్కువ కులాలవాళ్ళే తింటారు.

మాంస భక్షణం కూడా ఏయే సందర్భాల్లో నిషిద్ధమో దానికీ నియమాలున్నాయి. పండగ పార్ణం అని, పండగనాడు నిషిద్ధం. పార్ణంనాడు కాదు. అసలు మాంసాహారులే దాన్ని 'నీచు' అని వ్యవహరించడం చిత్రం!

ఆచార వ్యవహారాలకి సంబంధించి, తిండి తీర్థాలకి సంబంధించి ఇన్ని నియమాలువుంటే యిక పూజలు పునస్కారాలు, వ్రతాలు నోములు ఎన్ని వున్నాయో చెప్పనే అక్కర్లేదు.

నిత్య కర్మలు, నైమిత్తిక కర్మలు, కామ్యకర్మలు అని మూడు విధాల కర్మలు వున్నాయి. అంటే, చెయ్యవలసినవి.

నిత్యకర్మలంటే సర్వదా చెయ్యాల్సినవి. "చేయని యెడల ప్రత్యవాయము గలిగించు శాస్త్ర విహితమగు కర్మలు" (స్నానసంధ్యాది) యివి అని వివరించేరు. నైమిత్తికాలంటే "నిమిత్తమునుబట్టి చేయబడినవి. (శ్రాద్ధము మొదలగునవి)" అని. కామ్య కర్మలంటే "అగ్నిహోత్రాశ్వమేధాది కామ్యకర్మలు." "ఇష్టాపూర్తస్య కామ్యానాం త్రివర్గస్యచయోవిధిః" అని "భాగవతం" చెపుతోంది. ధర్మ, అర్థ, కామాలనే త్రిపురుషార్థ ప్రాప్తి కోసం చేసేవి. (మోక్షం మాత్రం యెవడిది వాడు చూసుకోవాల్సిందే!)

ఈ కర్మలకి తోడుగా వ్రతాలు, నోములు వున్నాయి. వ్రతం సంస్కృత పదం. నోము తెలుగు పదం. అంతేకాని, ఫలసిద్ధి వొకటే. సంస్కృత ఫలసిద్ధినే తెలుగులో నోము పంట అనుకుని మురిసిపోతున్నాం. చాతుర్మాస్య వ్రతం (అషాఢ శుద్ధం నుండి కార్తీక శుద్ధం దాకా నాలుగు నెలలు అవలంబించాల్సిన వ్రతం) శ్రోత్రియులూ, పీఠాధిపతులూ ఇప్పటికీ ఆచరిస్తూనే వున్నారు. వరలక్ష్మి వ్రతం నుంచి మూగనోము దాకా ఆడపిల్లలకి "సౌశీల్యము, మితభాషిత్వము, పులుగడిగిన ముత్తెమువలె నుండుట మొదలగు ప్రశంసనీయమైన లక్షణములను నేర్పుటకు యెంతయో తోడ్పడుననుట నిర్వివాదాంశమ"ని "ఆంధ్రుల చరిత్ర – సంస్కృతి" గురించి రాస్తూ ఖండవల్లి లక్ష్మీరంజనం, ఖండవల్లి బాలేందు శేఖరంగార్లు అన్నారు. వైదిక కర్మ కాండలు వర్ణాల వారీగా విభజితమైవున్నా యీ వ్రతాల్నీ, నోముల్నీ మాత్రం హరిజనులతోసహా అందరూ నడిపించాల్సిందే. వినాయక చతుర్థి వ్రతం ఇవాళకూడా అన్ని కులాల్లోనూ ప్రాచుర్యంగా వుందికదా!

యజ్ఞయాగాది క్రతువులు, షోడశకర్మలు, షట్కర్మలు, నిత్యనైమిత్తిక కర్మలు, వ్రతాలు, నోములు అన్నీ హిందూ జీవిత విధానంలో అంతర్భాగంగానే వున్నాయి. అన్నిటికీ లక్ష్యం 'పురుషార్థ' సాధనే.

పురుషార్థసాధన హిందూమతంలో భాగం. పురుషార్థం అంటే సాధించాల్సిన కోరిక. అది వొక లక్ష్యం. మనిషి చతుర్విధ పురుషార్థాలు సాధించాల్సి వుంది. ధర్మార్థ కామమోక్షాలు అని పురుషార్థాలు నాలుగు. అర్థకామాల్ని ధర్మం ప్రకారం సాధించాలి. చివరకి పొందాల్సింది మోక్షం. ధర్మం (రుజువర్తన), అర్థం (ఐశ్వర్యం), కామం (కోరికలు తీర్చుకోవడం), మోక్షం (ముక్తి). రుజువర్తన ద్వారా అర్థాన్నీ కామాన్నీ సాధించాలి. ఈ మూడు సాధ్యం, సాధించ దగ్గవీనీ, ఆఖరిదైన మోక్షం సిద్ధించాల్సిందే. అది సిద్ధించేందుకు తగ్గప్రయత్నం మిగిలిన మూడింటి ద్వారా జరిపించాలి. వివాహం ధర్మార్థ కామమోక్ష సాధనకి అనువైన వ్యవస్థ అని సూత్రీకరించేరు. ఈ వ్యవస్థాధర్మాన్ని అతిక్రమించరాదనీ చాటేరు.

పురుషార్థ సాధనకి అనుకూలించేటట్టు జీవితాన్ని దశలుగా విభజించేరు. ఆ దశల్నే ఆశ్రమాలు అని ధర్మశాస్త్రాలు సంపుటీకరించేయి. అవి నాలుగు. బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాస ఆశ్రమాలు. యివి మనిషికి ఆదర్శంగా వుండాలి.

"శైశవేభ్యస్త విద్యానాం యౌవనే విషయైషిణాం
వార్ధకే మునివృత్తీనాం యోగేనాంతే తనుత్యజాం"

అని కాళిదాసు "రఘువంశం"లో రఘుకులుల ఆదర్శజీవనం గురించి వర్ణించేడు. (బాల్యంలో విద్య నేర్చుకోవడం, విషయాసక్తత లేకుండా వుండడం, యౌవనంలో గృహస్థాశ్రమం స్వీకరించి ఆ విధులు నిర్వహించడం, వార్ధక్యంలో మునివృత్తితో గడపడం, ఆఖర్న యోగంచేత తనువు త్యజించడం - యివీ పురుషార్థ సాధక దశలు.)

ఇది హిందూ జీవిత దర్శనం. 'ఆధ్యాత్మిక' (పరతత్వ చింతన అనే అర్థంలో) ఐహిక కామనలు రెండింటినీ మిళితం చేసి మొత్తం మోక్షసాధన అనే బిందువు మీద కేంద్రీకరించిన దృక్పథం యిందులో కనిపిస్తుంది. (ఐహికం లేకుండా పూర్తి 'ఆధ్యాత్మిక' దర్శనంతోనే జీవితం గడపడం ఉత్తమం అని మన్నించడం వుంది. యోగులకీ మునులకీ లౌకికుల కంటే యెక్కువ గౌరవం యివ్వడమూ వుంది. కాని, అందరికీ అలా గడపడం సాధ్యంకాదు కాబట్టి మోక్షసాధనకి ఈ మార్గావలంబన ఉచితం అని శాస్త్రకారులు వివరించేరు.)

మొత్తంమీద హిందువులకి పరబ్రహ్మ సాయుజ్యం అంతిమలక్ష్యం. ఇహం కంటే పరం యెక్కువ అనే భావన బాగా పాతుకుంది. ఆచరణలో పూజలు, పునస్కారాలు, ఆచారాలు మనిషి ఆధ్యాత్మిక జీవితానికి పునాదిని కలిగిస్తాయి. ఆధునిక జీవిత విధానం ప్రవేశించేదాకా మతపరమైన దృష్టే జీవితంలో ప్రాచుర్యంగా వుండేది. దీన్నే ఆధ్యాత్మిక జీవిత దృక్పథం అన్నారు. "భారతదేశంలో తత్వశాస్త్రం ప్రధానంగా ఆధ్యాత్మికమైంది....ఆధ్యాత్మికత భారతదేశ జీవితంలో ప్రముఖస్థానం వహిస్తోంది" అని రాధాకృష్ణ పండితుడిలాంటి వాళ్ళందరూ అభిప్రాయ పడ్డారు. ఈ వైఖరి చర్చనీయాంశం అయినా (దేవీప్రసాద్ చట్టోపాధ్యాయ భారతదేశ తత్వశాస్త్రంలో భౌతికవాద చింతన గురించి విపులంగా రాశేరు) మొత్తం మీద యీ దేశ ప్రజలకి ఆ ముద్ర అతుక్కుపోయింది. హిందూదేశ వాసులకి మతపరమైన దృష్టి యెక్కువ అని పేరుపడింది. నిత్యజీవిత వ్యవహారంలో మతం పేరుమీదే అన్నిటినీ జరిపిస్తూన్నట్టూ, భగవంతుని కృపవల్లనే అన్నీ జరుగుతున్నట్టూ వుంటాయి. వ్యాపారస్థులు దేవుడి పేరుమీద మోసం చేస్తారు. రాజకీయ పార్టీలు దేవుడి కృపవల్లనే పోటీ చేస్తూవుంటాయి. దేవుడి దయవల్లనే విద్యార్థులు కాపీకొడుతూ

వుంటారు. ఉద్యోగస్థులు ప్రమోషన్‌లు సంపాదిస్తారు. స్టాక్‌మార్కెట్ షేర్లు నడుస్తూ వుంటాయి. యిలా మొత్తంమీద యెక్కువ విస్తారంగానే మతం, దేవుడు వాడుకలో కనిపించడం 'హిందూ మత' విశిష్టత. ఓ నగరంలో రద్దీగావున్న రోడ్డు మీద వెళ్ళేవాళ్ళు యిరవై నిమిషాల నడకలో అరడజనుసార్లు భగవన్నామస్మరణ చేసేరనీ, వ్యాపార బృందాల్లో పావుగంట వ్యవధిలో తొమ్మిదిసార్లు భగవన్నామ స్మరణ వినిపించిందనీ వొక సర్వేలో తేలినట్టు ధూర్జటి ప్రసాద్ ముఖర్జీ "ఆధునిక భారతదేశ సంస్కృతి" అన్న పుస్తకంలో వెల్లడించేరు.

ఇదంతా మతమా, మత ఆమోదం వుందా అని అడిగితే సమాధానం వుండదు. 'హేలాయా, శ్రద్ధాయా' యెలా భగన్నామస్మరణ చేసినా మోక్షం లభిస్తుందని వీలుకలిగించినప్పుడు యేదేనా చెల్లిపోతుందికదా? 'వైరభక్తి' అవకాశం కలిగించిన మతం హిందూమతం.

*కామోత్కంఠిత గోపికల్ భయమునన్ కంసుండు వైరక్రియా*
*సామగ్రిన్ శిశుపాల ముఖ్య నృపతుల్ సంబంధులై వృష్ణులున్*
*ప్రేమన్ మీరలు భక్తినేము ఇదె చక్రిం గంటి మెట్లయిన ఉ*
*ద్దా మధ్యాన గరిష్ఠుడైన హరిచెందన్ వచ్చు ధాత్రీశ్వరా!*

అని "భాగవతం" చాటుతోంది. జయ, విజయులు శాపవశాత్తూ మూడు జన్మలు రాక్షసులై పుట్టి, మహావిష్ణువుని ద్వేషిస్తూ ఆరకంగానైనా నిరంతరం ఆ నామమే స్మరిస్తూ వుండడం వల్ల తిరిగి వైకుంఠం చేరిన కథ వుంది. అంచేత యేది మతం అని అడిగితే యిదీ అనీ చెప్పడానికి హింధూమతంలో సూక్ష్మత లేదు. వో పద్ధతీ, క్రమం, వ్యవస్థ అనేవి యేర్పాటైవుంటే యేది ఆమోదమో, యేదికాదో తేల్చుకొనే వీలు వుంటుంది. లేకపోతే "చేసేవి మాఘస్నానాలూ దూరేవి దొమ్మరికొంపలూ" అని అగ్నిహోత్రావధాన్లు గింజుకున్నట్టు అవుతుంది. మతం పేరుమీద ఆమోదయోగ్యంకాని పనులు జరగడానికి కట్టుదిట్టంచేసే యంత్రాంగం హిందూ మతానికి లేదు. అంచేత మతపరమైన నిక్కచ్చి బాధ్యతనేది హిందూమతానికి లేదు. అలా లేకపోవడంవల్ల ఇదే హిందూ మతం అని చెప్పడానికీ వీలులేదు. యిది హిందూమతం కాదని చెప్పడానికీ లేదు. యే 'హిందూ' నమ్మకాల వాళ్ళకేనా యేదో వో ప్రమాణం చూపించి సమర్థించుకునే అవకాశం ఆకాశమంత వుందికదా!

హిందూ మతంలో యిలా యెన్నో శాఖలున్నాయి. యెన్ని శాఖలున్నా,

ధోరణులున్నా 'కులం' మాత్రం అన్నింట్లోనూ 'సర్వాంతర్యామి' అయిన దేవుడికంటే బాగా ప్రాచుర్యంగా వుంది. శైవులు, వైష్ణవులు, మాధ్వులు ప్రధాన శాఖలుగా విడివిడిగా వున్నారు. కాని, మత దృష్టి ఆ కులంలో జన్మవల్లనే యేర్పడాలి. మతాన్నిబట్టి కులం కాదు – కులాన్నిబట్టి మతం!

హిందూ జీవిత విధానంలో త్రిమతాధిపతులు శాఖల్ని స్థాపించేరు. పుట్టుకతోనే స్మార్తుడుగా పుట్టి అద్వైత సిద్ధాంతశాఖని అనుసరిస్తూ శివారాధన చేసేవాళ్ళు శంకర మతానుయాయులు. విశిష్టాద్వైతాన్ని అనుసరిస్తూ విష్ణు భక్తులుగా వున్నవాళ్ళు రామానుజ మతానుయాయులు – శ్రీవైష్ణవులు. ద్వైతసిద్ధాంతాన్ని అనుసరిస్తూ "శ్రీమన్మధ్వమతే హరిః పరతరః సత్యం జగత్తత్త్వతో"నని నమ్మేవాళ్ళు మధ్వాచార్య మతస్థులు.

యీ మూడు శాఖల వాళ్ళకీ వేదాలే ప్రమాణం, ఉపనిషత్తులే ఆధారం, భగవద్గీత సర్వం. కర్మకాండల్లో కించిత్ భేదాలు మాత్రం వుంటాయి. మత విహితకర్మలు ఆచరించడంలో కొంచెం తేడాలుంటాయి. స్మార్త, మాధ్వ కృష్ణాష్టమి అనీ, శ్రీరామజయన్తి అనీ, వైష్ణవ శ్రీరామజయన్తి అనీ పంచాంగంలో ఆ తేడాల్ని సూచిస్తూవుంటారు. మూడు శాఖల వాళ్ళకీ వర్తించే వాటిని 'మతత్రయ ఏకాదశి' అని సూచిస్తూ వుంటారు. కాని మొత్తంమీద 'బ్రాహ్మణ్యం' మాత్రం వదల్లేదు. యింకా చెప్తే – యే శాఖ బ్రాహ్మణ్యం ఆధిక్యమో ఆ పట్టింపులు కూడా గట్టిగా వున్నాయి.

త్రిమతాచార్యులు తాత్వికంగా శాఖలు స్థాపించేరు. కాని సాంఘిక నియమాలు మాత్రం మూడు శాఖల్ని బంధించే వుంచేయి. అందులో ముఖ్యమైందే కులవ్యవస్థ. శంకరుని అద్వైత సిద్ధాంతాన్ని అనుసరించి కుల భేదాలు పాటించ కూడదు. ఆత్మ అందర్లోనూ వొకటే అయినప్పుడు కులభేదం యేమిటి? కాని, లోక వ్యవహారానికి కట్టుబడి కుల భేదాల్ని పాటించాల్సి వుంటుందని సర్దుబాటు చేసుకున్నారు. ఆది శంకరుల శిష్యులందరూ కుల వ్యవస్థని సమర్థించేరు. వైష్ణవుల్లో ఆళ్వార్లు కులభేదం నిరసించేరు. కాని సాత్తిన, సాత్తని అని ద్విజద్విజేతర భేదాలు యేర్పడ్డాయి. "సమాశ్రియణమను ముద్రలు వేయించుకుని ఊర్ధ్వపుండ్ర ధారులైన వారందరు ఒకే కులము వారన్నారు." కాని సాత్తిన అంటే ధరించిన, సాత్తని అంటే ధరించని – యజ్ఞోపవీతం ధరించడం, ధరించకపోవడం భేదంతో కులవ్యవస్థ కొనసాగింది. సాత్తినవాళ్ళు బ్రాహ్మణులు. సాత్తని యితరులు. సాత్తనివాళ్ళే వ్యవహారంలో సాతానులు అయేరు. చిన్నయసూరి

సాతాని – చాత్తాది వైష్ణవుడు. తెలుగులో పండితత్రయంగా పేరు పొందిన శ్రీపతి పండితుడు, శివలెంక మంచన పండితుడు, మల్లికార్జున పండితారాధ్యుడు శైవమతమే వేద ప్రతిపాదిత శుద్ధమతం అని "వేద ప్రమాణం"లో సమర్థించేరు. కానీ వాళ్ళూ వర్ణధర్మం వదల్లేదు. "భక్తిమీద వలపు బ్రాహ్మ్యంబుతో పొత్తు వదలలే"నని మల్లికార్జున పండితారాధ్యుడు 'బసవలింగ'నితో మొర పెట్టుకున్నాడు. పాల్కురికి సోమనాధుడు శివతత్త్వమే చతుర్వేదసారం అని కావ్యమే రాశాడు.

యెన్ని ధోరణులు, శాఖలు విస్తరించినా, యెన్ని తాత్విక చింతనలు విలసిల్లినా హిందూమతం బిగిసిన కట్టుబాట్లతోనే వుండిపోయింది. సాంఘిక అంతరాలు వర్ణ వ్యవస్థతో పాతుకుపోయేయి. హిందూమతం అంటే బ్రాహ్మణ కృతం అనేదే సామాన్యాభిప్రాయంగా నిలిచింది.

"హిందూ వ్యవస్థతో పరిచయం వున్న యెవళ్ళకేనా యిది మొత్తం బ్రాహ్మణుల నిర్మితం అన్న భావన తక్కున తగులుతుంది" అని శ్రీరామ్‌పూర్ క్రైస్తవ మిషనరీ విలియం వార్డ్ తన ఉద్గ్రంథంలో రాశేడు.

## 3

హిందూవర్ణ వ్యవస్థలో పైనుంచి కిందిదాకా అంతరాలు యేర్పడ్డంతో సాంఘిక జీవితంలో అది ప్రతిబింబిస్తూనే వుంటుంది. జన్మనిబట్టి ఆ అంతరం యేర్పడి పోవడంవల్ల దాన్ని సరిదిద్దుకునే అవకాశమూ లేదు. పై స్థాయిలో వున్నవాళ్ళ సంస్కృతే మొత్తం ఆ వ్యవస్థలోని అందరి సంస్కృతి కిందా చలామణీ అవుతూవుంటుంది. హిందూమతంలో అదే జరిగింది. విద్యా సంస్కారాలు పై వర్ణాల వారి ఆధిపత్యంలో వుండడంతో వాళ్ళ ఆధిక్యతని కింది వాళ్ళు ప్రశ్నించడమనేది జరగదు. సంస్కృతభాష ఆ స్థానంలో ప్రతిష్ఠితం అయింది. కింది కులాలవాళ్ళకి సంస్కృతభాషని నేర్చుకునే అవకాశం లేదు. దాంతో సంస్కృతసంస్కృతీ, విజ్ఞానం వెల్లివిరిసినచోటే బొమ్మజెముడులా అజ్ఞానమూ అలముకుంది. ఆర్షవిజ్ఞానానికి ఆలంబన అయిన వేదాలు, ఉపనిషత్తులు సంస్కృతభాషలో వికసిస్తే – బౌద్ధం పాలీభాషలో, అంటే సామాన్యజనాల భాషలో, వ్యాపించడం బౌద్ధమతం చేసిన తిరుగుబాటుకి నిదర్శనం.

హిందూ మతానికి వేదాలు మూలం. వైదికమతంలో కర్మకాండలకి పెద్దపీట వుండేది. వేదకాలంనాటి ప్రజలు ప్రకృతి శక్తుల్ని ఆరాధించేవాళ్ళు. యజ్ఞయాగాదులు విస్తారంగా వుండేవి. అప్పటి దేవతలు యెంతమందో లెక్కలేదు. వేదకాలం నాటికి ముందే యీ దేశంలో జనం వుండే వాళ్ళనీ, వాళ్ళకి ఆర్యులకంటే మెరుగైన నాగరికత వుండేదనీ హరప్పా మొహెంజెదారో నాగరికత తెలియచేస్తోంది. ఆ ప్రజలకీ నమ్మకాలూ, దేవుళ్ళూ వుండడం సహజం. ఆ దేవుళ్ళూ, యీ దేవుళ్ళూ కలిసిపోయి వెరశి దేవుళ్ళ సంఖ్య యింకా పెరిగిపోయింది. యీ బహుదేవతారాధన జీవితంలో భాగమైపోయింది. కాని బహుదేవతారాధన వొక్కటే తాత్విక చింతనకాదు. హిందూ విశ్వాసంలో అలా ఆరాధన మిగిలివున్నా, తాత్విక చింతన కూడా సాంఘిక పరిస్థితులనిబట్టి పెరిగింది.

ఉపనిషత్తుల నాటికి తాత్విక చింతన యేర్పడింది. ఉపనిషత్తులు యజ్ఞయాగాది కర్మకాండని నిరసించేయి. తాత్విక భావ వాదానికి తలుపులు తెరిచేయి. కాని వర్ణవ్యవస్థని ఖండించలేదు. కర్మకంటే జ్ఞానం ముఖ్యం, 'తత్వమసి' అంటూ ఆత్మకీ బ్రహ్మకీ గల సంబంధాన్ని వివరించేయి. పరావిద్య, అపరావిద్య అని జ్ఞానాన్ని విభజించేయి. పరావిద్య హెచ్చు, బ్రహ్మజ్ఞానం రెండోది తక్కువది. యిలాంటి జ్ఞానసాధనకి యేం చెయ్యాలో, యెలా వుండాలో చాలా ఉపనిషత్తులు వివరణలు యిచ్చేయి. (తత్వశాస్త్రానికి సంబంధించి యిక్కడ విపులీకరించడం లేదు. కాబట్టి ఆ లోతుల్లోకి వెళ్ళడం లేదు. ఉపనిషత్తుల సంఖ్య, వాటిలోని చర్చ నీయాంశాలు యేమిటి అనే విషయాన్ని తడమడంలేదు. హిందూమతంలో యీ తాత్విక చింతన భాగం అయిందని చెప్పడమే ప్రస్తుతాంశం.) ఉపనిషత్తుల భావవాదం హిందూ మతంలో వేళ్ళు దించుకుంది. యిది వేదాంతంగా – అదే హిందూ తత్వశాస్త్రం అన్నట్టుగా మాయ, మిథ్యలాంటి పారిభాషిక పదాల్ని బాగా వ్యాప్తిలోకి తెచ్చింది.

జ్ఞానం గొప్పదా, కర్మ గొప్పదా అనే చర్చ అలా కొనసాగుతూ వాద వివాదాలు చెలరేగాయి. వాద వివాదాలకి పాక్షికత యెక్కువ వుంటుంది. పాక్షికత లేకుండా "రాఘవా స్వస్తి, రావణా స్వస్తి" అంటూ మధ్యస్థంగా రాజీ చేసుకుపోవడం "భగవద్గీత"లో కనిపిస్తోంది. అనాడు వున్న విభిన్నధోరణుల్ని వొక గొడుగు కిందకి తెచ్చే ప్రయత్నమే "గీత." కర్మ చెయ్యాల్సిందే. తప్పదు. అంతేనా? కర్మఫలం అపేక్షించకుండా కూడా చెయ్యాలి. "కర్మణ్యేవాధి కారస్తే మాఫలేషు కదాచన, మా

కర్మఫలహేతుర్భూః మాతే సంగోస్త్వ కర్మణి." మరి జ్ఞానమో? అదీ గొప్పదే. భక్తివుందే – అది మరీ అమోఘం!

"భగవద్గీత" యీ రకంగా సమన్వయం కుదిరించే గ్రంథం అయింది.[1] హిందూమతంలోని వైరుధ్యాలకి యిదే సమాధానం. "భగవద్గీత"కి యెంతో మంది, యెన్నో వ్యాఖ్యలు చేశారు. అలా చెయ్యగలిగేరూ అంటే ఆ అవకాశం 'గీత'లో వున్నట్టేకదా? నిర్దిష్టంగా దీనిసారం యిదీ అని తేల్చి చెప్పేందుకు లేనపుడు యెంతమంది యెన్ని 'సారా'ల్నైనా పిండుతారు. హిందూమతానికి 'భగవద్గీత' ప్రమాణ గ్రంథంగా రూపొందిందీ అంటే కారణం సమన్వయం కుదిరించే శక్తి దానికి వుండడమే – అదీ దేవుడి పేరు మీద.

హిందూమత శాఖలుగా విస్తరిల్లిన అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంతాలు వేదాలమీదా, ఉపనిషత్తులమీదా, భగవద్గీత మీదా ఆధారపడ్డాయి. వోరకంగా ఈ శాఖల వల్ల హిందూమతానికి వో వ్యవస్థ, క్రమం యేర్పడ్డాయి. ప్రాచీన ధర్మశాస్త్రకారులు హిందూ జీవిత విధానాన్ని సంపుటీకరించి శాసిస్తే, త్రిమతాధిపతులూ ఆ జీవిత విధానానికి మతధర్మ ప్రతిపత్తి కలిగించేరు.

ఆదిశంకరులు అద్వైత సిద్ధాంత ప్రవక్త. రామానుజులు విశిష్టాద్వైతం బోధించేరు. మధ్వాచార్యులు ద్వైతసిద్ధాంతం ప్రతిపాదించేరు. ఇవి తాత్విక ధోరణులు. కాని మత విశ్వాసాలని ప్రాచుర్యం చేశాయి. శంకర మతానుయాయుల్నే స్మార్తులంటారు. స్మృతివిహిత ఆచారాల్ని పాటించేవాళ్ళు. రామానుజ మతంలో భక్తిభావం హెచ్చు. హిందూ విశ్వాసంలో భగవద్గీతకి ప్రాముఖ్యం పెరిగినప్పట్నుంచీ భక్తి ఉద్యమం తమిళదేశం నుంచి ఉత్తరానికి పాకిందంటారు. మధ్వాచార్య మతం కన్నడ, మహారాష్ట్ర ప్రాంతాల్లోని బ్రాహ్మణ వర్ణంలోనే నిలదొక్కుకుంది కాని యితర వర్ణాలకి వ్యాపించలేదు. కాని బ్రాహ్మణేతరుల్లో లింగాయత మతం వ్యాప్తి చెందింది.

ఈ మత శాఖల ప్రవర్తకులతోనే హిందూమతానికి వో మర వ్యవస్థ

---

1. "The Gita with its brilliant Sanskrit and superb inconsistency is a book that allows the reader to justify almost any action while shrugging off the consequences."

(The Culture and Civilisation of Ancient India in Historical Outline by D.D. Kosambi)

యేర్పడింది. ఆదిశంకరులు మఠాలు స్థాపించేరు. రామానుజ, మధ్వాచార్యులు కూడా మఠాలు స్థాపించేరు. దాంతో హిందూమతానికి అధికార పీఠాలనేవి వచ్చేయి. పీఠాధిపతులు లౌకిక వ్యవస్థలో మత ఆధిపత్యానికి ప్రతీక లయేరు.[1] క్రైస్తవ చర్చి మాదిరి excommunicate (బహిష్కరించి వెలివేసే) అధికారం కూడా వాళ్ళకి సంక్రమించింది.[2] వెలి, బహిష్కరణ లాంటి కులాచారాన్ని పీఠాధిపతులు సంగ్రహించేరు!

మొత్తం మీద ఈ త్రిమత శాఖల్లోనూ వర్ణ వ్యవస్థ అలానే వుంది. హిందూమతం పట్టు అదీ!

## 4

హిందూమతంలో వున్న మరో అంశం అన్నిట్నీ యిముడ్చుకోవడం. వేదకాలం దేవతలు, అప్పటికి స్థానికంగా వున్న ఆరాధనలు కలిసి కొత్త దేవుళ్ళు వచ్చేరు. శివ, కేశవులు ముఖ్యదేవుళ్ళైకాని వాళ్ళ అంశతో వెలసిన దేవతల సంఖ్య చాలా యెక్కువ. హిందూ విశ్వాసంలో సృష్టి స్థితి లయాలని నడిపించే త్రిమూర్తులు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు. విష్ణువు, శివుడు ఇప్పటికీ ఆరాధ్యంగా నిలిచి గుడిగోపురాలతో, కర్మకాండలతో వెలుగుతూనే వున్నారు. వేదకాలంనాటి వరుణ, మిత్ర, అగ్ని వగైరాల మాదిరిగా బ్రహ్మ పూజాపునస్కారాలు లేకుండా వొట్టి సృష్టి మాత్రమే జరిపిస్తూ వుండిపోయేడు. విష్ణుమూర్తి అవతారాలెత్తి సమయ సందర్భాల్నిబట్టి "ధర్మం" స్థాపిస్తూ వుంటాడు. లోకంలో ఉత్తమమైనవన్నీ తనేనని శ్రీకృష్ణుడు "గీత"లో చాటేడు. వేదాధికారాన్ని ప్రశ్నించిన బుద్ధుడు హిందువులలో విష్ణుమూర్తి అవతారం కావడం చూడండి! "పురాణ కధలను గురించి యెవళ్ళైనా "శంకలు వేస్తే" వాళ్ళని "వెధవ చదువు! మీకు మతులుపోతున్నాయి, మీరు వొట్టి

---

1. "విధవలు పెళ్ళాడకుండా వుండిపోతే దోషమని, యిందు విషయమై శంకరాచార్యులవారు పత్రిక కూడా ఇచ్చి వున్నార"ని గిరీశం 'కన్యాశుల్కం'లో బుచ్చమ్మతో బుకాయించడంబట్టీ, ప్రాయశ్చిత్తం 'హోమవేళ చేయించుకుందామంటే' అని లుబ్ధావధాన్లు అనుకోవడం బట్టీ పీఠాధిపతుల లౌకిక అధికారం గ్రహించవచ్చు.

2. "మొదటి వితంతు వివాహము చేయగానే శంకరాచార్యులవారు నన్ను జాతి నుండి బహిష్కరించిరి" అని కందుకూరి వీరేశలింగంగారు స్వీయ చరిత్రలో రాసుకున్నారు.

బౌద్ధులు"[1] అని సాంప్రదాయకులైన హిందువులు తిట్టేవారు. ఏ కారణం వల్లనైతేనేంగాని ఆదిశంకరుల్ని కూడా ప్రత్యర్థులు "ప్రచ్ఛన్న బౌద్ధుడ"ని తిట్టేవారట. నిందార్థకంగా ఇలా దూషించబడిన ఆ బౌద్ధమత ప్రవక్త గౌతమ బుద్ధుడు శ్రీమహావిష్ణువు అవతారం కావడం ఏమిటి? ఘనమైన దాన్ని యిముడ్చుకోవడం హిందూ తత్వంలోనే వుంది. బుద్ధుడికి అవతార ప్రతిపత్తి కలిగించి సర్దుబాటు చేసుకోవడం దానికి నిదర్శనం. కాని వేదాలు అపౌరుషేయాలని అంగీకరించని బుద్ధుడికి అవతారహోదా కలిగించడం ఎలాగ? ప్రతిదాన్ని అష్టాదశ పురాణాల్లోని దేంట్లోనో వొకదాంట్లో "కనిపెట్టి" ప్రచారం చేయించడం మనదేశంలో ఆనవాయితీ. అలా బుద్ధునికి అవతార ప్రతిపత్తి 'అగ్నిపురాణం' అందించింది. దేవాసుర యుద్ధంలో దేవతలు వోడిపోయేరట. అప్పుడు వాళ్ళందరూ విష్ణుమూర్తి దగ్గరికి వెళ్ళి మొరపెట్టుకున్నారట. అప్పుడా శ్రీమన్నారాయణుడు శుద్ధోదనుని కుమారుడిగా అవతరించడానికి వొప్పుకొన్నాట్ట. అలా బుద్ధుని అవతారం యెత్తి, వేదాలని నమ్మవద్దని అసురులకి బాగా బుద్ధిశుద్ధి చేశాట్ట. అసురులు వేదాలని నమ్మడం మానెయ్యగానే వాళ్ళ శక్తి కాస్తా ఉడిగిపోయింది. యింకేముంది, దేవతలు వాళ్ళని జయించేశారు! (బుద్ధుణ్ణి అవతారంగా చిత్రించడంతో బాటు వేదాల గొప్పదనం తిరుగులేదని ప్రచారం చెయ్యడమూ కలిసొచ్చింది.) గురజాడ "మీ పేరేమిటి?" కథలో 'బుద్ధుడి మహిమ' తెలుసుకున్న శాస్త్రుల్లుగారు "తప్పకుండా యీ మహానుభావుడు శ్రీమహావిష్ణు అవతారమేనర్రా" అని శలవిస్తారు. మహానుభావుడైన వాడల్లా అవతార పురుషుడేనన్న నమ్మకానికి యిది దాఖలా! "ఆనాటి నుంచీ శాస్త్రుల్లుగారు మమ్మలని బౌద్ధులని దూషించడం మానేశారు. కిరస్తానులని అంటూ వొచ్చేవారు. క్రీస్తును శ్రీమహావిష్ణు యొక్క పదకొండో అవతారంగా చెయ్యడానికి సాధ్యంకాక వొడబడి వూరుకున్నా"రట శిష్యులు.

'సాధ్యంకాక' వూరుకోవడమే కాక ఈ దేశంలో సాధ్యమైనమట్టుకి భగవదంశ అన్నిట్లోనూ వ్యాపింప చేశారు. మన దేశంలో చెప్పుకోతగ్గ దేవుళ్ళందరికీ భార్యలు వున్నారు. వాళ్ళ పరిధిలో వాళ్ళు మహిమలున్న దైవాలే. ఇద్దర్నీ కలిసి పూజించడం, భార్యల పేరుమీద దేవుళ్ళని స్తోత్రం చెయ్యడం హిందూమత ప్రత్యేక సంప్రదాయం. స్త్రీకి భారతదేశంలో

1. చూడండి: గురజాడ "మీ పేరేమిటి?" కథ.

ఎంత గొప్ప స్థానం ఇచ్చారో చూడండని మన ధర్మశాస్త్రవ్యాఖ్యాతలు గొప్పలుపోతూ ఈ దృష్టాంతాన్ని చూపిస్తూ వుంటారు. కాని అంతకు పూర్వం వున్న మాతృస్వామిక సమాజం పితృస్వామిక సమాజంగా మారేటప్పుడు ఆ మాతృదేవతల్ని పితృస్వామిక దేవతలకి అర్ధంగుల్ని చేసి పొరపొచ్చేలు లేకుండా మతం కాపరం సాఫీగా సాగేటట్టు చూడ్డమే ఆ సమన్వయంలోని అసలు కీలకం.

అంతేకాదు, అప్పటికే వ్యాప్తిలో వున్న అనేక రకాల ఆరాధనల్ని హోదా పెంచి యిముడ్చుకోవడం కూడా వుంది. జంతువులు దేవుళ్ళ వాహనాలు అవడం. వాటికి పూజార్హత కలగడం కూడా యీ క్రమంలో భాగమే. శివునికి పాములు ఆభరణాలు, విష్ణుమూర్తి పాము మీద పవళిస్తాడు. బలరాముడు విష్ణుమూర్తి ఎనిమిదో అవతారం అని దశావతారాల్లో చేర్చినా అష్టనాగుల్లోని అనంతుని అవతారం అనీ కొన్ని పురాణాల్లో వుంది. గరుడుడు, నెమలి, హంస, మూషికం, నంది – దేవుళ్ళకి వాహనాలే. భక్తికి కపిరాజు హనుమంతుడు ప్రతీక.

అవతారాలు యెత్తడం పని విష్ణువుకే వున్నా శివుని అంశ కనిపించే ప్రతీకలూ చాలా వున్నాయి. భైరవుడు శివుని ఉగ్రరూపం అట. భైరవుని వాహనం వృకం, లేకపోతే శునకం. శివుని అర్ధనారీశ్వర రూపం పార్వతి సగభాగం. కాని ఆ పార్వతీదేవే అసంఖ్యాక గ్రామదేవతల్లో ప్రతిబింబించి ఆదిమకాలపు మాతృస్వామిక సమాజ చిహ్నాల్ని సూచిస్తూ వుంటుంది. కాళి, భద్రకాళి, భగవతి, చండి, చాముండి, దుర్గ, భైరవి రూపాలలో సాక్షాత్కరిస్తుంది. శక్తిరూపంలో – శివుని శక్తత – గోచరిస్తుంది. నిజానికి కాళి, భద్రకాళి లాంటి పార్వతీదేవి రూపాలన్నీ అంతకు ముందు వున్న గ్రామ దేవతలని సంస్కృతీకరించి హోదా పెంచినటువంటివి. శివుణ్ణి లింగ రూపంలో పూజించడం, పార్వతిని అమ్మవారి రూపంలో కాళిగా కొలవడం వేదకాలానికి ముందేవున్న విశ్వాసాలను వేదకాలం తర్వాతి విధానంతో మేళవించిన ఫలితం. "తర్వాతి హిందూమతంలో కనిపించే విశిష్ట అంశాలు హరప్పా ప్రజల మతంలో వున్నాయనీ, అవి భారతదేశ మత సాహిత్య తొలిదశలో కనిపించ"వనీ ఎ.ఎల్. బషామ్ రాశాడు. ఉదాహరణకు, మాతృదేవత, హరప్పా పతనం తర్వాత వెయ్యేళ్ళకు మళ్ళీ దర్శనమివ్వడం.

ఇక హిందూ మతం యిలా రూపుతీసుకోవడానికి దక్షిణాది ద్రవిడ ప్రభావం యెక్కువ కారణం.

ఇలా యెన్నో కలిసి హిందూమతం విస్తరించింది. కర్మయోగం, జ్ఞానయోగం, భక్తియోగం లాంటి తాత్త్విక చింతనల్నీ వర్ధిల్లచేసింది. శాక్తేయ, పాశుపత, కాపాలిక, గాణాపత్య ధోరణుల్నీ నిలబెట్టి వుంచింది. మంత్ర విహిత కర్మలతో బాటు వామాచార తంత్రకాండ పటాన్నీ జోడుగా వుంచుకుంది. భారతదేశంలో వేదాచార, వైష్ణవాచార, శైవాచార, దక్షిణాచార, వామాచార, సిద్ధాంతాచార, కౌలాచార శాఖ లనేకం వున్నాయి. శాక్తేయ మతాల్లో మద్యం, మాంసం, మగువ, జంతుబలులు సామాన్యం. విష్ణుభక్తిలో యీ లక్షణాలు లేవుకాని రాధాకృష్ణ ప్రేమ, కృష్ణుని రాసక్రీడలు భక్తి భావానికి పరాకాష్ట అన్న ధోరణి వుంది.

యీ శాఖలన్నీ యేమిటో అర్థంకాక క్రైస్తవ మిషనరీలు "మీకు దేవుడు లేడు, దైవభావన లేదు, నీతి అంటే అర్థంకాదు, యెంతసేపూ యేదో రూపాన్ని, ఆ రూపం రంగుని, తలల్ని, చేతుల్ని, అయుధాలని స్తుతించడం, వాటిగురించి ధ్యానించడం తప్ప" అని హిందూ విశ్వాసాల భక్తవరేణ్యుల్ని తప్పు పట్టుకునేవాళ్ళు!–ఆధ్యాత్మిక చింతనకి ప్రతిరూపంగా నిలిచిన హిందువుల్ని!

అయినా యెన్నో ధోరణులతో విస్తరించిన హిందూ మతంలో యింత విశాల వైఖరి వుండడం వల్ల భిన్నత్వం, సహనంలాంటి సత్సంప్రదాయ లక్షణాలు వికసించేయి. దేవుళ్ళని మానవనైజంతో చిత్రించుకుని, ఆ దేవుళ్ళ శృంగార లీలలతో సహా కథ లల్లుకుని వినోదించడం మిషనరీల మత నైష్ఠికత్వ అవగాహనకి అందని విషయం! కాని యెంతో సహనం వున్న అదే హిందూ మతంలో వర్ణ వ్యవస్థ వల్లా, వేదాధికారాన్ని పరమమైందిగా భావించడం వల్లా కట్టుబాట్లూ బిగిసిపోయేయి. యీ కట్టుబాట్లవల్లా, వర్ణ వ్యవస్థ చట్రం వల్లా వ్యక్తి వికాసానికి పరిమితులూ యేర్పడ్డాయి.

మరి ఆధునిక యుగంలో హిందూమతం పరిస్థితి యేమిటి?

## 5

యే మతమైనా ఆయా దేశాల పరిస్థితుల్ని బట్టి వుంటుంది. మత ఆవిర్భావం, పరిణామం చారిత్రకంగానే అధ్యయనం చెయ్యాలి. హిందూమత భావన వికసించి, వృద్ధి చెంది, విస్తరించి, అనేక ధోరణుల్ని యిముడ్చుకోవడానికి ఆ చారిత్రక పరిస్థితులు కారణం. (హిందూమత చరిత్ర యిక్కడ రాయడం లేదు కాబట్టి ఆ చారిత్రక నేపథ్యం అంతా

తడమడం లేదు. హిందూమత స్వభావ స్వరూపాలు మాత్రమే ప్రసక్తం కాబట్టి దానికే యీ చర్చ పరిమితం అవుతుంది.)

హిందూమతం కూడా అనేక ప్రభావాలకి లోబడి మారుతూనే వచ్చింది. కాని హిందూ జీవిత విధానంలోని వర్ణవ్యవస్థ మాత్రం మాసిపోలేదు. వర్ణవ్యవస్థకి వ్యతిరేకంగా పోరాటం యేనాటినుంచో సాగుతూనే వుంది. అనేక ఉద్యమాలు తలయెత్తేయి. కాని అన్నీ మళ్ళీ హిందూ విశాల పరిధిలో కులాల పేరుమీద మిగిలేయి. హిందూమతంలో వర్ణవ్యవస్థ ముఖ్యభాగం. అలాంటి వ్యవస్థ కీళ్ళు సడలిపోతే హిందూమతం యేమవుతుంది? శాస్త్రవిజ్ఞానం వికసించే కొద్దీ అసలు మతాలకే పట్టుతప్పుతోంది కదా, అలాంటిది హిందూ మతాన్ని శాస్త్రవిజ్ఞాన వికాసంతోబాటు వర్ణవ్యవస్థ సడలడం కూడా పట్టాలు తప్పించేస్తుందే?

హిందూమతంలో బాగా వ్రూడలు దించుకున్న వర్ణవ్యవస్థ పారిశ్రామిక నాగరికత విస్తరించేకొద్దీ సడలిపోతూనే వుంది. ఫలానా వర్ణం ఫలానా వృత్తే అవలంబించాలన్న శాసనం తుప్పుపట్టిపోయింది – పూర్తిగా విరిగిపోక పోయినా, 'కులవృత్తికి సాటిలేదు గువ్వలచెన్నా' అని అన్నా, కులవృత్తికి పోటీ వచ్చింది. సాంఘిక జీవితంలో వర్ణవ్యవస్థ నిర్వర్తించే విధికి అలా అంతరాయం కలిగినప్పుడే జీవితాన్ని అదుపు చేసే శక్తి దానికి పోతుంది. వర్ణవ్యవస్థ విధించిన వృత్తి కట్టుబాట్లకి అంతరాయం కలగడానికి కారణం ఆధునిక జీవిత ఉత్పత్తి విధానమే. పాతకాలపు ఉత్పత్తి విధానానికి అనువుగా నప్పిన వ్యవస్థ ఆ విధానం మారగానే వొప్పు కోల్పోతుంది. యివాళ రాజకీయ ప్రాబల్యంకోసం కులాన్ని అనువుగా వాడుకుంటున్నారు. తప్పిస్తే కులం కట్టుబాట్లు ముఖ్యంగా భోజన భాజనాల విషయానికి సంబంధించి పట్టుగా లేవు. పారిశ్రామిక నాగరికత సోకని పల్లెటూళ్ళల్లో ఇంకా ఆ కట్టుబాట్లు కొద్దిగా వుంటున్నాయి. రాజకీయ ప్రాబల్యానికి కులాన్ని ముడిపెట్టడం బ్రిటిష్‌వాళ్ళు గత శతాబ్దంలో బాగా ప్రోత్సహించేరు. అది వాళ్ళ రాజనీతి. వాళ్ళ రాజనీతే కాదు, అలా పరిపాలన సాగించాలనుకునే వర్గాలకి వుండే నీతి. అంచేత కులం ప్రాబల్యం అలాంటి పరిస్థితు లున్నంతవరకూ వుంటుంది. కాని పారిశ్రామిక నాగరికత వ్యాప్తిచెందే కొద్దీ కులాల అంతరాలు పోతాయి, హెచ్చు తగ్గులు మాసిపోతూ వుంటాయి. యివాళ రిజర్వేషన్ల కోసం కులాల హెచ్చుతగ్గులు ప్రసక్తంగా వున్నాయి కాని ఆధిక్య న్యూనతార్థాల్లో వుండటం లేదు.

పారిశ్రామిక నాగరికత వికాసం వల్ల సాంఘిక జీవితంలో వస్తున్న మార్పుల ఫలితంగా వర్ణవ్యవస్థలోని అంతరాలు వోపక్క అలా కమ్ముకుపోతూ వున్నాయి. హరిజనుల మీద దాడులు యిప్పటికీ కొన్నిచోట్ల జరుగుతూనే వున్నాయి. సాంఘిక ఉద్రిక్తతలకి అజ్యం పోస్తూనే వున్నాయి. కాని అది వేరే చర్చనీయాంశం. కులాల పుట్టుక గురించీ, వాటి విధుల గురించీ, చరిత్రలో వాటి పరిస్థితి గురించీ యిక్కడ అధ్యయనం చెయ్యడం లేదు. (యిక్కడ మతం గురించి మాత్రమే చూస్తున్నాం కాబట్టి ఆ విషయం లోతుల్లోకి వెళ్ళడంలేదు.) వర్ణ వ్యవస్థలోని అంతరాలు అలా మసకపడుతూవుంటే హిందూ మతాన్ని ప్రచారం చేసే అనేకమంది ఆధునిక సాధువులు, బాబాలు, అమ్మలు తమ అనుయాయుల్లో కుల వివక్ష పాటించడం లేదు. వాళ్ళ ఆశీస్సులకోసం పరితపించే వాళ్ళ 'భక్తులూ' ఆ అంతరాల్ని పట్టి పల్లార్చుకోవడం లేదు – పీఠాధిపతుల ఆశ్రమాల్లో తప్ప, అలాంటిచోట్ల కులవివక్షకి తావులేదు.

అంటే యేమిటన్న మాట? కులానికి వొక సాంఘిక జీవిత శాస్త్ర శక్తిగా బిగువు సడలుతోంది. కాని హిందూ మతం, యివాళ అధికార పీఠాధిపతుల ప్రవచనాల్లో నుంచి మాత్రమేకాక "ఆధునిక" బాబాల, అవతారుల, భగవాన్‌ల, స్వాముల గళాలనుంచి ముఖరిత మవుతోంది.

హిందూ మతంలోని యే బోధలని వాళ్ళంతా ప్రచారం చేస్తున్నారు? సహస్ర చండీయాగాలు, మహారుద్రయాగాలూ సక్రృత్తుగా జరుగుతూనే వున్నాయి. కాని జంతుబలుల నిషేధం వల్ల కొన్ని యజ్ఞాలు "ప్రత్యామ్నాయా" లతోనే జరుగుతున్నాయి. యివాళ హిందూమతాన్ని ప్రచారం చేస్తున్నవాళ్ళు అనాగరికత్వం, ఆదిమ జీవిత విధానం అనిపింపచేసే జాతరలనీ, శాక్తేయ కాపాలిక ధోరణుల్నీ వూరేగించడం లేదు. 'తాత్విక ధోరణుల్ని' మాత్రం ప్రచారం చేస్తున్నారు. యింకా సరిగా చెప్పాలంటే హిందూ చింతనలోని 'వేదాంతభేరి'ని మోగిస్తున్నారు. 'ముముక్షు' దర్శన చేయిస్తున్నారు. ప్రపంచం మిథ్య, జగత్తు మాయ 'బ్రహ్మసత్యం, జగన్మిథ్యా' యిదే గ్రంథ కోటుల సారం అనే బోధనని కొనసాగిస్తున్నారు.

మతాలన్నీ భావవాద పునాదిమీదే నడుస్తూవుంటాయి. హిందూ మతంలోని భావవాద ధోరణిని యివాల్టి అవసరాలకి తగ్గట్టు చాలా ప్రచారం చేస్తున్నారు.

ఋగ్వేద ఆర్యుల నిష్కపట జీవిత విధానం బ్రాహ్మణుల ప్రభావం వల్ల కర్మకాండకి చేరింది. అక్కడి నుంచి ఉపనిషత్తుల తాత్విక చింతనకి యెదిగింది. యిదంతా ఆ జీవిత ఉత్పత్తి విధానానికి అనువైన రీతిలోనే సాగింది. బౌద్ధమతం, జైనమతం బ్రాహ్మణ మత కర్మకాండకి వ్యతిరేకంగా వెలిశేయి. కాని, హిందూ మతం వాటి ధోరణుల్నీ యిముడ్చుకుంది. తర్వాత ఇస్లాం మత ప్రభావమూ పడింది. ఇస్లాం మతం పోటీవల్ల సిక్కుమతం, ఆర్య సమాజ మతం వచ్చేయి. పోతే రామానుజ, మధ్వాచార్యుల సిద్ధాంతాల మీద క్రైస్తవమతం నీడలు పడ్డాయంటారు. (కాని ఆ విషయం యిదమిత్థంగా తేలలేదు.) బ్రిటిష్ వాళ్ళు వచ్చేక క్రైస్తవ మిషనరీల ప్రభావం వల్ల హిందూ ఆలోచనా ధోరణిలో పెద్ద మార్పు వచ్చింది. రాజా రామమోహనరాయ్ హిందూమతాన్ని సంస్కరించాలని బ్రహ్మ సమాజమతం స్థాపించేడు. యివికాక రామకృష్ణ పరమహంస బోధలవల్ల ఉత్తేజం పొందిన వివేకానందుడు హిందూ మతానికి క్రైస్తవ మిషనరీల సేవా ధోరణిని రామకృష్ణా మిషన్ పేరుమీద అంటుకట్టేడు. మానవసేవ ద్వారా మాధవ సేవ చేసే భావన హిందూమతానికి అలా అబ్బింది. వర్ణవివక్ష పాటించని మానవత్వం అలా ప్రచారంలోకి వచ్చింది. వివేకానందుడు 'చాతుర్వర్ణ వ్యవస్థ'లోని నాలుగు వర్ణాలూ అధికారంలోకి వచ్చే పరిణామంలో ఈ యుగం శూద్ర ఆధిపత్యం కిందికి వస్తుందని మార్క్స్ వివరించిన శ్రామికవర్గ అధికారానికి సమన్వయించేడు. ఇలాంటి వివరణలన్నిటికీ సనాతన హిందూధర్మ ఆమోదం వుందని అంగీకరించాలంటే అసలు హిందూమత ధర్మప్రవక్తలు యెవరైందీ తేలాలి. కాని, హిందూమతం అలాంటిది కాదు కాబట్టి అందరూ హిందూధర్మాన్ని బోధించేవాళ్ళే, యిదే హిందూమతం అనేవాళ్ళే!*

ఇలా హిందూమతం పరిణామం చెందుతూ ఆధునిక యుగంలోకి అడుగుపెట్టింది. పైన చెప్పినట్టు హిందూమతంలో ఆదిమ అవశేషాలుగా కనిపించేవాటిని వెనక్కి నెంటి, ఇవాళ తాత్విక చింతనని ప్రోత్సహిస్తున్నారు.

---

* భారతరాజ్యాంగంలో మైనారిటీ మతసంస్థల నిర్వహణకి ప్రత్యేక హామీ వుంది. ఆ హామీని వాడుకుందుకు రామకృష్ణమిషన్, ఆర్యసమాజం సంస్థలు తమవి హిందూ సంస్థలు కావనీ, తమకీ ఆ రక్షణ వర్తించాలనీ వాదించేయి. పై కోర్టులు ఆ వాదనని అంగీకరించేయి. (మరి వీటిని హిందూమత ప్రచార సంస్థలనే అందరూ అనుకుంటున్నారు.) చూడండి: Search for a New Equilibrium in Indian Society by Sri Krishnakant.

ఉపనిషత్తుల భావవాదాన్ని ఈనాటికి సరిపోయేటట్టు వాడుకుంటున్నారు. అన్నిట్నీ అమోదించే సహనం హిందూమతంలో అంతర్గతంగా ఉందని చూశాం. ఆ 'సుగుణం' వల్ల అన్నిట్లోనూ హిందూభావన 'దైవత్వాన్ని' చూడగలదు. ఉదయనుడు "న్యాయ కుసుమాంజలి"లో బౌద్ధులకీ, చార్వాకులకీ కూడా దాన్ని విస్తరింపచేస్తే, రాధాకృష్ణ పండితులు కమ్యూనిజంలో కొత్త "మతాన్ని" దర్శించేరు. "కమ్యూనిజం కొత్త మతం. లెనిన్ దాని ప్రవక్త. శాస్త్రం దాని పవిత్ర చిహ్నం"[1] అని ఆయన రాశారు.

ఇంత "విశాల దృక్పథం" వున్నది హిందూమతం. దాని కులం కట్టుబాట్లు, ఆచారాలు, అలవాట్లు అధునిక జీవిత విధానం వల్ల, యీనాటి ఉత్పత్తి వ్యవస్థవల్లా సడలినా తాత్విక భావవాద ధోరణిని ప్రచారం చేస్తూ మనుగడ సాగించవచ్చు. మతంలోని భావవాద ధోరణికి వ్యతిరేకంగా పోరాటం చేసి భౌతికంగా సమానత్వం ప్రతిష్టించాలని ఆకాంక్షించే వాళ్ళందరూ హిందూమతంలోని భావవాద ధోరణికి వ్యతిరేకంగానూ పోరాటం జరపాల్సి వుంటుంది. "హిందూ" తాత్విక చింతనలోని భౌతికవాద అంశాల్ని ముందుకు తీసుకుపోవాల్సి వుంటుంది.

ఇంతకీ మతం (ప్రపంచం గురించి మనకి ఏర్పడే జ్ఞానంతో) అందించే అవగాహన వొక పార్శ్వం మాత్రమే. శాస్త్రం ఇవ్వాళ మన అస్త్రం. శాస్త్రీయ అవగాహన పెరిగే కొద్దీ మతం స్థానం కుంచించుకుపోతూనే వుంది. రాజునీ, ప్రజల్ని మొత్తంగా ఆవరించుకుని ఆధిపత్యం చెలాయించిన మతం ఇవ్వాళ ఆ స్థానంలో లేదు. లౌకిక రాజ్యాంగాలు యేర్పడ్డాక న్యాయమైన పాలనలో మతం జోక్యం పోయింది. వోవేళ జోక్యం వున్నా అది శాసించే స్థాయిలో లేదు. మతం, దేవుడు, విశ్వాసాలు ప్రజల్లో లేవని కాదు – వున్నాయి. మతాన్ని రాజకీయ ప్రయోజనాలకోసం వాడుకోవడం లేదా అంటే – వుంది. కాని మతమే సర్వం సహాధిపత్యంగా పెత్తనం చేసే పరిస్థితి లేదు.

శాస్త్రం విస్తరించే కొద్దీ మతం వెనక్కి తగ్గుతుందన్నాం. అంటే యేమిటి? యెందుకని తగ్గుతుంది? లౌకిక రాజ్యాంగాలు యీ యుగంలోనే రావడానికి కారణం యేమిటి?

సామాన్యంగా మతం యీ ప్రపంచానికి సృష్టి యేదో అతీతశక్తి కారణం అంటుంది. వేదకాలం నాటి దృక్పథంలో యీనాడు మనం

1. S. Radhakrishnan - An Idealist view of life.

అనుకుంటున్న రీతిలో అతీతశక్తి, దేవుడు అన్న భావనలు లేవు. ఆనాటి దేవతలు మహావీరులు, శూరులు. యింకా సరిగాచెప్పాలంటే నీరు, నిప్పు, వానలాంటి ప్రకృతి శక్తులు; పర్వతాలు, ఓషధులు, వనస్పతులు, అరణ్యాలు, ఆయుధాలు కూడా దేవతలే. ఘనమైనదానికి దేవత్వం అంటగట్టడం మన సంప్రదాయంలో యిప్పటికీ నిలిచే వుంది. "గాంధిదేవ" అని స్తుతించడం వింటూనే వున్నాం. ప్రాచీనకాలపు భారతదేశంలో దేవత్వం చాలా చవగ్గా వుండేదని ఎ. ఎల్. బషామ్ రాశాడు. యింతకీ విషయం ఏమిటంటే – ఆనాటి దృక్పథంలో మనం యీనాడు అనుకుంటున్న రీతిలో దేవుడు, మతం అనేవి లేవు. కాని, వేదం నుంచి ఆవిర్భవించిన బ్రాహ్మణ మతం వేదంలో నుండి ఐకాంతిక భావాన్ని బయటికి తీసింది.[1] తర్వాత ఉపనిషత్తుల ద్వారా, బ్రాహ్మణాల ద్వారా భావవాదం వృద్ధి చెందింది. యీ సృష్టి అంతటికీ అతీతశక్తి కారణం అని చెప్పేది భావవాదం. యిదంతా చారిత్రక పరిణామం. దీనిమూలం అంతా వేదంలో వుందని వేద ప్రామాణ్యంతో హిందూమతం, భావవాదాన్ని పునాది చేసుకుంది. వేదాల్లో యేం వుందో బ్రాహ్మణులకి తప్ప యెవళ్ళకు తెలియడానికి లేదు. వేదాధ్యయన అధికారం బ్రాహ్మణులు గుత్తసొత్తుగా వుంచుకొని చాటుతూ వచ్చేరు. వేదాలు అన్నిటికీ నిలయం అనీ, అన్నీ వేదాల్లో వున్నాయనీ నాలుక పీక్కుని చెప్పినా జాతి అజ్ఞానం అలానే వుండిపోయింది. అందరికీ ఉపయోగపడే జ్ఞానాన్ని వేదాలు యివ్వనూ లేదు, అసలలాంటి జ్ఞానం వాటిలో వుందో లేదో తెలుసుకునే అవకాశమూ యెవళ్ళకీ లేదు. ఇది విశ్వాసాలతో, నమ్మకాలతో ఎదురు ప్రశ్నించకుండా లొంగివుండే అణకువలో మాత్రమే అధికారాన్ని చలాయించగల పరిస్థితి. ఇది బలమైన మతమౌఢ్యం. మత సత్యాలకు రుజువుండదు. రుజువులు అడగనూ అడగరు. ఇలాంటి స్థితి వల్ల ప్రయోజనం వున్నంతకాలం అలా లబ్ధి పొందేవాళ్ళు ఆ స్థితిని కాపాడుతారు. సృష్టికి అతీతశక్తి కారణం అని చెప్పి, ఆ మూలశక్తి దేవుడు అని బోధించి, ఆ దేవుడి ప్రీత్యర్థం మనం పూజలు పునస్కారాలు చేస్తే లాభం అని చెపుతూ మతాన్ని నిలబెడతారు. ఇందులో మనశ్శాంతిని అందించే తాత్విక చింతనక్కాదు, లౌకిక సుఖంకోసం పడే తపనకి తలుపులు తెరవడమే వుంది. మతం వొట్టి మనశ్శాంతిని అందించే వాహకంగానే వుండిపోతే పేచీయే లేదు.

1. 'ఏకం సద్విప్రా బహుధావదన్తి'...ఋగ్వేదం.

(రాజకీయాలలో జోక్యం చేసుకోనక్కర్లేదు.) యెవళ్ళ నమ్మకాలు వాళ్ళవి. భౌతిక పరిస్థితులే వాటిని మారుస్తాయి.

శాస్త్ర విజ్ఞాన దృష్టి అలా నమ్మకాల మీద ఆధారపడదు. యీ సృష్టికి కారణం ఏమిటని విమర్శగా పరిశీలిస్తుంది. ఈ సృష్టి అంతా ఏదో ముందే ఏర్పాటైపోయి, శాశ్వత సత్యాలతో నిబద్ధమైవుందని భావించదు. విమర్శ, పరిశీలన, విచక్షణాత్మక బుద్ధి శాస్త్రానికి పునాది. ప్రకృతిలో ఏ నియమాలు వర్తిస్తున్నాయి? పదార్థ చలనంలో అంతర్గతంగా వున్న నియమాలు ఏమిటి అని శాస్త్రం శోధిస్తుంది. అతీతశక్తి ఏదో పదార్థానికి ఆ నియమాలని అందించిందని శాస్త్రం భావించదు. అలా జరిగివుంటే మనం చెయ్యగలిగింది ఏమీలేదు, అంతా 'ఈశ్వరేచ్ఛ' గా అలా సాగాల్సిందే. అందుకు విరుద్ధంగా శాస్త్రం పదార్థ చలన నియమాల్ని తెలుసుకుని స్వాధీనం చేసుకుంటుంది, ప్రయోజనకరంగా వుండేట్లు మలుచుకుంటుంది. ఇక్కడ ఆ అతీతశక్తి, నియమాల ప్రీత్యర్థం పూజలు పనికిరావు. పరిశీలన, విచక్షణాయుత బుద్ధివిశేషం కావాలి. భౌతిక శక్తుల గురించి తెలుసుకోవడానికి 'యేమిటి' అని ప్రశ్నించకుండా 'దాసోహం' అని సాగిలబడే విశ్వాసాలు చాలవు.

చారిత్రక పరిణామంలో సాంఘిక జీవితంలో అలా విశ్వాసాలు మాత్రమే చాలని దశ వచ్చింది. విచక్షణాయుత బుద్ధి విశేషం పెరగడం వల్ల ఆ పరిస్థితి వచ్చింది.

పరిస్థితులు మారిన కారణంగా మతం వెనక్కి తగ్గింది. మతం గీసిన గీతలు, పెట్టిన కట్టుబాట్లు, నిబద్ధించిన నియమాలు విమర్శకి నిలవలేదు. భౌతిక శక్తుల ప్రాబల్యం అతీతశక్తుల మహిమ కంటే యెక్కువ. అంచేత యివాళ రాజ్యపాలనలో జోక్యం చేసుకోకూడని "స్థానం" మతానికి వచ్చింది. యెవళ్ళైనా యే మత విశ్వాసాలనేనా ఆలంబన చేసుకోవచ్చు. కాని, మతం ప్రకారమే పరిపాలన సాగడానికి రాజ్యాంగాలు వొదగడం లేదు. (కొన్ని ముస్లిందేశాల్లో షారియట్ ప్రకారం పరిపాలన సాగుతోందని అంటున్నారు కాని, అది యెంత "నిజాయితీ"గా మతం మేరకి సాగుతోందో ఆ పాలకులకి తెలుసు!) యిదీ మతాతీత ('మతవ్యతిరేక' అని కాదు, అది వేరే విషయం.) లౌకిక రాజ్యాంగాలు యేర్పడ్డ నేపథ్యం. యిలాంటి రాజ్యాంగాలే చాలా ప్రపంచ దేశాలకి మార్గదర్శకంగా వున్నాయి. (అలా లేని సందర్భాల్లో మధ్యయుగాల పాలన అని చులకనగా చూడ్డం వుంది.

మతం ప్రకారం పాలన సాగడం మధ్యయుగాల అవశేషం అంటే మతానికి అది ఏం గొప్పతనం కలిగిస్తుంది?)

యీ పరిస్థితిలో మతం సాంఘిక జీవితంలో 'ఆధ్యాత్మిక' చింతన కోసమే మనుగడ సాగించవచ్చు. అంటే, ఆధునిక జీవితపు ఆటుపోట్ల తాకిడికి మానసిక 'శాంతి' కరువు అవుతున్న మానవుడు పరమేశ్వర ధ్యానంలో, ట్రాన్సెండెంటల్ మెడిటేషన్లో తృప్తి పొందవచ్చు. హిందూ మతం అందుకూ బోలెడు అవకాశం యిస్తుంది. ఉపనిషత్తులు అందుకు అంజనాన్ని అందిస్తాయి.

కాని ఆ "శాంతి" భౌతిక పరిస్థితుల నుంచే వస్తుందనే తెలివిడికి వచ్చినప్పుడు, మతానికి ఆ అవకాశమూ పోవచ్చు. అప్పుడు "ఆధ్యాత్మిక" చింతన కూడా పొట్టి మానసిక వ్యాపారంగా (అతీతశక్తులలో, పరలోక భావనలో మునిగిన 'ఆత్మ' లుప్తం అయి) భౌతిక జీవిత సువ్యవస్థితత్వానికి పూరకంగా వుంటుంది, అంతే.

★ ★ ★

# హిందూధర్మ వివాహ పద్ధతి

ఈ దేశంలో హిందూ ధర్మంలో పుట్టిన ప్రతి మనిషికీ నలభై సంస్కార కర్మలున్నాయట. ఈ సంఖ్యని గురించి ధర్మశాస్త్రాలలో అభిప్రాయ భేదాలున్నా మొత్తానికి కడుపులో పడ్డప్పట్నుంచీ కాటికి పోయేదాకా అనేక కర్మకాండలున్న విషయం అందరూ అంగీకరించిందే. ఈ సంస్కార కర్మలని నిత్యకర్మలనీ, నైమిత్తిక కర్మలనీ, కామ్యకర్మలనీ విభజించారు. ఈ కర్మకాండలన్నీ హిందూ విశ్వాసంలో భాగం. శ్రుతి, స్మృత్యాదులు విధించిన యీ కర్మకాండనంతా ధర్మంగా నిర్ణయించారు. గౌతముడు, బోధాయనుడు, వసిష్ఠుడు, అపస్తంబుడు మొదలైన వాళ్ళంతా ప్రవచించిన ధర్మసూత్రాలే హిందూ ధర్మానికి ఆలంబనమైనవి. ధర్మశాస్త్రాల్లో ఇంకా పట్టుగా వుండేది మనుస్మృతి. ఇది క్రీ.శ. ఒకటి – రెండు శతాబ్దాల నాటిది.

ఇవాళ నలభై రకాల సంస్కార కర్మలనీ ఎవళ్ళూ జరిపించడం లేదు. ఈ కర్మలన్నీ వాడుకలో లేకపోయినా నామకరణమనీ, పుట్టువెంట్రుకలనీ, ఉపనయనమనీ, వివాహమనీ కొన్నిటిని ధర్మశాస్త్ర ప్రకారం జరిపిస్తున్నట్టు అనుసరిస్తున్నారు. మరణానంతర కర్మల్నీ అనుసరిస్తున్నారు. ధర్మశాస్త్రం ప్రవచించిన వాటిని అన్నిట్నీ అనుసరించలేక పోవడానికి కారణం సాంఘిక ఆర్థిక పరిస్థితులే. యీ నిలిచి వున్న వాటిలోనైనా వివాహాది విషయాలకి తప్ప మిగిలినవాటికి పెద్ద గణనా లేదు. ఉపనయనం (అంటే సమీపమందు ప్రవేశపెట్టడం, గురువుదగ్గర వేదాధ్యయనానికి ప్రవేశపెట్టడం అని), వివాహం మాత్రం ఇంకా బాగా నిలిచివున్నాయి. సంప్రదాయాన్ని అనుసరిస్తున్నామని సంతృప్తి పడేవాళ్ళు ఇలా ఏ ఒకటి, రెండింటినో అనుసరించి మిగిలిన వాటిని వర్జించడానికి సంప్రదాయం మీద విశ్వాసం లేకపోవడం కారణం కాదు కదా! అందుకనే సాంఘిక ఆర్థిక పరిస్థితుల్లో వచ్చిన మార్పు కారణం అనడం. అన్ని కర్మలనీ తూ.చ. తప్పకుండా పాటించేందుకు విశ్వాసాలతోబాటు స్తోమత కూడా

వుండాలి. ఎంత ధర్మమైనా తూగలేనప్పుడు అధిక వ్యయంతో కూడినవి తగ్గిపోతాయి కదా! భరించ గలిగిన స్తోమత వున్నప్పుడు పుట్టువెంట్రుకలు తీయించడం కూడా ఘనంగా చేస్తారు. అంచేత సాంఘిక పరిస్థితిలో మార్పు వచ్చినప్పుడు కర్మకాండలకీ మార్పు తప్పదు.

వివాహానికి మాత్రం సాంప్రదాయిక పద్ధతి ఆదరణీయంగానే వుంటోంది. ఆధునిక పద్ధతిలో వివాహాలు జరగడంలేదని కాదు, జరుగుతున్నాయి. కాని, మంగళ సూత్రం మీద గురి మాత్రం యింకా తప్పలేదు. వర్ణాంతర వివాహాలు కూడా సాంప్రదాయికంగా మంత్ర తంత్రాలతోనే జరుగుతున్నాయి. దీనికి కారణం ఆ మంత్రాల్లో యేదో మహత్తు వుందనీ, వివాహమనేది ధర్మనిష్టమైన పవిత్ర బంధమనీ అనుకోవడమే.

ఇంతకీ సాంప్రదాయిక పద్ధతి వివాహంలో మంత్రాలనబడే వాటి మహిమ యేమిటి? ఆ తతంగం యెలా సాగుతుంది? సాంప్రదాయిక పద్ధతిని అనుసరిస్తున్నామని అనుకునే వాళ్ళు యెంతమేరకి సంప్రదాయాన్ని అనుసరిస్తున్నారు? వేదోక్తంగా జరుగుతున్న వివాహాలనుకునే వాటిలో అసలు వేదవిహితమైంది యెంత? భారతదేశంలో హిందూ మతాన్ని సనాతన ధర్మమనీ, మారని - మార్పులేని ధర్మం యిది అనీ అనుకునేవాళ్ళు, ఆదినుంచీ అది యెలా వుందో తెలిసే ఆచరిస్తున్నారా? అలా లేనప్పుడు కొంతమేరకే సంప్రదాయాన్ని అనుసరించి మరికొంత మేరకి దాన్ని అతిక్రమించేటట్టయితే దానికి సమర్థన యేం వుంటుంది?

ఈ విషయాలు చూస్తే మంత్రవిహితమైన వివాహం విషయమూ తేలుతుంది, ఆధునిక పద్ధతిలో వివాహం జరిపించుకుంటూ మంగళసూత్రం పాటించేవాళ్ళకి కలిగే శంకలూ తీరతాయి.

వివాహం గార్హస్థ్య ధర్మానికి ముఖ్యం, అంటే గృహస్థుడై నిర్వహించాల్సిన విధుల్ని నిర్వహించడానికి ముఖ్యం. గృహస్థుడంటే "సాంగ వేదాధ్యయనానంతరము గురునాజ్ఞచే భార్యను విద్యుక్తముగా గ్రహించి ధర్మార్థ కామములను నడుపుచు పంచ యజ్ఞములను చేయుచు ప్రవర్తించువాడు." హైందవ జీవిత ప్రణాళికలో భాగంగా యిది వొక ముఖ్యమైన ఆశ్రమం. అలాంటి వివాహానికి యివాళ చిహ్నాలుగా నిలిచిన వాటిలో ఏవి వేదప్రోక్తంగా వున్నాయి? యివాళ మంగళసూత్రం వివాహానికి ముఖ్యమైన గుర్తుగా వుంది. మంగళసూత్రం పరమ పవిత్ర స్థానాన్ని ఆక్రమించింది. మాంగల్యం మహత్తు సంతరించుకుంది. మాంగల్యంపోయిన స్త్రీకి సంఘంలో వున్న స్థానం ఏమిటో చెప్పక్కర్లేదు. ఐదువతనం అని, పునిస్త్రీ అనీ వివాహమై

భర్త జీవించి వున్న స్త్రీకే గౌరవం. మంగళసూత్రం, బొట్టు, మట్టెలు, నల్లపూసలు లాంటి చిహ్నాలన్నీ స్త్రీలకి సంబంధించినవే. మరి పురుషులకి వివాహమైనట్టు యే చిహ్నాలు వున్నాయి? ద్విజులకైతే యజ్ఞోపవీతం చిహ్నంగా కనిపిస్తుంది, ద్విజేతరులకి? సౌభాగ్యవతి, సుహాసిని అని వివాహిత స్త్రీని వ్యవహరించినట్టు పురుషులని యెలా వ్యవహరించారు? గృహస్థు అని. కాని, పైకి కనిపించే చిహ్నాలు స్త్రీలకి నిర్దేశితమైనట్టు పురుషులకి లేవు. ఇది యే నాగరికత ఫలితం? చారిత్రకంగా పరిశీలించాల్సిన అంశం యిది. మనకి ప్రస్తుతం అవసరమైంది సౌభాగ్యవతీ చిహ్నాలుగా భాసించే మాంగల్యం లాంటివి ఆదినుంచీ వున్నాయా? యీ విషయం తెలుసుకునేందుకు వేదోక్తంగా జరిపించే వివాహ ప్రక్రియ యేమిటో గ్రహించాలి.

"దృష్టాదృష్ట ప్రయోజనములతో కూడిన అంగ ప్రధాన సముదాయమంతయు కలిసిన దానికి వివాహమని పేరు. వివాహ మెనిమిది విధములు" అని పండితులు వివరించారు.

బ్రాహ్మో దైవస్త దైవార్షః ప్రాజాపత్యాస్తథాసురః
పైశాచో రాక్షసశ్చైవ గాన్ధర్వశాచాష్టయోవిధః

బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, అసురము, పైశాచము, రాక్షసము, గాన్ధర్వము అని సూత్రకారులు వివరించారు. వీటిలో బ్రాహ్మము అనే పద్ధతిలో వుండేదానికే ప్రస్తుతం జరిగే తతంగం అంతా అమల్లో వుంది.

బ్రాహ్మం అంటే కన్యని విలువైన భూషణాలతో అలంకరించి విలువైన కానుకలిచ్చి వేదపారంగతుడైన సత్ప్రవర్తన గల వరుడికిచ్చి వివాహం చెయ్యడం. దైవం అంటే జ్యోతిష్టోమాది యజ్ఞం ప్రారంభింపబడినప్పుడు తత్కార్యము నిర్వహించిన ఋత్విజుని అలంకరించి కన్యని యిచ్చి వివాహం చెయ్యడం. ఆర్ష పద్ధతిలో వరుడి నుంచి శాస్త్ర విహితంగా గోమిథునాన్నిగాని, వొక గోవునో, వృషభాన్నోగాని శుల్కంగా పుచ్చుకుని కన్య నివ్వడం. ధర్మార్థం వరుని నుంచి గోమిథునాన్ని పుచ్చుకుని కన్య నిచ్చి వివాహం యథాశాస్త్రంగా చేసేది అని కొందరి మతం. ప్రాజాపత్యం అంటే మీరిరువురూ కలిసి ధర్మం చేయమని వరునితో భాషించి కన్యనివ్వడం అని. అసురంలో వరుడు తన యిచ్ఛాపూర్తిగా వధువు సంబంధీకులకుగాని వధువుకుగాని యివ్వగలిగినంత సంపదనిచ్చి వివాహం జరిపించుకోవడం వుంది. పైశాచంలో నిద్రించి, తాగి మైమరచి పరాకుపడియున్న దానిని

శీలహరణం చేసి రహస్యంగా చేసుకునే వివాహం. రాక్షసం అంటే వధువుని అపహరించుకునిపోయి వివాహం చేసుకోవడం అని. కాని, వధువు నిద్రిస్తూ వుండగాగాని, మత్తులో వుండగాగాని అపహరించుకుపోకూడదని కౌటిల్యుని అర్థశాస్త్రం చాటుతోంది. ఇక గాంధర్వ పద్ధతి అంటే వధూవరులు పరస్పరం యిష్టపడి చేసుకునే వివాహం.

ఈ రకంగా వివాహం ఎనిమిది రకాలని సూత్రకారులు వివరించేరు. కాని బ్రిటిష్ ఇండియా కోర్టులు బ్రాహ్మ, అసుర వివాహ పద్ధతుల్నే అంగీకరించేయి. సరే, ఆ కోర్టుల అంగీకారం అలా పక్కన పెట్టినా పైన చెప్పిన వివాహ పద్ధతుల్లో అన్నిట్నీ కలియుగంలో అమలు పరచకూడదని అ సూత్రకారులే వివరించారు. వేద ధర్మాన్ని అనుసరించేటప్పుడు, మారని మార్పులేని సనాతన ధర్మం వేదధర్మం అని ఘోషించేటప్పుడు యివాళ అనుసరించే పద్ధతి యెంత మేరకి ఆ నియమాలకి ఒదుగుతున్నట్టు? శ్రీకృష్ణుడు రుక్మిణిని పెళ్ళాడిన తీరు, దుష్యంతుడు శకుంతలని వరించి వివాహం చేసుకున్న పద్ధతి, పాండవులు ద్రౌపదిని చేపట్టిన రీతి ఏ మేరకి వేదవిహితం? సీతారాముల వివాహ విధానం, దమయంతీ నలమహారాజుల దాంపత్యం పైనచెప్పిన రకాల్లో ఏవిధంగా యిముడుతాయి? అయినా, యివాళ శాస్త్రోక్తంగా వివాహాలు జరిపించుకుంటున్నామని మంగళసూత్రం కట్టి మురిసిపోయే దాంట్లో శాస్త్రోక్తమైంది యెంత అని చూస్తే మంత్ర మహిమ ఏంవుందో బోధపడుతుంది.

ఇవాళ అమలులో వున్న వివాహపద్ధతి 'బ్రాహ్మ' రీతి వివాహ పద్ధతి. యీ పద్ధతి ప్రకారం అసలు యెలా జరిపించాలి, ప్రస్తుతం యెలా జరుగుతోంది అనే విషయం చూద్దాం.

ఈ పద్ధతి ప్రకారం వివాహ స్వరూపం ఏమిటంటే – కన్యావరణం, మధుపర్కం, సమీక్షణం, ఇణ్వం, బండికాడి, దీక్షా వస్త్ర మంగళసూత్ర ధారణ, యోక్త్రబంధనం. తలంబ్రాలు, బ్రహ్మగ్రంధి, ప్రధాన హోమం, పాణి గ్రహణం, సప్తపది, ప్రధానాహుతులు, లాజ హోమం, యోక్త్రవిమోచనం, ప్రవేశహోమ ప్రయాణం, వధువుకి సర్వాధిపత్యం, స్థాలీపాకం, వివాహాంగ బ్రహ్మచర్యం, గంధర్వ ప్రతిష్ఠాపన, ధ్రువ దర్శన, అరుంధతీ దర్శన, సదస్యం, గంధర్వోత్థాపన, శేషహోమం జరిపించడం. ఈ క్రమమంతా అయిదురోజులు చెయ్యాలి. అయిదో రోజున "నాకబలి" జరపాలి.

ఈ క్రమమంతా "వాడుకలో వున్న" వివాహంలో వుంది. యిందులో వేద విహితమైంది ఎంత అని చూస్తే ముక్కాలు మువ్వీసం ఆచారవతుగా

వచ్చిందేనని తేలుతుంది. మంత్ర విహిత క్రియ తక్కువ అని తేలుతుంది. అందుకనే వివాహ క్రియలో మంత్రంతో వున్నవి, మంత్రం లేనివి అని సూత్రకారులే వివరించేరు. అంటే వేద విహితమైనవి, కానివి అని. సూత్ర విహితం కాని మంగళాచార ప్రాప్తమైన వాటిని స్త్రీలనుంచి తెలుసుకుని కూడా చెయ్యాలని ఆపస్తంబుల వారి వాక్యం.

వాడుకలో వున్న వివాహ పద్ధతిలో మంత్రంలో వున్నవీ, మంత్రంలో లేని ఆచారఫక్కీవీ కలిసిన క్రమం వుంది. మనం పరమ పవిత్రంగా భావించుకుంటూ వున్న వాటి మహత్తు ఏమిటో మంత్ర విహితమైందాన్ని చూస్తే తెలుస్తుంది. ధర్మశాస్త్రవేత్తలు చెప్పిన మంత్ర క్రమం ప్రకారం కన్యని ముందే నిర్ణయించుకుని వరుడికి ఇచ్చేటట్టు ఒప్పించాలి. కన్య అంటే ఎవరు? వివాహయోగ్యమైన కన్యని సూత్రకారులు నిర్ణయించారు.

అష్టవర్షా భవేత్కన్యా నవవర్షాతు రోహిణీ
దశవర్షా భవేత్‌గౌరీ అత ఊర్ధ్వం రజస్వలా

అని యమ (బృహద్యమ) స్మృతిలో వుంది. అంటే ఎనిమిది ఏళ్ళకే కన్య అనేమాట వర్తిస్తుంది. తర్వాత రోహిణీ అనీ, గౌరీ అనీ వ్యవహరించాలి. ఆ వయసులో వున్నప్పుడు కన్యాదానం చేస్తేనే ఆ కన్యాదాతకి కన్యాదాన ఫలం దక్కుతుంది. (కన్యాదానం అనేది హిందూ విశ్వాసంలో ఉత్కృష్టం అయింది. కూతురి సంతానం ధర్మ నిర్వహణ దృష్ట్యా ప్రముఖ స్థానం వహిస్తుంది. కూతురి కొడుకుని పితృకర్మల్లో ఉపవిష్టుని చెయ్యడం సాంప్రదాయకుల్లో గొప్ప విశ్వాసం.) అలాంటి కన్యాదాన ఫలం దక్కాలంటే యీ అష్టవర్షా భవేత్కన్యా నియమాన్ని అనుసరించాలి. ఆ వయసు దాటింతర్వాత అయితే ప్రాయశ్చిత్తాలు చేసుకోవాలి. యిక రజస్వల అయింతర్వాత అయితే ఫలం మాట సరేసరి, పాపం కూడా చుట్టుకుంటుంది. (నలభై, యాభై యేళ్ళ కితం దాకా కూడా రజస్వలానంతర వివాహాలని చాలా తప్పుగా చూసేవారు!) అంచేత శాస్త్ర ఫక్కీ ప్రకారం ఎనిమిదేళ్ళ పిల్లలకే వివాహం చెయ్యాలి! యివాళ ప్రభుత్వ చట్టాలు కూడా అందుకు వొప్పుకోవు, మరి శాస్త్రోక్త పద్ధతి వివాహాలని ఎలా అనుకోగలం?

సరే, అలా కన్యని నిర్ణయించుకున్నాక వరుడికి మధుపర్కం యివ్వాలి. తేనెలో కలిపిన పెరుగును తినిపించడం మధుపర్కం అంటారు. (యివాళ మధుపర్కాలంటే ఆ బాపతు బట్టలని మిగిలింది.) తర్వాత మహాసంకల్పం

చెప్పాలి. "కన్యాదానేన, నదీస్నానేన, మహాసంకల్ప మాచరేత్" అని సూక్తి. మహాసంకల్పం అంటే గోత్ర ప్రవరల్ని ఏకరువు పెట్టడం అన్నమాట. అతల వితల సుతల లోకాల పేర్లూ, అంగ వంగ కళింగ వగైరా దేశాల పేర్లు చదవడం యిందులోనే. ఓ రకంగా చూస్తే చిరునామా వివరాలు వల్లించడం అనచ్చు. అప్పుడు కన్యాదానం చెయ్యాలి. ఆ సమయంలో "ధర్మేచ, అర్థేచ, కామేచ నాతిచరామి" ధర్మార్థకామాల్లో వధువుని విడవకుండా చరిస్తానని ప్రమాణం చెయ్యాలి. (మోక్షం సంగతి లేదు లెండి, అది ఎవళ్ళది వాళ్ళదే.) అప్పుడు సుముహూర్తం అవుతుంది. అప్పటిదాకా వధూవరుల మధ్యవున్న తెర తొలగాలి. తొలిసారి వధూవరులు వొకర్ని వొకరు వీక్షించడమే సుముహూర్తం. జీలకర్రా బెల్లం వొకళ్ళ నెత్తిమీద ఒకళ్ళు పెట్టడం మాత్రం మంత్రంలో లేదు. ఇవాళ సుముహూర్తం పేరుచెప్పి నెత్తిమీద చేతులుపెట్టేతంతు అసలు వేదవిహితమే కాదు. ప్రథమ పర్యాయం వధువుని వరుడు చూడ్డమే సుముహూర్తం! (మరి పెళ్ళిచూపుల తతంగం ముందే అయి వ్యవహారాలు మాట్లాడుకుని అర్ధరాత్రో అపరాత్రో సుముహూర్తం అని "దైవజ్ఞులు నిర్ణయించడం" యే శాస్త్ర ప్రకారమో తెలీదు!) సుముహూర్తం అని నిర్ణయించిన సమయంలోనే వధూవరుల ప్రథమ వీక్షణం జరగడం శాస్త్రసమ్మతం. మరి ఆ 'సుముహూర్తం' అంటే? దానికి పవిత్రత, మహిమ ఏమిటి? ముహూర్తం నిర్ణయించారనీ, సుముహూర్తం అనీ అంటూ వుంటారు. 'ముహూర్తం' అంటే సమయ ప్రమాణం. ఈ సమయ చర్చ శతపథ బ్రాహ్మణంలో వుంది. ఆ లెక్కన వొక దినానికి 50,625 భాగాలు. దాని వరస ఇది: 15 ప్రాణాలైతే వొక ఇదాని. 15 ఇదానులు ఒక క్షిప. 15 క్షిపలు వొక ముహూర్తం. 15 ముహూర్తాలు ఒక దినం. (వీటిని గుణించుకుంటే మొత్తం లెక్కసరిపోతోందో లేదో.) అలాంటి ముహూర్తాల్లో శుభప్రదమైనదాన్ని నిర్ణయించడం సుముహూర్తం కావచ్చు. కచ్చితంగా ఇన్ని ఘడియలు, ఇన్ని ఘడియల సమయం కంటే మొత్తంమీద శుభ ఘడియల ప్రమాణంగా చెప్పచ్చు. అలా ముహూర్తం అయేక వధువు శిరస్సు మీద బండికాడి వుంచి అందులో నుంచి జారిపడేటట్లు నీళ్లు పోస్తారు. దాని వల్ల కన్యకు రూపదోషాలు ఏవేనా వుంటే హరించుకుపోతాయట. (దీనికొక కథ వుంది. అత్రి మహాముని కూతురికి బొల్లివ్యాధి వుండేదట. దాంతో ఎవళ్ళూ పెళ్ళాడ లేదు. పాలకులు లేనిదవడం వల్ల అపాల అని పేరు వచ్చిందట. ఆమె పెళ్ళవడానికి ఇంద్రుణ్ణి పూజించేదట. స్నానం

చేద్దామని నదిలోకి దిగితే ప్రవాహానికి కొట్టుకుపోయే ప్రమాదం వచ్చిందట. ఆ సమయంలో నీటిలో కొట్టుకు వస్తూ వున్న సోమలతను నమిలి ఆ రసాన్ని ఇంద్రుడికి అర్పించిందట. ఇంద్రుడు దాన్ని తాగి రథము, ఇరుసు, కాడి మూడింటి రంధ్రాల్లోనూ నీళ్ళుపోసి ఆ నీటితో ఆవిడని స్నానం చేయించాట్ట. దాంతో బొల్లిపోయి సూర్య తేజస్సుతో ప్రకాశించిందట. మంచి రూపం కావడానికి అప్పట్నుంచీ బండికాడిలో నుంచి నీళ్ళు పొయ్యడం అమలు పెట్టారట.)

ఆ రకంగా వరుడికి మంచి రూపం గల కన్యని తయారుచేసి ఇస్తారు. (వరుడి రూపం సంగతి లేదులెండి!) అప్పుడు వధువు చెయ్యిపట్టుకుని-

*సోమః ప్రథమో వివిధే గంధర్వో వివిధ ఉత్తరః*
*తృతీయో అగ్నిష్టె పతిస్తురేయస్తే మనుష్యజాః*

అని పాణిగ్రహణం చేస్తాడు (దీని అర్థం ఏమిటంటే – "ఓ చిన్నదానా! చంద్రుడు నిన్ను ముందుగా వరించాడు. తర్వాత విశ్వావసుడనే గంధర్వుడు వరించాడు. ఆపైన అగ్ని వరించాడు. అంచేత మూడో పెనిమిటి అయ్యాడు. ఆ దేవతలు పొందిం తర్వాత మనుష్యజాతిలో పుట్టిన నేను నిన్ను పొందుతూ వుండడంవల్ల నాలుగో వాణ్ణి అవుతున్నాను" అని! (ఇదీ పాతివ్రత్య మహిమ!)

పాణిగ్రహణం తర్వాత సప్తపది. ఒక్కొక్క మంత్రం చదువుతూ ఏడడుగులు వేయిస్తాడు. సప్తపది ఏమిటంటే –

ఏకమిషే విష్ణుస్త్వా న్వేతు / ద్వే ఊర్జే విష్ణుస్త్వాన్వేతు / త్రీణివ్రతాయ విష్ణు స్త్వాన్వేతు / చత్వారి మాయోభవాయ విష్ణుస్త్వాన్వేతు, పంచ పశుభ్యో విష్ణుస్త్వాన్వేతు / షడృతుభ్యో విష్ణుస్త్వాసేతు / సప్త పదుభ్యో హోత్రాభ్యో విష్ణుస్త్వాసేతు /

దీని భావం యేమిటంటే "ఓ చిన్నదానా! నీవు నన్ను అనుసరించి నడు. విష్ణుమూర్తి నువ్వు నడిచే మొదటి అడుగు వల్ల అన్నం, రెండవ అడుగు వల్ల బలం, మూడవ అడుగు వల్ల కర్మ, నాల్గవ అడుగు వల్ల కర్మసుఖం, అయిదో అడుగు వల్ల పశు సమృద్ధి, ఆరో అడుగు వల్ల ఋతు సంపత్తు, ఏడో అడుగు వల్ల యజ్ఞం చేయించే హోత, ప్రశాస్త, బ్రాహ్మణాచ్ఛంసి, పోత, నేష్ట, అచ్ఛాదిక అగ్నీధ్రులను ఏడుగురు ఋత్విక్కులను కలుగచేయుగాక!"

సఖా సప్తపదా భవసఖాయౌసప్తపదాబభూవ్మ సఖ్యం తేగమేమ్గం సఖ్యాత్తేమాయోషగ్ం సఖ్యాన్మేమాయోష్టాస్స మాయాన సంకల్పానపై సంప్రియౌ రోచిష్ణూ సుమసద్యమానౌ॥

ఇష మూర్జమభిసంవసానౌ సంనౌ మనాగ్ంసి సంవ్రతా సిముచిత్తా న్యాకరం సాత్వమ సమూహామి యూహాయస్మి స్వాత్యం దేరహం పృధివీ త్వగ్ంరేతోఽహగ్ంరేతోఽర్బోత్త్వమన్ఽ ఽహస్మివాక్త్వగ్ం సామూహో మస్మృృక్తగ్సామా మనువ్రతా భవపుగ్ంసే పుత్రాయు వేత్తవ ఏహి సూనృతే॥

(ఓ చిన్నదానా! మనమిద్దరము ఏడడుగులు నడిచి స్నేహము కలవారమైతిమి. నీ స్నేహమును పొందితిని. నన్ను విడువకుము. నిన్ను విడువను. మనము పరస్పరము ప్రేమగలవారమై యనుకూలమైన దాంపత్యం లభించుటచే మంచిమనసుగలవారమై సమానమైన యాహార బలమును గలవారమై సమాలోచన చేసికొనుచు కార్యములు నిర్వర్తించు కొనుచు ధర్మకార్యములను చేయుచుందుము. నేను సామవేదమును నీవు ఋగ్వేదమును అయితిమి. సంయోగ క్రియనుబట్టి యూర్ధ్వమందుండుటచే నేనాకాశసమానుడను. నీవు క్రింద నుండుటచే భూమితో సమానురాల వైతివి. నేను వీర్యమును వుంచువాడను. నీవా రేతస్సును గ్రహించుదానవు. ఇంద్రియములలో ప్రధానమైన మనస్సును నేనైతిని. నోటనుండి వచ్చిన వాక్కు నీవైతివి. ఓ సత్యవాక్కు గలదానా! అటువంటి నీవు చేయు ధర్మకార్యములకు అనుకూలమైన దానవై యుండుము. నీవలన భాగ్యముగల కుమారుని పొందవలయుగాన నిటురమ్ము.)

ఈ సప్తపదివల్లగాని స్త్రీకి పితృగోత్ర విముక్తిలేదు, పతిగోత్ర ప్రాప్తి కాదు. మనుస్మృతి ప్రకారం "నో దకేన నవా బావా కావ్యాయఃపతి మచ్యతే పాణిగ్రహణ సంస్కారా త్పతిఃస్యా త్సవమే పది" అని ఉదకంతో దానం చేసినా, "కన్యంతుభ్య మహం సంప్రదదే" అని చేసినా కుదరదు. కన్యాదానం చేసింతర్వాత మంత్రాలచే పాణిగ్రహణం చేసి సప్తపది జరిపిస్తేనే శాస్త్రీయ వివాహం అవుతుంది, లేకపోతే కాదు. (నేటి న్యాయశాస్త్ర రీత్యా కూడా సప్తపది జరిగితేనే సాంప్రదాయక పద్ధతి వివాహాలు చెల్లుబడి అవుతాయి. దీనికి బహుశా మనువే ఆధారం అయివుండాలి.)

ఇది అయింతర్వాత హోమాలు చేయిస్తారు. లాజ హోమం వీటిలో ముఖ్యం. వధువుకి సోదరుడు లేకపోతే లోటు. లాజ హోమానికి సోదరుడు ప్రాముఖ్యం. అక్కణ్ణుంచి గృహస్థు అయి గృహస్థాశ్రమ ధర్మాన్ని

నిర్వర్తించాలి. యీ తతంగం అంతా జరపడానికి నాలుగున్నర రోజులు అవసరం. అంత తక్కువైతే వివాహానికి బలం లేదని సూత్రకారుల తీర్పు. ఏకరాత్ర వివాహం లేదు, ఆమోద యోగ్యమూ కాదు.

ఇంతమట్టుకి మంత్ర సమ్మతమైన వివాహక్రియ. అంటే, సూత్రకారుల మతం ప్రకారం వివాహానికి ఆలంబన అయినవి యివి మాత్రమే.

మరి యీనాడు వివాహక్రియలో వీటిలో యెన్ని నిలిచి వున్నాయి? అయిదురోజుల పెళ్ళిళ్ళు జరిపించడం ఆర్థికంగా యిబ్బందుల మాట అలా వుంచినా, ఆధునిక జీవితపు ఉద్యోగాల వొత్తిళ్ళ మూలంగా వధూవరుల క్కూడా సాధ్యం అవదు. పూర్వంరోజుల్లో వ్యావసాయిక నాగరికతలో అది కుదిరి వుండచ్చు. బెల్లం జీలకర్ర సుముహూర్తం పేరు చెప్పి పెట్టించడం మంత్రంలో లేదు. వాటినే యెందుకు వుంచాలి? వాటిలా వధూవరులు కలిసి పోతారని వ్యాఖ్యానం చెప్పారు! వధువుని మేనమామలు బుట్టలో తీసుకురావడం మంత్రంలో లేదు. బుట్టలో ఎందుకు తీసుకురావాలి? (చిన్న పిల్లలుగా వున్నప్పుడు, అంటే ఎనిమిదేళ్ళ వయసులో వున్నప్పుడు అలా తీసుకురావడం తేలిక. యివాళ పాతికేళ్ళ పిల్లల్ని అలా తీసుకురావడం బలిష్టులైన మేనమామలకే సాధ్యం. అందుకనేనేమో చాలా చోట్ల వధువు నడిచి వస్తూ వుంటే మేనమామలు పక్కన బుట్ట మోసుకువస్తూ వుంటారు. అలా తీసుకువచ్చినందుకు కూడా జామారు పట్టుకుపోతారు!) యిక నలుగులు, దండాడింపులు వగైరాలన్నీ వేడుక నిమిత్తమే. వీటన్నిటికీ సంప్రదాయం తప్ప ప్రమాణం లేదని పండితులే అంటున్నారు.[1]

అలాగే మంగళసూత్రం కాని, నల్లపూసలుగాని, మట్టెలుగాని ఏవీ ధర్మశాస్త్ర విహితమైన క్రియలో లేవు. ఈనాడు వివాహమైనట్టు గుర్తుగా ప్రబలంగా కనిపించే చిహ్నాలు యివన్నీను! మంగళ సూత్రం మంగళాచార ప్రాప్తమనీ, వివాహ క్రియల మంత్ర బద్ధం కాదనీ ఆ ధర్మాన్ని వివరించే పండితులే అంటున్నారు.[2] అలాంటిది మంగళసూత్రమే పెళ్ళికి ముఖ్యమైన పట్టీ అయి కూర్చుంది. "మాంగల్యం తంతునానేనా మమజీవన హేతునా, కంఠే బధ్నామి సుభగే జీవేన శరదామ్ శతమ్" అనేది పరమ పవిత్రబంధం

---

1. చూడండి: రేమళ్ళ సూర్యప్రకాశ శాస్త్రిగారు (ప్రిన్సిపాల్, సంస్కృత కళాశాల, రాజమండ్రి) రాసిన వ్యాసం.

2. పైన చెప్పిన రెండింటికీ "హిందూ వివాహము" (వ్యాస సంపుటి, బ్ర॥వే॥ బులుసు అప్పన్నశాస్త్రి మహోదయుల పర్యవేక్షణలో విజయలక్ష్మి పవర్ ప్రెస్, భట్నవిల్లి, అమలాపురం తాలూకా) అన్న పుస్తకంలో పండితుల వ్యాసాలు సాక్ష్యం.

అయింది! మన ప్రాచీన గ్రంథాల్లో కూడా మంగళసూత్రానికి యింత నమ్మకమైన ప్రాముఖ్యం లేదు. ఉదాహరణకి వాల్మీకి "రామాయణం"లో సీతారాముల వివాహఘట్ట వర్ణనలో మంగళసూత్రం ప్రస్తావన లేదు.

"రామస్యలోక రామస్య క్రియాం వైవాహికం విభో" (లోకులనందరను రమింపచేయగల రామునకు వివాహకర్మంబు నంతయు నీవు ఋషులం గూడి చేయింపుము) అని జనకమహారాజు వసిష్ఠ మహామునిని అర్థిస్తాడు. అప్పుడు వసిష్ఠుడు ఏర్పాట్లు చేస్తాడు. ఆ ఏర్పాట్లో బంగారు పాలికలు, మూకుళ్ళు, ధూపంతో వున్న ధూప పాత్రలు, శంఖం వంటి పాత్రలు, స్రుక్కు స్రువాలు, అర్ఘ్యపాత్రలు, పేలాలతో నిండిన పాత్రలు (లాజపూర్ణైశ్చ పాత్రభి) వున్నాయి. వివాహ "వేదిక యందగ్నిం బ్రతిష్ఠించి శాస్త్ర పద్ధతిని సమంత్రకముగా నొకదాని కొకటి హెచ్చు తక్కువలు లేని దర్భలం బఱచి వైదిక మంత్రములచే వధూవరుల కభ్యుదయార్థంబు" వసిష్ఠుడు హోమం చేశాడు. అప్పుడు జనకమహారాజు సర్వాభరణ భూషిత అయిన సీతను అగ్నికి, రాముడికి యెదట నిలబెట్టేడు.

ఇయం సీతా మమసుతా సహధర్మ చరీతవ,
ప్రతీచ్ఛ చైనాం భద్రంతే పాణిం గృహ్ణీష్వ పాణినా
పతివ్రతా మహాభాగాభాయేవాను గితాసదా
ఇత్యుక్త్వా ప్రాక్షి ప్రద్రాజా మంత్రపూతం జలంతనా

(నా కుమార్తె సీత యిదిగో! ఈవిడ నీకు ధర్మపత్ని కాగలదు; ఈవిడను బ్రతిగ్రహింపుము; నీకు మంగళ మగుగాక; నీ హస్తమున నీవిడ హస్తము గ్రహింపుము. ఈ సీత పతివ్రతయయి మహాభాగ్యంబునొంది నిన్ను నీడవలె ననుసరింపుచుండంగలదని జనకుండు రామునితో చెప్పెను. జనకమహారాజిట్లు చెప్పి రాముని హస్తంబున సమంత్రకంబుగా నీళ్లు విడిచెను.)

ఆ తర్వాత లక్ష్మణ భరత శత్రుఘ్నులకీ యీ మాదిరే కన్యాదానాలు జరిపిస్తారు. అప్పుడు "ఆ రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు మూడుమారు లగ్నికి" (త్రిరగ్నింతే పరిక్రమ్య) ప్రదక్షిణం చేసి పెళ్ళి జరిపించుకున్నారు.

పరమ పవిత్రంగా యెంచే "రామాయణం"లో సూక్ష్మంగా వర్ణించిన వైదికాచార, సమంత్రక వివాహ క్రియ ఇదే. మంగళ సూత్రం మాత్రం లేదు. "భారతం"లో వున్నట్టు దాఖలాలూ లేవు. ఒకవేళ వున్నా ద్రౌపది పంచభర్తృక కాబట్టే అయిదు మంగళ సూత్రాలు ధరించాలా? మంగళసూత్ర ప్రస్తావన పోతనగారి భాగవతంలో వుంది.

పండితారాధ్య చరిత్రలో

మొదలి మంగళసూత్రములు దాల్చునట్లు
వొదలు మంగళసూత్రములు ధరించి

అని యీ ప్రస్తావన వుంది.

ఆంధ్రభారతంలో దీర్ఘతముని వృత్తాంతంలో స్త్రీలకు శాపం ప్రాప్తిస్తుంది.

పతిహీనలయిన భామినులతిధనవతులయ్యుఁగులజలయ్యును ననలం
కృతలమ్మొద మాంగల్య రహితలయ్యెడు గృపణవృత్తినిదియు మొదలుగాన్
(ఆదిపర్వం, 4–230)

యీ సందర్భాలలో మంగళసూత్ర ప్రస్తావన వుంది.

క్షీరసాగర మధనం జరిగింది. దేవదానవులు మందరగిరిని పాలసముద్రంలో మధించడం మొదలుపెట్టారు. అప్పుడు హాలాహలం యెగిసింది. పరమశివుడు ఆ హాలాహలాన్ని మింగడానికి ముందుకు వచ్చేరు. పార్వతీదేవి అంగీకరించాలి కదా మరి!

మ్రింగెడు వాడు విభుండని
మ్రింగుమనె గరళమనియు మేలని ప్రజకు నే
మ్రింగుమనె సర్వమంగళ
మంగళ సూత్రంబు నెంతమదినమ్మినదో!

పార్వతీదేవి మాంగల్యబలం అంతటిదని!

వేదంలో లేని మాంగల్యం, రామాయణ, భారతాల్లో లేని మాంగల్యం తరవాత తరవాత వివాహ క్రియలో చేరింది! మాంగల్యధారణ మహోత్సవాలు లేని రోజులు వున్నాయని, మాంగల్యం మంత్రబద్ధం కాదని పండితులే అంటున్నారని తెలిసినప్పుడు దాని మహత్తు ఏమిటో గ్రహించాలి.

వివాహ విధానం ఆర్షసంప్రదాయ పద్ధతిలో జరుగుతోందనే అంటున్నా, దక్షిణాది ఆచారాలు చాలా చేరాయి. తెలుగు కావ్యాల్లో తెలుగు ఆచారాలని వర్ణించడం వుంది. తిక్కనగారి విరాట పర్వంలో యీ విశేషాలు చూడవచ్చు. ఎదురుసన్నాహం, తెర, తలంబ్రాలు, అల్లునికి అరణం లాంటివి వర్ణించేరు. అసలు మేనరికాలే దక్షిణాది ఆచారం.

ఇక వీటినన్నిట్నీ తలదన్నే సంప్రదాయం మరోటి వుంది. అదేమిటంటే–

పురుషునికి బహుభార్యాత్వం. తైత్తిరేయ సంహితలో "తస్మాదేగోద్వేజాయ విన్దతే" (6-64) (ఒక పురుషుడు యిద్దరు భార్యలను వివాహం చేసుకోవచ్చు) అని వుంది. బృహదారణ్యక ఉపనిషత్తులో దర్శనమిచ్చే యజ్ఞవల్క్య మహర్షికి మైత్రేయి, కాత్యాయిని ఇద్దరు భార్యలుండే వారు. అదీగాక సాంప్రదాయక పద్ధతి వివాహంలో వొక భార్య వున్నవాడు రెండో పెళ్ళి చేసుకునేటప్పుడు సుముహూర్తంలో చెయ్యాల్సిన హోమాలు వగైరా విడిగా వున్నాయి. మనువు ఇంతకంటే మంచి విషయం మరోటి చెప్పాడు-

శూద్రాచ భార్య శూద్రస్య సాచస్వాచ విశస్మృతేః
తేచస్వాచైవ రాజస్తు తాశ్చసాచబాగ్ర జన్మనః

అని. బ్రాహ్మణుడు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర కన్యలను, క్షత్రియుడు క్షత్రియ వైశ్య శూద్ర కన్యలను, వైశ్యుడు వైశ్య శూద్ర కన్యలను, శూద్రుడు శూద్రకన్యలను మాత్రమే చేసుకోవాలి. మరి ఈనాడు మనువు చెప్పింది పాటించాలంటే ఆర్థికస్తోమత విషయం ఎలావున్నా ప్రభుత్వంవారి శాసనాలు వొప్పుకోవు. ఇప్పుడా మనువు వాక్యం పాటించక పోవడానికి కారణం వొకటి ఆ పండితులే సెలవిచ్చారనుకోండి. అదేమిటంటే, "మనుస్మృతి చతుర్యుగ సాధారణమైన దగుటచే యుగాంతరమని వ్యవస్థ చేశా"రట. (అదే పుస్తకం.) అంటే సర్వకాల సర్వావస్థలకీ హిందూ వేదప్రోక్త ధర్మం పనికిరాదని తేలిపోయింది కదా! మన్వాది స్మృతులలో "వర్ణాన్తర" వివాహం ఈ రూపేణా వున్నా "యుగాన్తర విషయం"గా గ్రహించి "కలియుగంలో దాన్ని వర్జించవలయు"నని పండితులంటున్నారు. ఆర్షోక్త పద్ధతీ కలియుగానికి నచ్చదని వదిలెయ్యవచ్చుగా!

వివాహక్రియకి సంబంధించి మంత్రంలోవున్న మహిమకంటే లేనిదానికే యెక్కువ అట్టహాసం కనబడుతుంది. అదే సంప్రదాయ పద్ధతి అని నిజంగా నమ్ముతున్నారు. అసలు ధర్మశాస్త్రాల్ని ఉల్లంఘించి ధర్మశాస్త్ర పద్ధతిలో పెళ్ళి చేసుకుంటున్నా మనుకోవడం యే సంప్రదాయం అవుతుంది? ఆ ఉల్లంఘించడం అసలు సంబంధం చేసుకోవడంలోనే వుంది. అది బంధుత్వానికి సంబంధించినది. ఏమిటంటే, మేనరికం చేసుకోవడం. మేనరికమంటూ వుంటే ఆ సంబంధానికి మొదటి మొగ్గు. తర్వాతే పై సంబంధానికి వెడతారు. దక్షిణాదిన మాత్రమే యీ పద్ధతి వుంది. (ఆంధ్రదేశంలో మేనరిక వివాహాల గురించీ అత్త, మామ అనే వరసల

గురించీ మోర్గన్ పరిశోధనలో రాశేడు. దాన్ని ఏంగిల్స్ "కుటుంబమూ, వ్యష్టి ఆస్తీ, రాజ్యమూ పుట్టుక" అన్న గ్రంథంలో వివరించేడు.) ఉత్తర భారతంలో తల్లి సోదరుల్నే మామ అంటారు. పిల్లనిచ్చిన వాళ్ళని అత్తమామ అనరు. ఇంగ్లీషులో In - laws అని వ్యవహరిస్తారు, వివాహం వల్ల ఏర్పడ్డ బంధుత్వం వరస, వాళ్ళు తల్లితండ్రి సములని. ఇంతకీ మేనరికం సంబంధం శాస్త్ర దూష్యం. దాదాపు అందరు సూత్రకారులూ దీన్ని నిషేధించారు. మేనత్త మేనమామ పిల్లల్ని చేసుకోవడం మహాపాతకమని అపస్తంబ ధర్మసూత్రాల్లో చెప్పారు. బోధాయనుడు, గౌతముడు దీన్ని ఖండించారు. మనువైతే ఇది పాతకమనీ యీ పాపం చేసినందుకు చాంద్రాయణ ప్రాయశ్చిత్తం చెయ్యాలనీ శాసించేడు. కులచ్యుతులౌతారని కూడా మనువు అన్నాడు. కాని, దక్షిణదేశంలో ప్రాచుర్యంగా వున్న యీ ఆచారం మాతృస్వామిక కాలంనాటి చిహ్నం. (లోకాయత 221, డి.బి. ఛట్టోపాధ్యాయ) ధర్మశాస్త్ర ప్రవర్తకులు కూడా తాము చెప్పిన పద్ధతికి విరుద్ధంగా వున్నా, తాము ఎన్ని ప్రాయశ్చిత్తాలు ఈ పాపానికి విధించినా దేశాచారంగా వుంది కాబట్టి తగ్గి దీనికి మినహాయింపు యిచ్చుకున్నారు. ఇలాంటి వివాహాలు (మేనరికాలు) చేసుకోవచ్చని ఆంధ్రులైన స్మృతి చన్ద్రికా కారులు అన్నారు. ఇలాంటప్పుడు శాస్త్రోక్తంగా జరిపిస్తున్నామనుకునే వివాహాలకి బలం ఏముంది? ఇప్పుడైతే వైద్యశాస్త్రరీత్యా మేనరికాలు కూడదు అంటున్నారు. ధర్మశాస్త్రవేత్తలు ఏ దృష్టితో చెప్పినా, ప్రాయశ్చిత్తాల బెదిరింపు చూపించినా తగ్గని మేనరికాలు వైద్యశాస్త్రం కూడదనడంతో తగ్గుతున్నాయి! ధార్మిక నియతికంటె భౌతికనియతి బలమైంది కదా!

వేదోక్తంగా వివాహం జరిపిస్తున్నాం, ధర్మశాస్త్రం ప్రకారం నడుస్తున్నాం అనుకునేవాళ్ళు అసలు వేదకాలంలో వివాహాలు ఎలా జరిగిందీ తెలుసుకుంటే మంచిది. ఋగ్వేదం (దశమ మండలంలో) వివాహం గురించి వుంది.

"ప్రౌఢలై వరసమాగమమును అభిలషించు వధువులు మాత్రమే వివాహ మొనరింపదగినవారు. వరుని మిత్రులు వధువు తండ్రివద్దకు వచ్చి కన్యనిమ్మని అర్థింతురు. వివాహము కన్య ఇంటగాని వరుని ఇంటగాని జరిగేది. కన్యాదాత రెండెడ్లను పూన్చిన రథము మీద కన్యను కూర్చుండబెట్టి వరుని గృహమునకు పంపును. వివాహ సూచకముగా వరుడు, వధువు హస్తము పట్టుకొనును (పాణిగ్రహణం). పెద్దలందరు వధూవరుల నాశీర్వదింతురు."

అనాడు రజస్వలా పూర్వ వివాహాలు లేవు. మంగళ సూత్రాదికాలు లేవు. ఇవాళ జరుపుతున్న మంత్రోక్త వివాహాల్లో చాలా భాగం వేదంలో లేనివీ, అనార్య సంప్రదాయాలైనవీ చేరాయి.

సాంప్రదాయక పద్ధతి వివాహాల్ని గురించి ఇంత చర్చచేస్తే తేలిందేమిటంటే – పరమ పవిత్రంగా పాటించి మన్నించే మంగళ సూత్రాదులన్నీ ఆచారవతుగా వచ్చినవే తప్ప మంత్రబద్ధం కాదు. మంత్ర విహితమైంది ఏదన్నా వుంటే సప్తపదిలాంటి వొకటో అరో అంతే. మరి వివాహం పేర జరిగే తంతు అంతా ఎప్పుడు ఎలా వచ్చిందీ ఆ మంత్రాలేనా ఎలా వచ్చేయి అనేది చారిత్రకాంశాల పరిశీలన మీద గాని తేలదు. అసలే చారిత్రక దృష్టి తక్కువగా వున్న ఈ దేశంలో, పురాణాల్లో చరిత్రని దర్శించే ఈ దేశంలో, అది యింకా కష్టం. అంచేత ధర్మ విహితమైన పద్ధతి అని చాటుకునే దాంట్లో అసంబద్ధంగా వుండేదాన్ని చూస్తే అందులోని బలం తేలుతుంది. భార్యాభర్తల సంబంధం యెలా వుంటుంది? యెలా వుండాలి? ఈ విషయాల గురించిన అవగాహనే "ధర్మబద్ధ" వివాహానికీ, ఆధునిక దృష్టికీ మధ్యవున్న తేడాని తెలియచేస్తుంది.

*పతియు భరియించుగావున భర్త యయ్యె*
*భామ భరియింపబడుఁగాన భార్యయయ్యె*

యిదే భర్త, భార్యల సంబంధం. భరించడం, భరించబడ్డం తప్ప కలిసి జీవితం గడపడానికి తగ్గ పునాది లేదా?

ఆధునిక దృష్టిలో భార్యభర్తల అనుబంధం "మాయమర్మము లేని నేస్తం"తో వస్తుంది. అది మగువలకు మగవారికి వొక్కటే. యిక్కడ అధికారం చెలాయించడంగాని, సేవ్య సేవక సంబంధంగాని వుండవు. "మగడు వేల్పన పాత మాటది." భర్త, భార్య "హృత్కమలంపు సౌరభం" నిండిన స్నేహితులు. ఆధునిక జీవిత విధానానికి నప్పని అంశాలు వుండడమే కాక ఆధునిక జీవిత విశ్వాసాలకి అందని అంశాలు చాలా వున్నాయి. హిందూ వివాహ పద్ధతిలో కన్యాదానం చేస్తేనేగాని వివాహానికి శుద్ధిలేదని పండితుల అభిప్రాయం. అక్కడే ఆధునిక ఆలోచనా పద్ధతికి వైరుధ్యం ఎదురవుతుంది. కన్య ఏమన్నా వస్తువా దానం చెయ్యడానికి? అష్ట ఐశ్వర్యాల్లోనూ స్త్రీని కూడా చేర్చిన నాగరికతలో అది చెల్లుతుంది కాని యీనాటి ఆలోచనా ధోరణికి అది అనుచితం.

మతపరమైన యీ పద్ధతిలో వివాహం అనేది ఏదోవొక ధర్మ నిర్వహణకే. స్త్రీ పురుషుల ఆత్మీక బంధం పునాదిగా పరిపూర్ణ జీవితానికి వేసే బాట కాదు. అందుకనే కామోసు - ధర్మ నిర్వహణకి ధర్మపత్ని, సుఖసంతోషాలకి అదనపు పత్నులూ వుండేవారు. లేకపోతే దేవదాసీలూ, బసివిలూ కళాపోషణకోసం వొక తెగగా ఎందుకు వుండేవాళ్ళు? అంచేత, ఆ నాగరికతకి అనువైన వివాహపద్ధతి అది. మిగిలిన ప్రపంచ దేశాలతో పోలిస్తే మన దేశంలో కుటుంబ వ్యవస్థ "దాంపత్యబంధం" బలంగానే వున్నాయి. దానికి కారణాలు చారిత్రక సాంస్కృతికమైనవి కాని, వేదోక్త వివాహ మహిమవల్ల కాదు. (హిందూ వివాహ పద్ధతి ఏమిటో మాత్రమే యిక్కడ చూశాం కాని ఆ అంశాలని చర్చించలేదు.)

ఆధునిక దృష్టి "మాయమర్మము లేని నేస్తము మగువలకు మగవారి కొక్కటె" అన్నది. దీనికి గుర్తులూ, చిహ్నాలూ అక్కర్లేదు. ఒట్లూ, సాక్ష్యాలూ అక్కర్లేదు. హృదయాలనీ అనుభూతులనీ శాసించే చట్టం లేదు - అస్తి అత్రిక్రమించుకునే ఆచరణకి తప్ప!

★ ★ ★

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు రాసిన 'వివాహాచార విచారము' అన్న వ్యాసం చూడదగింది. ఈ వ్యాసం అద్దేపల్లి అండ్ కో వారు ప్రచురించిన వ్యాస రత్నావళిలో వుంది.

# కుల వ్యవస్థ
# ఆధునిక సమాజం

ప్రపంచ దేశాల్లో ఏ దేశానికీ లేని ప్రత్యేకత భారతదేశానికి వుంది. అది అవిచ్ఛిన్న సాంస్కృతిక వారసత్వం. ఇరాక్, ఈజిప్ట్ దేశాల సంస్కృతులు కూడా ప్రాచీనమైనవే. అయితే ఆ దేశాల్లో భారతదేశంలో ఉన్నట్లుగా పాత కాలపు సంస్కృతులు నిలవలేదు. ఇరాక్ (మెసపొటేమియా – సుమేర్, అస్సీర్, బాబిలోనియా నాగరికతలు), ఈజిప్ట్, పర్షియా దేశాల సంస్కృతులు దాదాపు కనుమరుగై పోయాయి. గత శతాబ్దంలో పండితుల చలవ వల్ల మళ్ళీ అవి బయటకు వచ్చాయి. కాని అవిచ్ఛిన్న సాంస్కృతిక వారసత్వంగా యీనాటి తరానికి అందలేదు. ఈజిప్టులో ఫారో చక్రవర్తుల నాటి సంస్కృతి, పర్షియాలోని జోరాష్ట్రియన్ సంస్కృతి, మెక్సికోలోని అజ్టెక్ సంస్కృతి అవశేషాలు యివాళ లేవు. ఈజిప్టులో మొదట గ్రీకులు, రోమన్లు, తర్వాత క్రైస్తవ మతం, తర్వాత ఇస్లాం వచ్చి ఫారోల నాటి సంస్కృతిని మరుగున పడేశాయి. జోరాష్ట్రియన్ సంస్కృతి భారతదేశ పార్శీలలో కొనసాగుతోంది. కాని పార్శీలు ముస్లిం దండయాత్రల వల్ల వలస వచ్చేయడంతో ఇరాన్‌లో ఆ సంస్కృతి లుప్తమైంది. అలాగే స్పానిష్ దండయాత్ర వల్ల అజ్టెక్ సంస్కృతి హరించుకుపోయింది. కాని భారతదేశంలో మాత్రం మూడు వేల ఏళ్ళ నాటి సంస్కృతీ వారసత్వం యిప్పటికీ వుంది. చైనా, గ్రీక్ దేశాలకు కూడా ఎంతో ప్రాచీన చరిత్ర, సంస్కృతి ఉన్నాయి, కాని వాటి గురించి చెప్పుకోవాలన్నా భారతదేశం తర్వాతే. భారత దేశ జన సామాన్యంలో యీనాటికీ యేనాటి ఆచారాలో నిలిచివున్నాయి.

ఇవాళ్టికీ భారతదేశంలో బ్రాహ్మణులు సంధ్యావందనం చేసేటప్పుడు గోత్రప్రవరల్ని వర్ణించుకుంటూ వుంటారు. జంబూ ద్వీపే, భరత వర్షే,

భరత ఖండే అంటూ సంకల్పం చెప్పుకుంటూ ఉంటారు. ఇవి యే మూడు నాలుగు వేలయేళ్ళ నాడు కూర్చినవో. యావద్భారతం ఆసేతు శీతనగం, ఒక్క ఏలుబడి కింద చరిత్రలో ఎన్నడూ లేకపోయినా 'గంగా కావేరీ సన్నిధౌకురు:' అనుకోవడమూ, రామేశ్వరంలో సికతాగ్రహణం చేసి ఆ ఇసుకను కాశీ దగ్గర గంగలో కలపడమూ ఏనాటి నుంచో వస్తున్న ఆచారాలు. వీటి వల్ల భారతదేశ ప్రాదేశిక, మానసిక ఏకతా భావన వారసత్వంగా సంక్రమిస్తూ వచ్చింది. ఇలాగే 'హరిశ్చంద్ర నలోరాజా' అంటూ జనం చక్రవర్తుల వీరగాధల్ని మననం చేసుకుంటూ వుంటారు. 'ధర్మక్షేత్రే కురుక్షేత్రే' అని పవిత్రంగా స్మరించుకుంటూ కురుపాండవ గాధని 'మహాభారతం'గా మనసుల్లో నిలుపుకుంటారు. హరప్పా, మొహంజోదారోలో నాటి శక్తి, శివ ఆరాధనలు; యోగ, గ్రామదేవతల పూజ యింకా జనంలో కనిపిస్తూనే వున్నాయి. ఇక వేదప్రామాణ్యం నిత్యజీవితంలో 'ఆయన మాట వేదవాక్కు, జవదాటడానికి లేదు' అన్న రీతిలో సూత్రీకరణ అయింది. ఇంతటి అవిచ్ఛిన్న వారసత్వం ఏదో పుస్తకాలలో చదివి మననం చేసుకునేటట్టు కాకుండా భారతదేశ జనవ్యవహారంలో పదిలంగా వుండడమే యీ దేశ ప్రత్యేకత. చైనాలో క్రీ.పూ. 1400 నాటి చారిత్రక ఆధారాలు లభ్యమవుతూ వున్నాయి. గ్రీక్, రోమ్‌ల ప్రాచీన చారిత్రక ఆధారాలు లభ్యమవుతూ వున్నాయి. కానీ భారతదేశంలో మాత్రం ఆ పురాతన అవశేషాలు జన సంప్రదాయంలో మాత్రమే మిగిలి వున్నాయి. చారిత్రక ఆధారాలు లేవు. "హిందువులలో చరిత్రాత్మక దృష్టి (sic) చాలా వరకు తక్కువ" అని కట్టమంచి రామలింగారెడ్డి గారు రాశారు. (వ్యాసమంజరి, పేజీ 152.) 'భారతీయులు చారిత్రక దృష్టి లేనందుకు విమర్శకు గురవుతూ వుంటారు. చారిత్రక దృష్టి లేకపోవడం అనేది ఉద్దేశ్యపూర్వకంగా దీన్ని కలిగించుకున్నారా? ఆర్య, అనార్య సంస్కృతీ సంప్రదాయాలు ఏక భారత సంస్కృతీ సంప్రదాయాలుగా సమ్మిళితం చెందేందుకు చెల్లించిన మూల్యం' అని సునీతీకుమార్ చటర్జీ అభిప్రాయపడ్డారు. భిన్న భిన్న అంశాలు కలిసాయి. యీ విషయాన్ని కావాలనే చరిత్రపరంగా విస్మృతి పథంలో పడెయ్యడం జరిగిందని, లేకపోతే భిన్న భిన్న అంశాలు అఖండ సంస్కృతిగా రూపొందకుండా అవరోధంగా తయారయేవని కూడా ఆయన రాశారు. ఏమైనా చారిత్రక ఆధారాలు లేని అఖండ సంస్కృతీ వారసత్వం భారత దేశానికి అందింది. ఈ సంస్కృతీ వారసత్వంలో మహోన్నత భావనలు వున్నాయి. మహత్తర

వ్యవస్థలూ వున్నాయి. మకిలిపట్టి పోయినవీ వున్నాయి. భారతదేశ వివాహ వ్యవస్థ ప్రపంచంలోని యితర దేశాల వివాహ వ్యవస్థలతో పోలిస్తే చాలా పటువుగా వుందనే చెప్పాలి. ఇక మకిలిపట్టి వారసత్వంగా వచ్చిన వ్యవస్థ కుల వ్యవస్థ. ఇది యీనాటికీ పెద్ద సమస్యగా వుంది.

హిందూ జీవిత దృక్పథంలో యీ వ్యవస్థ అంతర్భాగమైంది. హిందూ మతానికి – యీ జీవిత దృక్పథాన్ని మతం అని పిలవగలిగితే కులవ్యవస్థ కోటగోడలా వుంది. మూడు వేల యేళ్ళ నుంచి ఊపిరి పీలుస్తూనే వుంది. అరబ్బులు, సిథియన్లు, తార్తార్‌లు, హూణులు, ఆఫ్ఘన్‌లు, ఆఖరిగా ఇంగ్లీషు వాళ్ళు యీ మహా దేశం మీద దండయాత్రలు చేశారు. ఆధిపత్యం చెలాయించారు. కాని యీ వ్యవస్థ మాత్రం అలానే వుంది. హిందూ మత పరిధిలోనే కుల వ్యవస్థకి వ్యతిరేకంగా ఎన్నో ఉద్యమాలు తలెత్తాయి. 'జైన, శైవ, వైష్ణవములు మూడింటిలోనూ కుల భేద నిర్మూలనము ఒక సామాన్య ధర్మముగా వ్యక్తమగుచున్నది' అని సురవరం ప్రతాపరెడ్డిగారు రాశారు. 'కుల వ్యవస్థని నిర్మూలించాలనుకున్న సంస్కర్తలు కూడా కొత్త కులాలని స్థాపించడంలోనే కృతకృత్యులయ్యారని' నీలకంఠ శాస్త్రిగారు రాశారు. పండిత త్రయం (శ్రీపతి పండితుడు, శివలెంక మంచన పండితుడు, మల్లికార్జున పండితారాధ్యుడు) వారు 'శివభక్తాగ్రేసరులైనను వర్ణధర్మమును వీడలేదు' అని ఖండవల్లి లక్ష్మీరంజనం, బాలేందుశేఖరం గారలు రాశారు. శైవ, వైష్ణవాలలోనే యిలా జరిగింది. సిక్కు మతంలో, ఇస్లాంలో ఆఖరికి యీ దేశంలోని క్రైస్తవ మతంలో కూడా యీ కుల విభేదం చోటు చేసుకుంది గాని తగ్గలేదు. క్రైస్తవ మతం యేనాటి నుంచో వుందనుకున్న కేరళలోనే అస్పృశ్యత, కుల వ్యవస్థ చాలా బలంగా వున్నట్లు అక్కడివాళ్ళే అంటారు (అరుంధతీరాయ్ నవల ఉదాహరణ). రాజులు వర్ణాశ్రమాచార ధర్మాన్ని నిలబెట్టడానికే నడుం కట్టారు. హిందూధర్మానికి మబ్బులు కమ్ముతున్నాయన్న భయం కలిగినప్పుడల్లా వైదిక సంప్రదాయ పునరుద్ధరణకి సనాతన ధర్మపరాయణులు కంకణం కట్టేవారు. బౌద్ధ మత వ్యాప్తి జరిగాక హైందవ ధర్మానికి భంగం కలిగింది. అయితే మౌర్య సామ్రాజ్యం క్షీణించాక సుంగవంశ చక్రవర్తులు మళ్ళీ యీ మతోద్ధరణ జరిపించారు. మొత్తం మీద చరిత్రలో కుల వ్యవస్థ పడుతూ లేస్తూ నిలదొక్కుకుంటూనే వుంది. బీటలు, పగుళ్ళు కనిపించినప్పుడల్లా అతుకులు వేసుకుంటూ మళ్ళీ చోటు వెతుక్కుంటూనే వుంది. కట్టుబాట్లు సడలినట్లు కనిపించినప్పుడల్లా

కట్టుదిట్టాలు చేసుకుంటూనే వుంది. స్వతంత్ర భారతం అవతరించాక చట్టరీత్యా కుల వ్యవస్థకి గుర్తింపు రద్దయింది. సగోత్ర వివాహాలకి అవరోధం తొలగింది. కాని సామాజిక కార్యకలాపంలో కులాలకి ముప్పు రాలేదు. జనంలో కులం యెప్పటి లాగానే ఉంది. ఇంకా కొత్త రంగులతో ముస్తాబై ముందుకు వస్తూనే వుంది. కొత్త వివాదాలు మోసుకువస్తూవుంది. విద్యాధికుల్లో కూడా కులంలోని అముఖ్య అంశాలు పోయాయి. కాని సారభూతమైన అంశాలు నిలిచేవున్నాయి. వైషమ్యాలు, ఘర్షణలు మరింత తీవ్రంగా చెలరేగుతున్నాయి. సాంఘిక భద్రతకి విఘాతం కలిగిస్తున్నాయి. యిలాంటి పరిస్థితికి రాజకీయ యెత్తుగడలు కొంత, కులచట్రంలోని విభేదాలు కొంత కారణభూత మవుతున్నాయి. ఆధునిక సమాజం రాజకీయంగా ప్రజాస్వామిక స్వభావంతో వర్ధిల్లాలి. అయితే ప్రజాస్వామికంగా అధికారం అందుకోగల అవకాశాలు అందరికీ అందుబాటులో రావడం వల్ల కుల దృష్టి మరింత పాతుకోవడానికి పునాది కలిగింది. ఇదొక విచిత్రమైన పరిస్థితి. అన్ని భేదాలు సమసిపోవడం ప్రజాస్వామిక పాలనకి పునాది. అలాంటి పరిస్థితుల్లో భేదాలు, వేర్పాటు పునాదిగా ఉండే కులాలు మరింత బలపడడం యేమిటి? కులవ్యవస్థ పోతేనే గాని స్వచ్ఛమైన ప్రజాస్వామిక పాలన యేర్పడదు – సూత్రరీత్యా, కుల వ్యవస్థ స్వభావం రీత్యా. అలాంటిది, ప్రజాస్వామిక పాలనలో కులానికి పట్టు బిగవడం ఏమిటి? ఏమిటీ విరోధాభాస? చరిత్రలో యుగయుగాలుగా సమాజంలో జన్మరీత్యా సంక్రమించిన హెచ్చుతగ్గులతో, అంతస్తుల హోదాలతో అభేద్యమైన అంతర్గత మందిరాలను నిర్మించిన కులవ్యవస్థ ఆధునిక యుగంలో కూడా తన ఉనికి చాటుకుంటోందంటే సామాజిక శాస్త్రవేత్తలు నోళ్ళు వెళ్ళబెట్టి ఆశ్చర్యపోతున్నారు.

సమాజంలో అంతరాలు యేనాటి నుంచో వున్నాయి. ప్రపంచమంతా వున్నాయి. మార్క్స్, ఎంగెల్స్‌లు "కమ్యూనిష్టు ప్రణాళిక"లో లభ్యమాన లిఖిత చరిత్ర అంతా ఎలా వర్గపోరాటాలతో నిండివుందో వివరించారు. సమాజం వర్గాలుగా విడిపోవడానికి చారిత్రక ఆర్థిక కారణాలు చాలా వున్నాయి. ఈజిప్టులో పిరమిడ్ల కాలంలో మూడు ప్రధానమైన తరగతులు వుండేవి. భూస్వాములు, భూస్వామ్యదాసులు, బానిసలు, మొదటి తరగతి వాళ్ళకి భూమి పైన స్వామ్యం వుండేది. మిగిలిన రెండు తరగతులకీ భూమి మీద ఏ హక్కులు వుండేవి కావు. ఆతర్వాత నాలుగు తరగతులు

వచ్చినట్టు దాఖలాలు వున్నాయి. పూజారులు, సైనిక యోధులు, చేతి వృత్తులవారు, భూస్వామ్యదాసులు. సైనిక యోధవర్గంలో స్వేచ్ఛాయుత పౌరులందరూ ఉండేవాళ్ళు. వాళ్ళు మధ్యతరగతికి చెందినవాళ్ళే. వీళ్ళకీ, పూజారులకీ ప్రత్యేక గుర్తింపు వుండేది. అయితే సంపద విషయంలో పూజారి బృందం యోధవర్గం కంటే అధిక్యంలో వుండేది. చేతివృత్తుల వాళ్ళకి మాత్రం ఆ వృత్తులు తప్ప వేరేవి వుండకూడదు. వంశాచారం ప్రకారం వస్తూవున్న వృత్తినే అందుకోవాలి. ఆ రకంగా ఆ కుటుంబాలు తరతరాలుగా ఆ వృత్తుల్నే నమ్ముకుని వుండాల్సి వచ్చేది. ఇరాన్‌లో కూడా మూడు సాంఘిక తరగతులు వుండేవి. పురోహిత వర్గం, యోధులు, పశుపోషకులు. చేతివృత్తులు చేసే నాలుగో వర్గం కూడా వున్నట్లు తెలుస్తోంది. చైనాలో కూడా ఏనాటి నుంచో నాలుగు తరగతులు వున్నట్లు దాఖలాలు వున్నాయి. ఉన్నత వంశీకులు, వ్యవసాయదార్లు, చేతివృత్తులవాళ్ళు, వర్తకులు. జపాన్‌లో కూడా యిదే తరహా విభజన వుంది. అయితే అక్కడ క్షాత్రయుగంలో అయిదు ప్రత్యేక తరగతులు వుండేవి. క్షాత్ర జాతి వంశ పారంపర్యంగా వుండేది. వాళ్ళని సమురాయ్ అనేవారు. యీ అయిదు తరగతుల్లో వీళ్ళదే అగ్రస్థానం. ఆ తర్వాత వ్యవసాయదార్లు, చేతివృత్తుల వాళ్ళు, వ్యాపారస్థులు, అనేకమంది వస్తారు. ఇక అయిదవ తరగతిలో ఏటా, హిసిన్ అనే తరహావాళ్ళు వున్నారు. వీళ్ళు ఒకరకంగా అక్కడ పంచములు అని చెప్పవచ్చు. సంఘానికి బయటివాళ్ళు. సమాజం యిలా విభిన్న శ్రేణులుగా విభజితమై వుండడం చరిత్రలో కనిపిస్తూనే వుంది. అందులో పెద్ద వింత, విశేషం ఏమీలేవు. ఏ తరగతివాళ్ళు ఆయా విధుల్ని నిర్వహిస్తూ వుండేవాళ్ళు. యిది ఆర్థికంగా సౌకర్యమైన పద్ధతి. ఉదాహరణకి సయామ్‌లో సయామీయులు, చైనావాళ్ళు, యూరప్‌వాసులు తమ తమ ప్రత్యేక ఆర్థిక కార్యాలాపాల్ని నిర్వహించుకుంటూ వుంటారు. నివాసాలు కూడా ప్రత్యేకంగా వుండేవి. సమాజంలో బహుజాతులకు చెందినవాళ్ళున్నప్పుడు యిలాంటి విభజన కనిపించడం సహజం.

దక్షిణ ఆఫ్రికాలో, అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో తెల్లవారు, నల్లవారు వేర్పాటుగా విభిన్న వృత్తులు అవలంబించడం కనిపిస్తూనే వుంది. కెన డాలోని ఫ్రెంచి ప్రాంతాల్లో (రాష్ట్రాల్లో) ఇంగ్లీషువాళ్ళూ, ఫ్రెంచివాళ్ళూ వేర్పాటుగానే ఉంటారు. జాతి, భాష, మతం అనే మూడింటిలోనూ విభేదం కనిపిస్తూనే వుంది. రెండు విభిన్న సమాజాలు అని చెప్పవచ్చు.

అమెరికా సంయుక్త రాష్ట్రాల్లో ప్రపంచంలో వున్న జాతులన్నీ వున్నాయి. అక్కడ ఒక్కోజాతికి, ఒక్కోవృత్తి ప్రాచుర్యం అయినట్లు కనిపిస్తుంది. చైనావాళ్ళు లాండ్రీ పనులు చేస్తారు. నీగ్రోలు పోర్టర్లుగా వున్నారు. జపాన్‌వాళ్ళు బట్లర్ పనిచేస్తారు. బట్టలు కొనడం, అమ్మడం రష్యన్ యూదుల పని. స్పానిష్ వాళ్ళు వ్యవహారాలు నడిపిస్తారు. ఇక హిందువులు జోస్యాలు, సాముద్రికాలు నిర్భయంగా సాగిస్తారు. బహుళ జాతులు నివసించే దేశాల్లో వృత్తిరీత్యా యిలాంటి సౌలభ్యం రూపొందిందని అనుకోవచ్చు. కాని మతభేదం లేని సందర్భాల్లో కూడా జనం వేర్పాటుగా వుండడం, భిన్నవృత్తులు అవలంబించడం కనిపిస్తుంది. పశ్చిమ కెనడాలో భిన్న జాతుల వాళ్ళున్నారు. ఎవరికి వారు తమ తమ పేటల్లో వుంటారు. అక్కడ యూరప్ ఉత్తరప్రాంతం వాళ్ళకి రైల్వేల్లో ఉద్యోగం దొరకదు. ఆ ఉద్యోగాలు 'డాగో'లకి, 'వాప్'లకి మాత్రమే ప్రత్యేకం కేటాయింపుగా వుంటాయి. (స్పెయిన్, పోర్చుగీస్, ఇటలీవాళ్ళని ఉద్దేశించి నిందార్థకంగా 'డాగో'లని పిలిచేవాళ్ళు. 'వాప్'లన్నా నిందార్థకమే కాని దక్షిణ యూరప్ నుండి, అందులోను ముఖ్యంగా ఇటలీనుంచి వచ్చినవాళ్ళని ఉద్దేశించి అలా అనేవాళ్ళు.) వృత్తిపరంగా యిలాంటి విభజనలు, విభేదాలు బహుళ జాతులు వున్న ప్రాంతాల్లో మాత్రమే కనిపిస్తున్నాయనుకో నక్కరలేదు. ప్రాచీన గ్రీకు, రోమన్ నేపథ్యాల నుంచీ చూపించవచ్చు. పశ్చిమరోమన్ సామ్రాజ్యంలో క్రీ.శ. 5వ శతాబ్దం తొలిభాగంలో థియొడోసియస్ శాసనం వుండేది. రెండవ థియొడోసియస్ క్రీ.శ. 450లో దీన్ని ప్రకటించాడు. తాతతండ్రుల వృత్తుల్నే వారి సంతానమూ అనుసరించాలని ఆ శాసనం చెబుతోంది.

సాంఘిక అంతస్తులకి సంబంధించి, వృత్తి విభజనకి సంబంధించి యిప్పటిదాకా ప్రస్తావించుకున్న అంశాలు భారతదేశంలో ఉన్న కుల వ్యవస్థతో సారూప్యంతో వున్నాయి. కాని చారిత్రక పరిస్థితుల ననుసరించి ఆయా దేశాల్లో సాంఘిక అంతస్తుల హోదాలు, వృత్తిపర విభజనలూ సమసిపోతున్నాయి. చాలా సందర్భాల్లో సమసిపోయాయి. కాని ఆ సారూప్యతలు వున్న కుల వ్యవస్థ మాత్రం బిగుసుకుని యింకా మనుగడ సాగిస్తూనే ఉంది.

ఇవాళ 'హిందూమతం' భారతదేశంలో అత్యధిక జనాభా మతంగా వుంది. దీనికి ఒక ప్రవక్త లేదు, ఒక చర్చి లేదు. అన్య మతస్థులు

యీా మతంలోకి మారడానికి వీలులేదు. యీా మత విశ్వాసాలని వాళ్ళు స్వీకరించ వచ్చు గాని యీా మతంలో సభ్యులు కావడానికి అవకాశం లేదు. బౌద్ధ, జైన, క్రైస్తవ, ఇస్లాం, సిఖ్ మతాల్లోకి మారి, వాటిలో పరిపూర్ణ సభ్యులుగా వుండవచ్చు. కాని యీా అవకాశం 'హిందూమతా'నికి లేదు. ఏమంటే, యీా మతంలోకి రావాలంటే ఏదో ఒక కులంలో జన్మ రీత్యా రావాల్సిందే. (మనం ఇప్పుడు కుల వ్యవస్థ గురించే పరిశీలించబోతున్నాం). హిందూ మతానికి సంబంధించి మత భ్రష్టత్వం లేదు, కుల భ్రష్టత్వం ఉంది. ('కులేచ్యుత భయం' అన్నాడు భర్తృహరి, యేయే భయాలు ఎలా వుంటాయో చాటుతూ!) ఎవరైనా క్రైస్తవ మతం నుంచి ఇస్లాం మతంలోకి మారితే ఆ మనిషిని మత భ్రష్టుడు అంటారు. అంటే వ్యవస్థ అభిప్రాయాల్ని వదిలిపెట్టి అన్యమత అభిప్రాయాన్ని స్వీకరించడం. అది తప్పు. హిందూ మతంలో 'స్వధర్మ విస్మరణం' తప్పు. తప్పేకాదు - పాపం! అంటే కుల విహితమైన ధర్మం అనే అర్థం.

## కులం లేదా కుల వ్యవస్థ యెలా పుట్టింది? కారణాలు యేమిటి? దీని స్వభావం యేమిటి?

కులం ఎలా పుట్టింది అన్న ప్రశ్నకు అర్థం లేదు. కుల వ్యవస్థ అనేది రూపొందింది. సమాజంలో నాలుగు తరగతులు (వర్ణాలు) అన్న సిద్ధాంతానికి మూలం వుంది. సమాజంలో వున్న అనేక అంతస్తుల పుట్టుకకి కారణం వుంది. పురోహిత వర్గం పుట్టుకకి, ఆ వర్గం గిరిగీసుకుని వేర్పాటుగా వుండడానికి కారణాలు చూపించవచ్చు. పవిత్రత, అపవిత్రత అనే భావాలకి హేతువు చూపించవచ్చు. ఏ తెగవాళ్ళు ఆ తెగవాళ్ళనే పెళ్ళాడ్డం అనే నియమానికి కారణం చూపించవచ్చు. కాని కులం, కులవ్యవస్థ అనే వాటి పుట్టుపూర్వోత్తరాల వివరం యిదమిద్ధంగా తేల్చి చెప్పడం కష్టం. అంచేత కులం 'పుట్టుక' అనేకన్నా కులం ఆవిర్భావ తీరుతెన్నులు యేమిటో పరిశీలించడం మంచిది అని కుల వ్యవస్థ పుట్టుక గురించి ఎస్. వి. కేట్కార్ 'హిస్టరీ అఫ్ కేస్ట్ ఇన్ ఇండియా' అనే గ్రంథంలో చర్చించాడు. కుల వ్యవస్థ అనేక సంక్లిష్ట విషయాల సమాహారం. ఆ విషయాలకి కారణాలు, వాటి చరిత్ర పరిశీలించి వివరించుకోవచ్చునని ఆయన అభిప్రాయపడ్డారు.

"భారతదేశంలో అనేక ఆదిమ తెగలు వుండేవి. తెగలో వాళ్ళనే వివాహం చేసుకునే నియమం వుండేది. ఆ తెగల్లో యేదన్నా బ్రాహ్మణులని

పురోహితులుగా అంగీకరిస్తూ హిందూ దేవతలను ఆరాధిస్తూ హిందూ సమాజాన్ని అనుసరించినప్పుడు అది ఒక కులంగా రూపొందింది. అయితే తెగ యిలా పరిణామ దశలో వున్నప్పుడు అంతర్వర్ణ వివాహ నియమం చాలా మట్టుకు పట్టువిడుపులతో వుండేది" అని కేట్కార్ వివరించారు.

విశ్వాసాల పరిధిలో కులం రూపొందడానికి యిలాంటి కారణాలు వుంటే ఆర్థిక పరిధిలో వేరే రకమైన హేతువులు వున్నాయి. ఆహార ఉత్పత్తికి సమాజం పరిణామం చెందేటప్పుడు ఆహార సేకరణ చేసుకునే వాళ్ళకీ, ఉత్పత్తి చేసే వాళ్ళకీ మధ్య సంబంధాలు ఏర్పడతాయి. ఆ సంబంధాలు పోరాటం వల్ల ఏర్పడవచ్చు. వినిమయం వల్ల ఏర్పడవచ్చు. వేట వల్ల ఒక్క మనిషికి సరిపడా ఆహారం కూడా దొరక్కపోవచ్చు. కాని అదే పరిమిత ప్రాంతంలో వ్యవసాయం వల్ల అనేక మందికి కావాల్సిన ఆహారం ఉత్పత్తి చెయ్యవచ్చు. అలా ఆహారోత్పత్తి జరగడానికి భూమి, సాగునీరు లాంటివి కావాలి. వేటకి అడవులు వుండాలి. వ్యవసాయానికి చదును నేల అవసరం. అంటే అడవుల్ని కొట్టెయ్యాలి. ఆ రకంగా వ్యవసాయం విస్తరించుకుంటూ పెరిగింది. సింధునదీ ప్రాంతం నుంచి తూర్పుదిశగా గంగాతీర మైదానం దాకా వ్యవసాయం విస్తరించుకునేటప్పుడు ఆహారోత్పత్తికి అనువైన నూతన పద్ధతులు అవసరం అయ్యాయి. అందుకు అనువైన నూతన సాంఘిక వ్యవస్థ నిర్మాణం అవసరం అయింది. అదే కులం. అనాటి 'ఆదిమ పరిస్థితుల్లో కుల వ్యవస్థ తొలి దశలేకుండా వ్యవసాయ విస్తరణ జరగడానికి వీలు కలుగదు' అని కోశాంబి అభిప్రాయపడ్డాడు. అలాంటి వ్యవస్థ బానిసత్వం లేకుండా శ్రమ ఫలితాల్ని స్వాయత్తం చేసుకుందుకు అనువుగా వుండింది. వ్యవసాయం, లోహాల గురించిన పరిజ్ఞానం పెరిగింది. కొత్త అవాసాలు అవసరమయ్యాయి. పాత పద్ధతుల వల్ల ఆ అవసరాలు తీరవు. అంచేత కుల వ్యవస్థ మరింత విస్తరించింది. కొత్త విధులు నిర్వర్తించవలసి వచ్చింది. ఆది తెగల వాళ్ళ ఆచారాలని మన్నిస్తూ వాళ్ళ గణ నాయకుల్ని రాజులుగా ముఖ్యులుగా కీర్తిస్తూ బ్రాహ్మణ వర్గం పురాణాలకి శ్రీకారం చుట్టింది. 'ఇది ఓ రకంగా కొత్త వర్గాలు ఏర్పడ్డమే. అంతకు ముందటి కుల వ్యవస్థ బీజాలు తెగలోనివే. సామాజిక ఉత్పత్తి విధానంలో అనుకూలించిన విభజన యిది. అందుకనే కులం అనేది ఆదిమ ఉత్పత్తి స్థాయిలో వర్గం' అన్నాడు కోశాంబి.

యిదే తరహా ఆదిమ తెగలు, సమాజాలు ప్రపంచమంతటా ఆయా

చారిత్రక దశల్లో వున్నాయి. కాని కుల వ్యవస్థలాంటి లక్షణాలని సంతరించుకున్న వ్యవస్థ యేదీ అక్కడ లేదు. ఉత్పత్తి విధానాలు మారేటప్పుడు ఆయా చారిత్రక దశల్లో ఆర్థిక పరమైన వర్గాలు యేర్పడ్డాయి. ప్రభువులు, భూస్వాములు, బానిసలు, బూర్జువాలు, శ్రామికులు అని విభజించుకునే వర్గాలు అవి. కాని భారతదేశంలో మాత్రం ఆదిమ ఉత్పత్తి స్థాయిలో వర్గం అయిన కులం యీనాటికీ సాంఘికంగా యేర్పడ్డ వర్గాలతోపాటు మనుగడ సాగిస్తూనే వుంది. కుల వ్యవస్థకి ఆలంబన అయిన ముఖ్య నియమాలని అనుసరిస్తూనే వుంది. ఆ నియమాలు యేమిటి అంటే అంతర్వర్ణ వివాహాల నిషేధం, అంతర్వర్ణ భోజన భాజనాల నియంత్రణ. కులం అనేది జన్మతః సంక్రమించవలసిందే గాని యిష్టావత్తిగా స్వీకరించేది కాదు, మార్చుకునేది కాదు. వివాహాలు, యితర సాంఘిక కార్యకలాపాలు ఆ పరిమితుల మేరకే వుండాలి తప్ప అతిక్రమించడానికి వీలు లేదు. మడి, మైల, ఆచారం, పవిత్రత, అంటు పడిపోవడం లాంటి నియమాలన్నీ దీని చుట్టూ అల్లుకున్న సాలెగూళ్ళు, మడి, మైల, అంటు సొంటు లాంటి భావనలు ఎంత కఠినంగా అమల్లో వుంటే అంతలా దేశంలో కుల వ్యవస్థ కఠినంగా అమలు జరిగింది. ఇదంతా ఆ విశ్వాసాల పరిధిలో వున్నవాళ్ళు అనుసరించవలసిన 'ధర్మం'గా విహితమైంది. ఆ 'ధర్మాన్ని' ప్రతిపాదించే వ్యక్తి రాజు కాదు, పురోహితుడు. మరి ఆ పురోహితుడే యీ అంతస్తుల వ్యవస్థలో అగ్రభాగాన ఉంటాడు. ఏది శుచి, ఏది అశుచి, ఏది మడి, ఏది మైల అనే భావనలు హిందూ ధర్మానికి ఆయువుపట్టు. వీటి తరతమ భేదాలనిబట్టి హెచ్చుతగ్గులు వుంటాయి. సాంఘిక అంతస్తుల క్రమంలో స్థానాలు, స్థాయీభేదాలు నిర్దేశితమయాయి. దీన్నిబట్టే హోదా నిర్ణయ మవుతుంది. భారతదేశంలో ఇలా సాంఘిక హోదా సంపాదించడం కోసం అనేక అంతర్గత పోరాటాలు జరిగాయి. ఏ కులం ఎక్కువ, ఏ కులం తక్కువ అనే పోటా పోటీలు వుండేవి. అంతస్తుల చట్రంలో బ్రాహ్మణ వర్గం ఉన్నత స్థానంలో ఉండడం వల్ల మడి, మైలల విభేదాలు చాలా పదునుగా పాటించాల్సిన వర్గం అయింది. అంతస్తుల చట్రం బిగిసిపోయే దశకి చేరేటప్పటికి పైవర్గాల వాళ్ళు కింది కులాల వాళ్ళని పెళ్ళి చేసుకునే వెసులుబాటు వుండేది కాని కింది కులాల వాళ్ళు పైకులాల వాళ్ళని పెళ్ళాడ్డం అపచారం అయిపోయింది. శుచి, అశుచి అనే భావనలు కూడా బాహ్యమైనవి, దైహికమైనవి కాకుండా ఏదో అంతర్గతమైనవిగా మార్మికమైనవిగా భావించారు. స్పర్శ వల్ల

మైలపడిపోవచ్చు. వీక్షణం వల్ల కూడా పై అంతస్థుల వాళ్ళ శుచిత్వం మైలపడిపోవచ్చు. (బ్రాహ్మణులు భోజనం చేసేటప్పుడు పరిషేచనం చేస్తారు. యిది దృష్టి దోష నివారణకోసమట. అలా అని ఆపస్తంబ సూత్రాల్లో వుంది.)

ఇక తిండి తీర్థాల విషయంలో నియమాలు అసంఖ్యాకం. ఇవన్నీ యీ కులవ్యవస్థ అంతస్తుల్నిబట్టి ఫలనా కులానికి యిది తప్పు, ఫలానా కులానికి ఇది తప్పు, కాదు అంటూ శాసితం అయ్యాయి. కులధర్మాన్ని అతిక్రమించినా, కట్టుబాట్లని ఉల్లంఘించినా వెలివేయడం అనే దండన పడుతుంది. అంటే వివాహానికి, భోజనాదికాలకి తెగతెంపులు అయినట్లే.

ప్రపంచంలో ఏ దేశంలోను లేని యీ వ్యవస్థ భారతదేశంలోనే వుంది. యీ వ్యవస్థలో మౌలికం అయింది అంతర్విభజన. యీ విభజన బిగిసిపోయింది. హెచ్చుతగ్గుల అంతస్తుల వల్ల వేర్పాటుతనం హిందూ సమాజానికి మూలసూత్రం అయింది.

ప్రపంచంలో ఏ దేశంలోను యిలాంటి వ్యవస్థ లేదని పైన అనుకున్నాం. ఇంగ్లీషులో కాస్ట్ (Caste) అనే పదాన్ని దీనిని నిర్దేశించడానికి వాడడం ఎలా నప్పుతుంది? ఇంగ్లీషువాళ్ళకేకాదు, మరే యితర యూరపియన్ సమాజంలోనూ యిలాంటి వ్యవస్థలేదు. అయినా ఇవాళ ప్రపంచవ్యాప్తంగా భారతదేశంలో కులవ్యవస్థని మాత్రమే నిర్దేశిస్తూ యీ పదం ప్రాచుర్యం పొందింది. యీ పదం స్పానిష్, పోర్చుగీస్ భాషలది. లాటిన్ పదం Castus నుంచి ఇది వచ్చింది. అంటే పరిశుద్ధమైన అని అర్థం. దీన్ని మొదట స్పానిష్ వాళ్ళు వాడారు. కాని భారతదేశంలో వున్న వ్యవస్థని సూచించేటట్టు పోర్చుగీసువారు దీన్ని 15వ శతాబ్ది మధ్యలో ఉపయోగించారు. వాళ్ళు భారతదేశానికి వచ్చినప్పుడు హిందూ సమాజం అనేక హెచ్చుతగ్గుల తరగతులుగా విభజితమై వుండడం కనిపించింది. Caste అనే పదాన్ని జాతి, వంగడం అనే అర్థంలో వాడడం 1550 నాటికే వుంది. యూరపియన్‌లకి ఇండియన్లకి (అమెరికన్) కలిగిన సంతతికి, నీగ్రోలకి – స్పానిష్ పదం "కాస్టా"ని వాడేవారు. భారతదేశంలో వున్న వ్యవస్థని నిర్దేశించే అర్థంలో పదిహేడవ శతాబ్దం దాకా దీన్ని ఉపయోగించలేదు. భారతదేశంలో వున్న సామాజిక విభజన Castus అని పిలిచేవాళ్ళు. అంటే తెగలు, గణాలు అని అర్థం. ఆ పదం నిలిచిపోయింది. అయితే భారతదేశంలో కులాన్ని ఏ అర్థంలో వాడుతున్నారో స్పష్టంగా

తెలుసుకోకపోవడం వల్ల యూరప్‌లో అనూచానంగా వస్తున్న వర్గాలని ఉద్దేశించే సామాన్యార్థంలో వేర్పాటుగా వుండడాన్ని సూచించేటట్టు వాడేరు. వాళ్ళ వర్గాలు అయా వంశరక్తాలు పరిశుద్ధంగా, సంకరం కాకుండా వుండేటట్టు విభజితమై వున్నవి. భారతదేశంలో వున్న వ్యవస్థ అలాంటిదేనని వాళ్ళు భావించి ఆ పదాన్నే యీ వ్యవస్థలో వున్న అంతరాలకి వాడేరు. డార్విన్ కూడా సాంఘిక జీవరాశిలో వున్న భిన్న వర్గాలకి యీ పదం వాడేడు. కాని కులం ఆ అర్థంలో, ఆ ప్రాముఖ్యంలో, ఆ అంతరాలలో కొలవగలిగేది కాదు కదా! కాని, యివాళ యావత్ప్రపంచంలోనూ యీ పదం భారతదేశ అనువర్తనతో మిగిలిన అర్థాలన్నిటినీ తోసేసి యిక్కడి అర్థంలోనే స్థిరపడింది. ఇవాళ భారతదేశంలోని కులం అనే అర్థంలోనే Caste పదం స్థిరపడింది. అంచేత యీ పదం వ్యుత్పత్తి అర్థం మాత్రమే కులం అంటే ఏమిటో బోధపరుచుకుందుకు తోడ్పడదు. యిదే పదాన్ని 'వర్ణ' 'జాతి' అనే వాటి తేడా లేకుండా వుపయోగించడం యీ కారణం వల్లనే జరుగుతోంది. 'వర్ణ' అంటే 'రంగు.' అయితే దీన్ని వర్గానికి సాంఘిక అంతస్తుల తరగతికి వాడుతున్నారు. 'జాతి' దీనికి భిన్నం. అంతర్వర్గ వివాహాది, భోజన భాజనాది నియమాలతో ఆనువంశికంగా సంక్రమిస్తుంది. యీ తీరు భారతదేశానికి మాత్రమే సీమితమై వుంది. మనుధర్మశాస్త్ర వ్యాఖ్యాతలు (కుల్లూకభట్టు పారం మేధాతిథి వ్యాఖ్య) వర్ణాలు నాలుగేనని ప్రస్తావించేరు. జాతులు యాభై వున్నట్లు చెప్పారు. జాతి అనే పదం చాలా విస్తృతమైంది. పుట్టుక వల్ల సంక్రమించిన మనుగడ అనచ్చు. భారతదేశంలో కనిపించే సాంఘిక అంతస్తుల విభజనకి యీ రెండు పదాలనీ అంతరం లేకుండా వాడుతూ వున్నా 'వర్ణ' విభజనకీ, కులవ్యవస్థకీ తేడా వుందని సామాజిక శాస్త్రవేత్తలు అభిప్రాయపడుతున్నారు. వర్ణవిభజన ఒక సాంఘిక నిర్మాణానికి పునాది. సాంఘికంగా ఉపయోగపడే పని విభజనని యిది లక్షిస్తుంది. మహాత్మాగాంధీ భారతదేశంలో కులవ్యవస్థనీ అంటరానితనాన్నీ తీవ్రంగా ఖండించినా, వర్ణవ్యవస్థ సాంఘిక కార్యకలాపాలకి దోహదం చేస్తుందని అభిప్రాయపడ్డాడు. సైన్యంలో విభజన మాదిరీ యిది సాంఘిక విభజన అని అన్నాడు. తాను సనాతనవాదిననీ చెప్పుకున్నాడు. వర్ణ విభజనకి సారూప్య రూపాలు యితర దేశాల్లో చరిత్రలో కనిపిస్తున్నాయి గాని కులవ్యవస్థలాంటి బిగిసిపోయిన చట్రం లేదని సాంఘిక శాస్త్రవేత్తలు అంటున్నారు. ఆ సారూప్య రూపాలు ఏ ఏ దేశాల్లో ఎలా వున్నదీ యింతకుముందే

ప్రస్తావించుకున్నాం. వర్ణవ్యవస్థ సంఘ నిర్మాణంలో ఒక మార్గదర్శక ఆదర్శంగా వుంటే కులవ్యవస్థ దాన్ని చట్రంలో బిగించేసి సంస్థాపనం చేసి దిగజార్చిందని వ్యాఖ్యాతలు వివరిస్తూ వుంటారు. వర్ణవ్యవస్థ ఒక భావనాత్మక ఆదర్శం అయితే కులవ్యవస్థ ఆచరణలో వికృతరూపంలో దర్శనమిచ్చే యదార్థం అన్నారు.

ఇది ఎలా జరిగింది? వర్ణవ్యవస్థ లాంటి విభజన అనేక దేశాల్లో కనిపించినా యీనాడు ఎక్కడా ఉనికిలో లేదు. అదృశ్యం అయింది. సాంఘికంగా వర్గాలు ఏర్పడ్డాయి. అయితే భారతదేశంలో యీ వర్ణ, కులవ్యవస్థ ఎలా ఏర్పడింది? యీ వ్యవస్థే హిందూమతానికి ఆలంబన అయింది కదా, అలాంటి హిందూమత విశ్వాసాలకి ఆధారం ఏమిటి?

హిందూమతానికి శిరోధార్యమైంది వేదప్రామాణ్యం. వేదాల్లో ఏం వుంది, హిందూమతంలో భాగమైనవన్నీ వేదాల్లో వున్నాయా అని అడగడం అవసరం. ఏమంటే – హిందూమతం స్థిరపడేనాటికే యీ జీవిత దృక్పథంలో ఎన్నో యితర విశ్వాసాలు చేరి కలిసిపోయాయి. హిందూ విశ్వాసాలలో "వ్యాప్తికి వచ్చినది పూర్వ మీమాంస అనగా వైదిక క్రియా నిరతి... పూర్వ మీమాంసకులకు గావలసినవి రెండు – యజ్ఞములు, బ్రాహ్మణపూజ. వేదములకు మించిన 'సత్తా' వుండకూడదని కాబోలు వారు దేవుడు కూడా లేడు, వేదములు శాశ్వతములు, వేదములే సర్వమని సిద్ధాంతీకరించిరి. మరియు నొక విశేషము. ఈ గ్రంథములలో పదే పదే 'వేదములనిట్లు చెప్పియున్నది, అట్లు చెప్పియున్నది' యని తమ యాదేశముల కన్నింటికి వేదము లాధారములని వ్రాయబడి యున్నది. నిజము పరికించి చూచిన నూటికి ఐదింటికైనా వేదమున యే ఆధారము నుండదు. ఈ వేద ఘోష ముక్కాలు మువ్వీసము నిరాధారమును అసాక్షికమును. ఇట్లు వేదముల నిచ్చవచ్చిన చోటుల నెల్ల సాక్ష్యమునకు బిలుచుట యప్పటివారి కపాయములేని యుపాయము. జనులకు వేదములను జూపరు, చెప్పరు. 'అసలు' తమ యధీనము. వారు కల్పించిన 'నకళ్ళు' నమ్మవలసిన వారు జనులు" అని కట్టమంచి రామలింగారెడ్డిగారు రాశారు. వేదాల్లో ఏం వుంది? ఇవాళ హిందూమతంలో భాగంగా వున్నవన్నీ వేదాల్లో వున్నాయా? వేదాల్లో ఇంద్ర, వరుణ, మిత్ర దేవతలు వున్నారు. యీ దేవతల నెవళ్ళనీ యివాళ ఆరాధించడంలేదు. వైదిక దేవతలు విగ్రహాలు లేని భావనలు. 'Aniconic' అంటే మానవాకృతిలో గాని, జంతువుల ఆకారంలో గాని మలచనివి. వీళ్ళల్లో ఒక్కళ్ళకి కూడా గుడిగోపురాలు

లేవు. అసలు వేదాల్లోనే గుడిగోపురాల ప్రసక్తిలేదు. శివ, దుర్గ, గణేశ, కాళి, కుమారస్వామి (మురుగ) లాంటి దేవతలకి పూజాపునస్కారాలు అందుతున్నాయి. కాని యీ దేవతాగణం వేదాల్లో కనిపించదు. వేదాల్లో యజ్ఞం, హోమం లాంటివి వున్నాయి కాని జల పత్ర పుష్పాలతో పూజ చేసే విధానం లేదు. పూజ హిందూ మత విధుల్లో ప్రముఖ స్థానంలో వుంది. వేదంలో లేనివి ఎలా వచ్చి చేరాయి? యివన్నీ ఆర్యులకి చెందని అనార్యమైనవి. ఆర్యులు, ఆర్యేతరులు కలసి ఒకళ్ళ విశ్వాసాలు ఒకళ్ళు అందిపుచ్చుకున్నారు అలా ఏర్పడ్డ జీవిత దృక్పధానికి హిందూమతం అన్న పేరు వచ్చింది.

భారతదేశ సంస్కృతి అనేక అంశాల సమ్మేళనంగా ఏర్పడింది. ఏమాత్రం పొంతన లేనట్లు కనిపించే అంశాలు భారత సంస్కృతిలో చక్కగా, ఒక పథకం ప్రకారం జరిగిందా అన్నట్లు కలిసిపోయాయి. ఆ రోజుల్లో జాతుల పట్ల శాస్త్రీయ దృక్పధం వుండడానికి అవకాశం లేదు. ఆమాటకొస్తే యీ నాటికీ జాతుల పట్ల శాస్త్రీయ దృక్పధం వుండడానికి అవకాశం లేదు. అంతేకాదు - యీ నాటికీ జాతుల మధ్య వైషమ్యరహిత దృష్టి ఏర్పడలేదు. అలాంటప్పుడు ప్రాచీన భారతదేశంలో రంగు వివక్షని, ఆర్యవర్ణం అనీ దాసవర్ణమనీ వున్నవాటిని వున్నట్లు గ్రహించారంతే. వైదిక కర్మకాండ అయిన యజ్ఞం, అనార్య విగ్రహారాధన, యోగ, పూజా విధానం మిళితమయ్యాయి. ఆర్యగోత్ర ప్రవక్తలు, ద్రవిడ "గిల్డ్‌లు" (కూటాలు) కలిసి వర్ణ, కులవ్యవస్థగా రూపొందాయి. యీనాటికీ సాంప్రదాయక వివాహ వ్యవస్థలో ఆర్య, అనార్య అంశాలు ఎన్నో మిళితమై ఒక రూపంతో భాసిస్తున్నాయి. ఇక దేశంలో ఎన్ని జాతులు ఏకమై భారతజాతిగా ఏర్పడ్డాయో చెప్పనే అక్కరలేదు. అసలు భిన్నభిన్న జాతులకి చెందిన వాళ్ళమన్న భావమే అదృశ్యమైందని సునీతీకుమార్ ఛటర్జీ అన్నారు. యీ సమ్మేళనం జరగడం, ఒక ఐక్యబంధం ఏర్పడ్డం భారతదేశ చరిత్రలో కనిపించే విశేషం. ఆదిమ తెగల దేవతలు, పద్ధతులు, ఆర్యపద్ధతులు కలిసి నూతన సిద్ధాంత పునాది ఏర్పడింది. యీ సమ్మేళన - హింస, బలవంతం లేకుండానే సాగిందని చెప్పచ్చు. ఆర్య సంస్కృతిలో కనిపించే విష్ణు, శివ, రామ, కృష్ణ మొదలైన దేవుళ్ళు, ఆదిమ దేవతలు కలసి కొత్త ఆరాధనలు రూపొందాయి. ఆర్యదేవతలకి, స్థానికంగా వున్న దేవతలకి పొత్తు కుదిరింది. పాతదేవతల్ని తుడిచిపెట్టేయకుండా ఆమోదించి, ఆర్యమతంలో పీట వేశారు. దక్షప్రజాపతి శివుణ్ణి యజ్ఞానికి పిలవకపోవడం

ఆర్య, అనార్య విభేదమే. కాని తర్వాత వైదిక రుద్రునిలో శివుణ్ణి ఏకం చేసి ఒక స్థానం కల్పించారు. "ఆ రకంగా బ్రాహ్మణమతం సాంఘికంగా ఏ బంధమూ లేకుండా వున్న ముక్కలకి ఒక ఏకత కలిగించింది" అని డి. డి. కోశాంబి రాశాడు. కాని అదే 'బ్రాహ్మణమతం' సాంఘిక విభజనలు అలానే కొనసాగేట్లు చేసింది. ఏమిటీ వైరుధ్యం? ఇదెలా జరిగింది? భావనాత్మక పరిధిలో ఐక్యత కనిపిస్తూనే వున్నా యదార్థ సాంఘిక జీవితంలో కరడుగట్టిన వేర్పాటుతనం కులం పేరుతో నిలబడింది. కులధర్మమే ముందు, తర్వాతనే మరే ధర్మనిబద్ధత అయినా. యీ వేర్పాటుతనం కులవ్యవస్థ కుదురులోనే వుంది. దీనికి కారణాలు చరిత్రలో వున్నాయి. హిందూ ధార్మిక దృష్టిలో రూపొందే క్రమంలో వున్నాయి. వేదాలు పునాదిగా ఏర్పడ్డ ఆర్య సంస్కృతి కేంద్రస్థానంలో వుండి నడిపించింది.

ఆర్యులు భారతదేశానికి వచ్చారు, వాళ్ళతోనే యీ దేశ నాగరికత మొదలైందని నమ్మేవాళ్ళు చాలామంది వున్నారు. (అసలు ఎక్కడి నుంచో రావడం ఏమిటి, ఇక్కడ నుంచే ఆ వైదిక విజ్ఞాన వ్యాప్తి జరిగిందని హిందూత్వవాదులు అంటారు. అయితే మనం చరిత్రని నమ్ముకుని ముందుకు వెడదాం. మన నమ్మకాలతో చరిత్రని సృష్టించవద్దు.) అయితే హరప్పా, మొహెంజదారో నాగరికత అవశేషాలు బయటపడడంతో చరిత్రని దర్శించే పద్ధతిలో మౌలికమైన మార్పు వచ్చింది. ఆర్యుల రాకకి ముందే భారతదేశంలో ఒక మహోన్నత నాగరికత పరిఢవిల్లింది. అది శిథిలమైంది. తర్వాత ఆర్యులు వచ్చారు. వాళ్ళ రాకతో యీ దేశ సంస్కృతీ స్వరూపాలు మారిపోయాయి. హరప్పా, మొహెంజదారో నాగరికత పరిశీలనకి పురాతత్వశాస్త్రం ఆధారం అయింది. ఆర్యుల నుంచీ చరిత్ర గ్రంథస్థ ఆధారాలు లభ్యమవుతున్నాయి. అవే వేదాలు.

హరప్పా, మొహెంజదారో నాగరిక ప్రజలు ఎవరు, వాళ్ళ విషయం ఏమిటి అన్నది ప్రస్తుతం మనకి వద్దు. కాని అక్కడ దొరికిన ఆధారాల్ని బట్టి చాలా గొప్ప నాగరికత పరిఢవిల్లిందని తెలుస్తోంది. ఆ నాగరికత శిథిలావస్థకు చేరుకున్నాక గాని, శిథిలమయ్యాక గాని ఆర్యులు వచ్చి వుంటారని చరిత్రకారులు చెబుతున్నారు. యీ ఆర్యులు ఎవరు? ఎక్కడి నుంచి వచ్చారు? వాళ్ళు రాకముందు యిక్కడి నాగరికత ఎలా వుండేది? వాళ్ళు వచ్చాక ఏం జరిగింది? యీ విషయం చూసే ముందు మొహెంజదారో నాగరికత యెలాంటిదో చూడాలి.

హరప్పా, మొహెంజదారో నాగరికతకీ; మెసపొటోమియా నాగరికతకీ దగ్గరి పోలికలు కనిపిస్తాయి. మొహెంజదారో నాగరికత కంచు యుగం నాటిది. ఆ నాగరికత నిలబడటానికి మత పరమైన అనుశాసకత్వం యెక్కువ దోహదపడి వుంటుంది దమన చర్యలు వుండి వుండవు. యీ అంశం తర్వాత తర్వాత భారత చరిత్రలో పునరావృతమవుతూనే వుంది. ఒడిదుడుకుల్లేవు. ఒక స్తబ్ధత అక్కడ వున్నట్టు కనిపించింది. ఈ స్తబ్ధత తర్వాత చరిత్రలో యెప్పుడూ తొంగిచూస్తూనే వుంది. పై దేశాలలో మాదిరి వర్తకుల లాభాల్ని రాజులు ఆపోశన పట్టేసే తీరు వున్నట్టు లేదు. పన్నులూ భారంగా వుండి వుండకపోవచ్చు. రక్షణ వ్యవస్థ కూడా అంత పటువైందిగా కనిపించదు. వ్యాపారంలో వర్తకుల రాతకోతలు కూడా పెద్దగా వున్నట్టు లేదు. బట్ట మీదనో, భూర్జర పత్రాల మీదనో నమోదు చేసుకునేవారు. స్థానిక ఒప్పందాలు నోటి మాటగానే సాగాయి. బుర్రలో జ్ఞాపకం వుంచుకోవడం సరిపోయేది. యీ అంశం భారత సమాజ చరిత్రలో నిలిచే వుంది. (యివాళ్టికీ యూరప్ దేశవాసులతో పోలిస్తే సగటు భారతీయుడి దగ్గర వుండే గుర్తింపు కార్డులు, యితర పత్రాలూ చాలా స్వల్పం.) అలాగే అక్కడ దొరికిన ఆధారాల్లో మూడు ముఖాలు, కొమ్ములు వున్న దేవుని బొమ్మ ముఖ్యమైంది. పశువులు ఆ దేవునిచుట్టూ వున్నాయి. తర్వాతి కాలంలో 'పశుపతి' శివుని మూర్తికి యిదే భూమిక అయింది. 'లింగ, యోని లాంటివి వుండడం చూస్తే తర్వాతి కాలంలో రాబోయే శైవారాధనల బీజాలు వున్నాయనిపిస్తుంది' అని బి. బి. లాల్ రాశాడు. మాతృదేవతారాధన వుంది. 'ఆర్యులది పైతృకం. చెట్టు చేమలని పూజించడం కనిపిస్తుంది. ఆ నాగరికతలోని మరో ముఖ్య అంశం యెలాంటి మార్పు లేకపోవడం. ఒకరకమైన స్తబ్ధతవుండేదాన్ని పైన చూశాం. మార్పుని ఆహ్వానించడానికి గాని, కొత్తదాన్ని స్వీకరించడానికి యే రకమైన ఆసక్తి వున్నట్టు లేదు. (యీ అంశం యిప్పటికీ బాధిస్తూనే వుంది. ఏ కొత్తది వచ్చినా యివన్నీ "మా వేదాల్లో వున్నాయి" అనే దృష్టితోనే సరిపెట్టుకోవడం కనిపిస్తుంది. ఇంగ్లీషు వాళ్లు వర్తకం కోసం యీ దేశానికి వచ్చినప్పుడు జహంగీర్ చక్రవర్తికి అచ్చువేసిన బైబిల్ యిచ్చారట. అచ్చు యేమిటన్న కుతూహలం కూడా జహంగీర్ కనబరచలేదట. నెహ్రూ గారు రాశారు. యీ నిరాసక్తత వల్ల యూరప్‌లో కలిగినలాంటి సాంఘిక ఉత్పాతాలు కూడా

కలగలేదు అనేది యిక్కడ చెడులో జరిగిన మేలు. పరిణామ సిద్ధాంతం ప్రతిపాదించగానే యూరప్‌లో కలకలం రేగింది. యీ దేశంలో మాత్రం దశావతారాలు పరిణామ వాదానికి సరితూగాయి.) ఇక మొహెంజదారో నాగరికతలో ఆయుధాలు అని చెప్పుకోదగ్గవి లేవు. దాంతో రక్షణ పాటవం లోపించింది. అరకంగా ఆ నాగరికత హరించుకుపోయింది. దానికి ప్రధాన కారణం వాళ్ల వ్యవసాయ వ్యవస్థ తుడిచిపెట్టుకుపోవడమే. కాని ఆ నాగరికత అవశేషాలు తర్వాతి తరాలకు అందేయి. అదీ విశేషం.

ఆ నాగరికత శిధిలం అయ్యేదశలోనో, అయిన దశలోనో ఆర్యులు వచ్చారు. ఆర్య అనేది ఒక జాతిపరమైంది కాదని, యీ పదానికి దారుణమైన జాతిపర అర్థాన్ని కల్పించి నాజీలు భ్రష్టు చేశారని చరిత్రకారులు అంటున్నారు. ఆర్య అనేది ఒక సమష్టి భాషా కుటుంబానికి వర్తించే పదం. సంస్కృతం, గ్రీకు, లాటిన్ భాషలు అసలు ప్రామాణికమైన ఆర్యభాషలు. సంస్కృతం నుంచి భారతదేశ ఉత్తరాది భాషలు చాలా మటుకు నిష్పన్నమయ్యాయి. భారతదేశ సంస్కృతిగా ప్రసిద్ధి చెందిన సంస్కృతికి ఆర్యులు వైదిక నాగరికత మూలాధారంగా వుంది. ఆర్యులు భారతదేశానికి యెప్పుడు వచ్చారు అన్న విషయం ప్రస్తుతం యిక్కడ చర్చించుకోనక్కర్లేదు. వాళ్ల ప్రామాణిక భాష అయిన సంస్కృతం ఇరానియన్ భాషలకి దగ్గరగా వుండేది. దాన్నే ప్రాచీన ఇండో ఆర్యన్ అని వ్యవహరిస్తారు. ఆ భాషల్లో ప్రాచీనమైంది పాత పర్షియన్ భాష. అవెస్తాభాష. వీళ్లంతా ఆర్యులనేచెప్పుకునేవాళ్లు. మొదట్లో సమష్టిగా వున్నప్పటి ఉమ్మడి సంస్కృతి, మతం ప్రాచీన ఇరాన్ గ్రంథాల్లోనూ, ఇండో ఆర్యన్ గ్రంథాల్లోనూ ప్రతిబింబించింది. అగ్నిదేవతారాధన, సోమ ఆరాధన భారత, ఇరాన్‌లలో ఉమ్మడిగా కన్పిస్తుంది. ఇరాన్ మిథ్ర, వైదికదేవుడు మిత్ర ఒక నాణెం బొమ్మలే. మతపరమైన మౌలిక పరిభాష కూడా ఉమ్మడిగానే వుంది. వైదిక హోతార, (పురోహిత), యజ్ఞ, రుత (సంస్కృత వర్ణ క్రమంలో ఋత) లాంటి పద బంధాలు అవెస్త్ భాషలో జోతర్, యస్న, అన (ప్రాచీన పర్షియన్‌లో అర్త) అనే పదబంధాలకి వేలు విడిచిన దగ్గరి చుట్టాలే. దేవ, అసుర లాంటి పదాలు దగ్గరి పోలికలతో కనిపిస్తాయి. మతపరమైన పరిభాషే కాకుండా రాజకీయ వ్యవహారంలోని పద బంధాలూ యీ చుట్టరికం గుర్తు చేస్తూ వుంటాయి. క్షాత్ర, సేన అనే సంస్కృత పదాలు 'గ్జాథ్ర' హామేనా (ప్రాచీన పర్షియన్లో హైనా) లాంటి పదాలని స్ఫురింప చేస్తాయి. ఇక

పౌరాణిక దృష్టాంతాల దగ్గరికి వస్తే వివస్వంత పుత్రుడైన వైదిక 'యమ' ఆ వెస్తన్ వివహ్వాంత్ పుత్రుడైన 'యిమ'ఒక్క పోలికలోనే వుంటారు. ఇలాగే అనేక ఉదాహరణలు యివ్వచ్చు. ఇరానియన్లు తురుష్క టర్కీ దండయాత్రల కాలందాకా తమ పాతకాలపు జ్ఞాపకాల్ని 'అయిరానామ్ వజియొ' ఎరాన్‌వేజ్ అనే పేరుతో పదిలంగానే వుంచుకున్నారు. అదే ఇంద్ర, వరుణ, మిత్ర వగైరా దేవతాగణాన్ని వాళ్ళు ఆరాధిస్తూ వుండేవారు. క్రీ. పూ. ఆరవ శతాబ్దంలో జొరాస్టర్ (జరాత్రూజ, పార్శీ మతం) బోధనలతో తుడిచిపెట్టుపోయింది కాని లేకపోతే అది వుండేదే. అంచేత ప్రసక్తమైన విషయం యేమిటంటే – భారతదేశానికి సంబంధం వున్న అతి సమీప ఆర్యులు పర్షియా నుంచి వచ్చారు అని.

వాళ్ళు తమకి నచ్చిన వాటినన్నిట్నీ కూడా తీసుకు వచ్చారు. ఆర్యులు మౌలికంగా సంచార జాతుల వాళ్ళు, వాళ్ళ పశుగణం వాళ్ళతో కూడా సంచరిస్తూ వచ్చే భుక్తి మార్గం. యుద్ధానికి రథం, అశ్వం దన్నుగా వుండేవి. దాంతో అడ్డువచ్చిన ప్రహరీలని, కట్టలనీ నాశనం చేసి ముందుకు సాగేరు. నదీ పరీవాహక ప్రాంతాల్లో చిన్న చిన్న జాతులు వుండేవి. గిరిగీసి కూర్చున్న ఆ ఆవాసాల్ని ఆర్యులు ధ్వంసం చేసుకుంటూ పోయారు. ఒకసారి విధ్వంసం జరిగాక మళ్ళీ పాత కాలం నాటి పరిస్థితి వుండేది కాదు. ఆ ఆవాసాల్లో అప్పటిదాకా గోప్యంగా వుంచుకున్న పద్ధతులు, వస్తు జ్ఞానం వుంటే అవి సామాన్యంగా అందరికీ అందుబాటులోకి వచ్చేవి. ఆర్యులూ, అంతకు పూర్వం అక్కడ వున్నవాళ్లూ కలిసి కొత్త జాతులు యేర్పడేవి. కొత్త భాషా రూపు తీసుకునేది. యెక్కువ భాగం అది ఆర్య భాషే అయి ఉండేది.

అలాంటి నవ్య ధోరణే భారతదేశంలో రూపు తీసుకుంది. భారత దేశానికి వచ్చిన ఆర్యులు ఇరాన్ నుంచి వచ్చినవాళ్లని చరిత్రకారులు అంగీకరిస్తున్నారు. (అయితే ఒక విషయం మరిచిపోకూడదు. ఒక్కసారే ఆర్యులందరూ గుర్రాలు, రథాలూ గుత్తకు తీసుకుని దూసుకుంటూ వచ్చేరని భావించకూడదు. వాళ్లు సమూహాలుగా వచ్చారు. తరంగాలుగా విరుసుకుంటూ వచ్చేరు. యీ దేశ ప్రాదేశిక స్థితిగతుల నన్నిట్నీ ముంచెత్తి కొత్త భారత భారతీ సముద్రాన్ని సృష్టించేరు.) యీ ఆర్యులతో బాటు వాళ్ల పరికరాలు, నాగరికత, జీవిత దృక్పథం అన్నీ వచ్చేయి. ఎవరో అమెరికన్ పండితుడు చెప్పినట్టు "భారతదేశమతం భారతదేశంలో అడుగుపెట్టకముందే మొదలైంది." "ఋగ్వేదంలో కనిపించే సంస్కృతి

భారతదేశంలో అభివృద్ధి చెందిందే కాదు. మౌలికాంశాల్లో దిగుమతీ అయినటువంటిది. అప్పటికే రూపొందింది, అదీ బయటి నుంచి" అని టి. బరో పండితుడు రాశాడు. (యీ చరిత్ర చూసి "హిందుత్వ" వాదులు యేమంటారో)

ఇండో ఆర్యుల సంబంధీకులైన ఇరాన్ ఆర్యులు భారతదేశానికి వచ్చేరు. వాళ్లు వచ్చేటప్పటికే వాళ్ళలో మూడు తరగతుల విభజన ఉండి ఉండాలి. వైదిక అధర్వణ పురోహితులకీ ఇరాన్‌లోని అధర్వణులకీ పోలికలు బాగా వున్నాయి. పురోహిత వర్గం సాధారణంగా సాంఘిక చట్రంలో పెద్ద పీట ఆక్రమించడం సర్వేసర్వత్రావున్న విషయమే. మరీ ముఖ్యంగా అనాటి సమాజంలో అలా జరగడంలో వింత యేమీ లేదు. పూర్వ మీమాంసకుల పద్ధతిలో భారతదేశంలో క్రతువులకీ, కర్మకాండలకీ ప్రాముఖ్యం యేర్పడిందని చూశాం. వాళ్ల ప్రకారం చెప్పకోవాలంటే బ్రాహ్మణులే దేవతలుగా ఆరాధన పొందాలి.

దైవాధీనం జగత్సర్వం
మంత్రాధీనంతు దైవతం
తన్మంత్రం బ్రాహ్మణాధీనం
బ్రాహ్మణో మమ దేవతా

(యీ విశ్వం యావత్తూ దేవుని వశం. ఆ దేవుడు మంత్ర వశం. ఆ మంత్రాలు బ్రాహ్మణుల వశం. అంచేత బ్రాహ్మణులే మన దేవతలు)

యిది చిత్రమైన వాదం. అసలు తాత్కాలికంగా జగత్తంతా దైవాధీనం అని రుజువు ఆవాలి కదా! దీన్ని అనద్దేతువు అంటారు. అంచేత ప్రశ్ననే అడగకూడదు. ఊరికే దాన్ని శిరోధార్యంగా భావించడమే. సరే యిలాంటి వాదనలన్నీ చాలా తర్వాత తర్వాత పుట్టుకొచ్చేయి. కాని మొదట్లో పురోహిత వర్గం మరీ చట్రంలో బిగిసిపోయి ఆధిపత్యం చెలాయించే స్థానంలో లేదు. క్రమేణ అలా యేర్పడింది. "ఋగ్వేదకాలం నాటికి ఒక కులంగా పురోహిత విధులు ప్రత్యేకత సంతరించుకోలేదు. నిజానికి తొట్టతొలి వేదంలో వున్న కుల విభజన అల్లా వర్ణ సంబంధమైంది. శ్వేత వర్ణ ఆర్యులకీ, నల్లని రంగువాళ్లైన వాళ్ల శత్రువులకీ రంగుభేదమే ఆ విభజన" అని డి. డి. కోశాంబి రాశేడు. వేదంలో ఇంద్రుడు వృత్రాసురుణ్ణి సంహరించిన ఘట్టం వుంది. ఆ సంహారం వల్ల ఇంద్రునికి బ్రహ్మహత్యా పాతకం

చుట్టుకుంటుంది. ఏమంటే, శత్రువైన వృత్రాసురుడు బ్రాహ్మణుడు. అంటే పురోహిత వర్గం అప్పటికే వుందన్నమాట! ఋగ్వేద కాలం నాటికి మాత్రం గణం లోపల కుల వర్ణ విభేదం వున్నట్టు లేదు. పురోహిత కార్యకలాపాలకే కేటాయింపైన బ్రాహ్మణ వర్గం వున్నట్టు లేదు. ఏమైనా గమనించవలసిన ముఖ్య అంశం – కుల వ్యవస్థ పట్టు విడుపులతో వుందనీ బిగిసిపోలేదనీ. ఆధిక్య న్యూనతల భావం వుండివుండచ్చు గాని అది జన్మతః సంక్రమించేది కాకుండా సంపాదించుకునే రీతిలో వుండేది. భారతంలో వీతహవ్యుడు, అరిష్టసేనుడు, సింధువాసి తపస్సు చేసి బ్రాహ్మణత్వం పొందినట్టు వుంది. అలాగే పురుకుత్సుడు, అజామీఢుడు మొదలైనవారు కూడా బ్రాహ్మణత్వం పొందేరనీ వుంది. అంటే బ్రాహ్మణాధిపత్యం స్థిరపడనట్టు, పై వాళ్లు కూడా పొందగలిగే రీతిలో వున్నట్టు తెలుస్తోంది కదా! అలానే నిషిద్ధ కర్మలు చేసిన బ్రాహ్మణులు కొందరు భ్రష్టులైనట్టూ దాఖలాలు వున్నాయి. ఐతరేయ బ్రాహ్మణంలోనే కవషవెలుష్నుడు శూద్రుడు, పాండిత్య ప్రకర్షచేత రుషి అయ్యేడు. గోత్రాదులు యేమీ లేని సత్యకామ జాబాలి యజుర్వేదంలో కొంత భాగానికి కర్త అయ్యేడు.

పాపవర్తనుండు బ్రాహ్మణుండయ్యును
నిజము, శూద్రుకంటె నీచతముడు
సత్యశౌచ ధర్మశాలి శూద్రుండయ్యు
నతడు సద్విజుండ యనిరి మునులు,

అని ఎర్రన అరణ్య పర్వ శేషంలో చెప్పాడు. "సత్కార్మలాచరిస్తే బ్రాహ్మణులు అవ వచ్చనీ, దుష్కార్మం ఆచరించి శూద్రుడు అవుతా"డనీ మనువు కూడా (10 – 65) ఒప్పుకున్నాడట. వీటన్నింటిని బట్టి చూస్తే మార్పులకీ, చేర్పులకీ వీలు కలిగించే అనుకూల వ్యవస్థే మొదట వుండేదని తెలుస్తోంది. వర్ణాంతర వివాహాలు కూడా వున్నట్టు దాఖలాలు వున్నాయి. కాని అవి కాలక్రమేణా తగ్గిపోయాయి. ధర్మ శాస్త్ర ప్రవర్తకులు సూత్రీకరణలు చేసేనాటికి వీటికి ప్రతిబంధకాలు వచ్చాయి.

మొదట్లో పట్టు విడుపులతో వున్న వ్యవస్థ బిగిసింది. వర్ణాశ్రమ వ్యవస్థ స్థిరపడినట్లు పురుష సూక్తం (ఋగ్వేదం 10 వ మండల బ్రాహ్మణశ్య ముఖ మాసీత్, "బాహూ రాజన్యకృతః.....") నాటికే వెల్లడయ్యింది. "గుణ కర్మ విభాగశః" అని శ్రీకృష్ణ పరమాత్ముడే దానికి దైవ పరమైన ఆమోదముద్ర వేశాడు. 'వర్ణ సంకరం' గురించి హెచ్చరించాడు. స్మృతి

కారులు వర్ణ సంకరం వల్ల కొత్త కులాలు పుట్టుకొస్తాయని కట్టుదిట్టాలు చేశారు.

యీ వర్ణ విభజనలో బ్రాహ్మణులని అగ్రవర్ణంగానూ శూద్రులని అడుగు మెట్టు మీద వుంచారు. యీ చాతుర్వర్ణ వ్యవస్థలో సామాజికంగా అనుకూలించే పనివిభజన సూత్రం కనిపించింది. ఆర్యులు భారతదేశం వచ్చేనాటికే వాళ్లలో వున్న విభజన, అప్పటికే దేశంలో వున్న వ్యవస్థతో కలిసి ఏక మూసలో పడి అచ్చు పోసుకుని సామాజికంగా వెల్లడైంది. సమాజం "గిల్డులు" గా లేకపోతే కులాలుగా వ్యవస్థీకృతం అయివుండడం ద్రవిడ వారసత్వం అని సునీతీకుమార్ చటర్జీ రాశారు. కుల వ్యవస్థ మాదిరి "విభజన సూత్రం" బహుశా ఆర్య పూర్వ దశదే కావచ్చునని నీలకంఠ శాస్త్రిగారు అన్నారు. ఇతర దేశాల్లోని నాగరికతలూ ఆర్యులకి రుణపడి వున్నాయి, కాని యితర దేశాల్లో యెక్కడా లేని యీ "దైవ శాసనం" భారతదేశంలో మాత్రమే వుంది. ఆర్య, అనార్య పద్ధతులు చాలా అంశాలకి సంబంధించి మిళితం అయినట్టే యీ సందర్భంలోనూ మిళితం అయ్యేయని చెప్పాలి. ఆర్యులు భారతదేశానికి వచ్చేటప్పటికే ఈ వ్యవస్థ తయారుగా వుండడం చూశారు. రంగు భేదం మీద ఆధారపడి దాన్ని అనుసరించి తమ ప్రయోజనాల కోసం మలచుకుని వుంటారు. యిది చాలా సమంజసంగా వుందని చెప్పవచ్చు. వర్ణవిభేదం మీద ఆధారపడే దీన్ని వ్యవహరించారు. లేదా కులం వేరే కారణాల వల్ల యేర్పడి వుంటుంది. దాన్ని ఆర్యులు వర్ణ విభేదంగా స్వీకరించి వుంటారు. ఆర్యేతర తెగల్ని మ్లేచ్ఛులనీ, నిషాదులనీ, తదితర జాతులనీ పిలిచేవాళ్ళు.

ఇలా అని స్టాన్లీ రీస్ "హిందూ కస్టమ్స్ అండ్ దైర్ ఆరిజిన్స్" అన్న గ్రంథంలో రాశాడు. యిదేరకమైన అభిప్రాయాన్ని ప్రొఫెసర్ జీ. హెచ్. హట్టన్ కూడా వెల్లడించాడు. కుల వ్యవస్థ అతిప్రాచీన సాంఘిక సంబంధాల్ని అనుసరించింది. ఇరుగు పొరుగు వాళ్లతో కేటాయింపై, గిరిగీసుకుని వేర్పాటైన గ్రామంలో అనేక రకాల విధి నిషేధాలతో దూరంగా వుండేది. బ్రిటిష్ వాళ్లు వచ్చాక కూడా మార్పు లేకుండా అలానే కరుడుగట్టి వుండిన తెగల్ని వాళ్లు "నేరపూరిత" తెగలుగా ముద్ర వేశారు. ఏమంటే – ఆ తెగలు తమ తెగ బయటి చట్టాల్ని, అధికారాన్ని మన్నించేవికాదు. ఇది కులవ్యవస్థలో వున్న వేర్పాటుతనానికి బీజం. ఆరకంగా కులాలు ఘనీభవించాయి. ఆర్యుల రాకతో అగ్రభాగంలో

బ్రాహ్మణులతో, అట్టడుగున శూద్రులతో బిగిసిన సాంఘిక వ్యవస్థ ఏర్పడింది. యీ చట్రంలోకి రానివ్వని వాళ్లని పంచములుగా దూరంచేశారు. యీ 'అస్పృశ్యత' హిందూమతంలోనే వుంది. అస్పృశ్యులుగా దూరంచేసి వుంచిన వాళ్లు యూరప్‌లో మాదిరి రాజకీయపరమైన బానిసలూ కారు, సాంఘికంగా బానిసలు కాకుండానూ పోరు. బానిసల మాదిరి వాళ్లని అమ్మడం, కొనడం లేకపోవచ్చు. ఆరకంగా స్వేచ్ఛ వున్నట్టే కాని సాంఘిక ధార్మిక పరిధిలో వాళ్ల పరిస్థితి అంతకంటే మెరుగైందేమీ కాదు. బానిసలు స్వేచ్ఛాయుతులు కావచ్చు. అప్పుడు బానిస చాకిరీ పోవచ్చు, కాని అస్పృశ్యులు "స్వేచ్ఛ" వుందనుకున్న బానిసలు, బానిస చాకిరీ తప్పని "స్వేచ్ఛాయుతులు."

సాంఘికంగా తరతరాలుగా అస్పృశ్యత సంక్రమిస్తూనే వుంటుంది. యే హక్కులు, హోదాలు వుండడానికి వీలు లేదు. అగ్రవర్ణాల జీవితాల్లో అపశ్రుతి పలికే పనులేవీ వారు చెయ్యడానికి లేదు. మహారాష్ట్రలో వాళ్ల దుస్థితి ఎలా ఉండేదో అంబేద్కర్ విపులంగా రాశాడు. దేశంమొత్తంమీద వాళ్ల పరిస్థితి కొంచెం ఇంచుమించులో ఒక్కలాగే వుండేది. సాంఘిక ఉత్పత్తి విధానంలో ఉచిత శ్రమకి యీ ఏర్పాటు అనుకూలించింది. బానిస విధానం మాదిరిగానే భారతదేశంలో యీ వ్యవస్థ సాంఘిక ఉత్పత్తికి శ్రమని అర్పించింది. సమాజంలో ఉత్పత్తి విధానం మారి, శ్రమ స్వేచ్ఛ లభించినపుడు బానిసత్వం తొలగిపోయింది. కాని భారతదేశంలో సాంఘిక అంతస్తుల చట్రంలో బిగిసిన శూద్ర, అస్పృశ్యవర్గాల స్థాయి మారలేదు.

కులవ్యవస్థ లాంటి సాంఘిక విభజనకి రెండు లక్షణాలు విశిష్టంగా వున్నాయి. ఒకటి జన్మతః మాత్రమే కుల సభ్యత్వం సంక్రమించడం. అలా ఆ కులంలో పుట్టిన వాళ్లందరూ అందులో సభ్యులే. అంటే యిష్టాపత్తిగా నమ్మకాలనిబట్టి ప్రవేశించే అవకాశం లేదన్నమాట! ఇస్లాం, క్రైస్తవ, బౌద్ధమతాల్లోకి మారవచ్చు. కాని కులానికి సంబంధించి యిలాంటి మార్పు వీలు లేదు. కులధర్మాన్ని కట్టుబాట్లని అతిక్రమిస్తే కులభ్రష్టత్వం చుట్టుకుంటుంది. అదొక శిక్ష, దానికి దండన వెలి. రెండవది వివాహ భోజనాది నియమాలు. దీన్ని "ఎండోగమి" తన వర్గంవాళ్లనే పెళ్లాడటం, కామన్ సాలింగ్ (తన బృందంతోనో, తనకంటే అధిక బృందంతోనో భోజనం చెయ్యడం. వాళ్లనుంచే ఆహార, పానీయాలు

స్వీకరించడం). వివాహాలు ఆయా కులాల మధ్యనే జరగాలి. భోజనాల విషయంలోనూ అంతే. భారతదేశంలో అంతర్వర్ణ భోజనాలు ఒక పెద్ద సంఘ సంస్కరణగా పేరు పొందడం అందరికీ తెలిసిందే. (వీటి చరిత్ర గురించి యెవళ్లన్నా పరిశోధన చేశారో లేదో మరి!) వృత్తులకి సంబంధించీ నియమాలు కట్టుదిట్టంగానే వున్నాయి. "కులవృత్తికి సాటిలేదు గువ్వల చెన్నా" అంటూ వృత్తి విశేషాన్ని శ్లాఘించడం కనిపిస్తుంది. ఓ రకంగా యీ పద్ధతివల్ల జీవనాధారానికి కట్టుదిట్టమైన యేర్పాటు జరిగిందని చెప్పాలి. యీ ఏర్పాటే కులం యిచ్చే రక్షణ. కులం నిలబడి వుండడానికి బహుశా యిదొక కారణం కావచ్చు. వృత్తుల్నిబట్టి మొట్ట మొదట విభజన జరిగివుంటుందని స్టాన్లీ రైస్ అభిప్రాయపడ్డాడు. యిదే అభిప్రాయం చాలా మంది వెల్లడించారు. మొత్తంమీద పుట్టుక, వివాహ భోజన భాజన నియమాలు, వృత్తులు అన్నీ కలిసి కులాలని ఆ విభజనని, వ్యవస్థగా కట్టుదిట్టం చేశాయి.

ఇప్పుడు మరో ప్రశ్న తలెత్తవచ్చు. కుల వ్యవస్థలాంటి బిగింపు లేక పోయినా మిగతా దేశాల్లో కూడా పెళ్లిళ్లు, వృత్తులు, భోజనాదికాలు వర్గ అంతస్తుల్ని బట్టి జరగడం లేదా? యిదీ అలాంటిదే కదా? వృత్తుల విషయంలో బహుళజాతి దేశాల్లో యెలాంటి పద్ధతులు కనిపిస్తున్నాయో పైన చూశాం. యీ సందేహం సమంజసమైందిగానే కనిపించవచ్చు. యే వర్గం వాళ్లు ఆ వర్గం వాళ్లనే పెళ్లి చేసుకోవడం అనూచానంగా వస్తున్న ఆచారం. అతిక్రమించి పెళ్లిళ్లు చేసుకోకూడదన్న నిషేధం యేమీలేదు. అలా పెళ్లి చేసుకున్నంత మాత్రాన ఆ వివాహం శాస్త్రరీత్యా చట్టరీత్యా రద్దుకాదు. కులంవిషయంలో అలాకాదు. కులపరిమితుల కవతల వివాహం జరిగితే అది అపచారం. పై కులాల వాళ్లని చేసుకోవడం అపవిత్రం. అధర్మం. తర్వాత వాళ్లసంతానానికి సంబంధించి విధించిన కట్టుబాట్లు కోకొల్లలు. "ప్రాయశ్చిత్త ధర్మం" యేర్పాటు చేసిన ధర్మశాస్త్రకారులు యీ విషయాలన్నింటినీ సూత్రబద్ధం చేశారు. వర్గానికీ కులానికీ తేడా వుందని గుర్తించాలి. వర్గం సాంఘిక ఆర్థిక అంతస్తు సంబంధి. కులం సాంఘిక, ఆర్థిక, ధర్మ శాస్త్రపర సంబంధి. వర్గ విభేదం మాసిపోతుంది. కుల విభేదం మాసిపోదు. ఆర్థికంగా స్తోమత సంపాదించినా కులభేదం అలానే వుంటుంది. ఆస్తి హక్కుల విషయంలో సూత్రకారులు పెట్టిన నియమాలనిబట్టిచూస్తే కింది కులాల వాళ్లు అసలు సంపద కూడబెట్టు కోవడానికే అర్హులు కారు. ("సంపద కూడ బెట్టుకుందుకు తగ్గ సామర్థ్యం

వున్నా శూద్రుడు సంపదని కూడబెట్టరాదు. సంపద కూడబెట్టుకున్న శూద్రునివల్ల బ్రాహ్మణునికి బాధ కలుగుతుంది" అని మనువు శాసించాడు. 10 - 129). ఒకవేళ కూడబెట్టుకోగలిగినా కుల విభజన అంతస్తు పెరగదు. కిందికులాల వాళ్లు పై కులాల్లోకి యెదగడం జరగదు. పై వాళ్లు కిందికి పడిపోవచ్చు. వర్గానికి కులానికి వున్న యీ తేడాని ప్రస్తావిస్తూ "శ్రీ చాంబర్లేన్ యివాళ బ్రిటిష్ సామ్రాజ్యంలో విశిష్ట వ్యక్తి. ఒకప్పుడు చెప్పులు తయారు చేయించేవాడు... తరువాత శీలలు తయారీదారు. ఆయన ఇవాళ రాజవంశీకులతో మినహాయింపులులేని సమాన హోదాతో భోజనం చేస్తాడు. భారతదేశంలో చర్మకారుడెవరైనా అలాంటి స్థితిని ఊహించగలడా- తనకిగా తను ఎంతటి ప్రతిభా సంపన్నుడైనప్పటికీ?" అని గోపాలకృష్ణ గోఖలే రాశారు. వర్గ పరిస్థితిలో మార్పులకి అవకాశం వుంది. కులవ్యవస్థలో అలాంటిది లేదు. ఇదొక బిగిసిన చట్రం.

భారతదేశంలో మాత్రమే యిలాంటి సాంఘిక పరిస్థితి వుండడానికి కారణాలు భారతదేశ చారిత్రక, సాంస్కృతిక నేపథ్యంలో వున్నాయి. ఆర్య, అనార్య సంస్కృతులు సమ్మిళితమైనప్పుడు సాంఘికంగా అనేక పరిణామాలు జరిగేయి. అందులో భాగంగానే యీ వర్ణ/కుల వ్యవస్థలు రూపొందాయి. ఆర్యులు భారతదేశానికి వచ్చేనాటికే వాళ్లల్లో విభజన వుంది. అప్పటికే భారతదేశంలో వున్న సాంఘిక కుల వ్యవస్థలాంటి దాన్ని తమలో వున్న విభజనకు సారూప్యం ఉన్నదిగా గమనించేరు. దాన్ని తమకి అనుకూలంగా మలచుకున్నారు. వివాహాలకి, భోజన భాజనాలకి సంబంధించి కుల కట్టుబాట్ల కాఠిన్యం వుంది. సరే, యిలాంటి స్థితి తమకి చెందని బయటి తెగల వాళ్లతో పాటించా రనుకుంటే సబబే. కాని తమలో వున్న విభజనకి ఆ కాఠిన్యాన్ని అనువర్తింప చెయ్యడం యెందుకు? తమలో "ద్విజ" విభజనలో వున్న వాళ్లందరూ అంతర్వివాహాలు, భోజన, భాజనాలు నిషిద్ధం చేసుకోవడం యెందుకు? ఆర్య, అనార్య సంస్కృతుల సమ్మేళనం జరిగినప్పుడు యేర్పడ్డ పరిస్థితి యిది. ఆర్యులలో మొదట్లో వాళ్లలో వాళ్లకి సంబంధించిన కట్టుబాట్లు బిగిసిపోలేదు. పట్టు విడుపులు వుండేవి. కాని ఒక ఏకత సాధించాలంటే, ధర్మశాస్త్ర పరమైన పట్టు విస్తరింప చేయాలంటే తాము బయటి వాళ్ల పట్ల అమలుజరిపే సూత్రాన్నే తమకీ అన్వయింపచేసుకోవాలి. లేకపోతే వారి శాసనం చెల్లదు. అందుకని తమలోనూ ఆ కట్టుబాట్ల బిగింపు అనువర్తింప

చెయ్యాల్సివచ్చింది. మొదట్లో వివాహాలకి సంబంధించి, హోదాల మార్పుకి సంబంధించీ అంత బిగింపు లేదని, సడలింపులు వుండేవని వీతహవ్యుని లాంటి ఉదాహరణలని బట్టి చూశాం. కాని సామాజికంగా మార్పులు వచ్చినప్పుడు హెచ్చుతగ్గుల హోదాలతో వున్న వ్యవస్థ అనుకూలించి బ్రాహ్మణాధిపత్యం చెల్లే కట్టుబాట్లు బిగుసుకున్నాయి. కులవ్యవస్థ చరిత్రలో దాని ప్రాధమిక లక్షణాలని నిలబెట్టుకుని విస్తరించడానికి కారణాలు రెండు వున్నాయని నీలకంఠశాస్త్రి రాసారు. తమ్ము తమ బృందాన్ని పటువుగా నిలబెట్టుకోవడం, విభేదాలని సహిస్తూ సర్దుబాటుతో బతక నేర్పడం. యీ వ్యవస్థ పెరిగేకొద్దీ వివాహం విషయంలో, భోజనాదికాల విషయాలలో నియమాలు మరింతగా పెరిగాయి. గోత్ర ప్రవర కట్టుబాట్లు మరీ బిగిసేయి. క్రీ. పూ. 5 వ శతాబ్దానికి చెందిన బోధాయనుడు సగోత్ర వివాహాల విషయంలో పెద్ద ప్రాయశ్చిత్తాలేమీ విధించ లేదు. కాని పదిహేనువందల యేళ్ల తర్వాత విజ్ఞానేశ్వరుడు సగోత్ర వివాహాల్ని తీవ్రంగా ఖండించాడు. యీ గోత్రాతిరిక్త వివాహాలకి సంబంధించి గ్రీకు, రోమన్, పర్షియన్ ఆచారాల్లో సాదృశ్యం లేదు. ఆర్యేతర తెగల్లో టోటెమ్ సంజ్ఞ ఆచారం యీ ఆర్య గోత్ర ప్రవర ఆచారం మీద ప్రభావం కలిగించి వుండచ్చు. ఇవాళ్టికీ ఆర్య, ద్రవిడ సంస్కృతుల్లో సమ్మేళనం పొందకుండా మిగిలి వున్నది మేనరిక వివాహాలు. ఉత్తరాదిన మేనరికాలు లేవు. ద్రవిడ సంప్రదాయంలో అవి తొలగి పోలేదు. మనువుతో సహా సూత్రకారు లందరూ మేనరికాల్ని నిషేధించారు. కాని దక్షిణాదిన ఆ నిషేధాన్ని రానివ్వలేదు. ఇలాంటి ఒకటి రెండు విషయాల్లో తప్ప మిగిలిన జీవిత విధానంలో ఆ సేతు శీతనగం ఒకటిగానే, ఒకే ధర్మానుసరణతోనే, ఒక జీవిత గమ్యాన్వేషణతోనే గడిపేరు. అసలు ఒక తెగ, ఒక కుటుంబం ఆర్య సంప్రదాయానిదా, ద్రవిడ సంబంధిదా అన్న సమస్యే భారత దేశ ప్రజల్లో తలెత్తలేదనీ, విదేశీ పండితుల పుణ్యమా అని యీ చికిత్స మొదలైందనీ సునీతీ కుమార్ ఛటర్జీ రాశారు.

కుల వ్యవస్థలోని హెచ్చు తగ్గులు సర్వదా సాంఘిక అనుమోదం పొందాయని చెప్పడానికి లేదు. కులం ఒక సాంఘిక ప్రత్యేక అంశంగా వుండచ్చు కాని దీనికి శాశ్వతత్వం లేదు, అంతర్గత సమర్థనా దానికి లేదు అని బుద్ధుడు అభిప్రాయపడ్డాడు. అదే రకంగా సత్ప్రవర్తనకి కర్మ కాండల అవసరమూ లేదు అన్నాడు. అయితే యిన్ని వందల యేళ్ల తర్వాత కులమూ యింకా వుంది, కర్మకాండలూ యింకా వున్నాయి. ఏ

వస్థ అయినా సాంఘికంగా మనుగడలో ఉందీ అంటే దాని చారిత్రక అవసరం పూర్తిగా తీరిపోలేదన్నమాట. అలా అని ఉనికిలో వున్న ప్రతి దానికీ దాని చారిత్రక అవసరం వుందనీ అనడానికి లేదు. ఏమంటే - సాంఘికంగా అమలులో వున్న వాటిలో ప్రతి దానికి అనేక పార్శ్వాలు వుంటాయి. అలా బహుముఖీనమైన దాంట్లో దేనికో ఒక దానికి యింకా ఆలంబన మిగిలే వుందన్నమాట, దాన్ని సామాజికంగా వినియోగ పెట్టుకుంటూనే వున్నారన్న మాట! కుల వ్యవస్థలో యిలాంటి అంశం యేదో యింకా మిగిలి మిణుక్కుమంటూ వుండబట్టి యివాళ యింకా దాని పట్టు తగ్గలేదని అనుకోవాలి. కులవ్యవస్థలో వున్న హెచ్చుతగ్గులు ప్రతిభా విశేష సంపన్నమైనవైతే ప్రతిఘటన తీవ్రత తక్కువ కాని, జన్మతః యివి సంక్రమిస్తూ వున్నట్టూ, అనతిక్రమణీయమైనట్టు నియమబద్ధం చేసి అమలుపరచి చూసినప్పుడు ప్రతిఘటన తీవ్రత తప్పదు. హోదాని అనుభవించే వాళ్లు దాన్ని కాపాడుకో చూస్తారు, లేని వాళ్లు సాధించ చూస్తారు. ఆర్థికపరమైన అంతస్తుల విభేదాల మధ్య వర్గపోరాటం యెలాగూ తప్పదు. భారతదేశంలో వర్గ పోరాటం, వర్ణ, కుల పోరాటం రెండు వున్నాయి. వర్ణ వివక్షని కొనసాగిస్తూ వుంచడానికి ధర్మ సూత్రకారుల అనుశాసకత్వం పట్టు హెచ్చు. ప్రభుత్వ శాసనాల అధికారం ఈ లోకానికే పరిమితం. అయా ప్రభుత్వ అధికార ప్రాంతాలకే సీమితం. కానీ ధర్మ సూత్రకారుల అధిశాసకత్వం పరలోకానికి కూడా పాకుతుంది. ప్రభుత్వ శాసనాల అధికారం వర్తమానంలోనే ఉంటుంది. ధర్మసూత్ర కారుల అధికారం వర్తమాన భవిష్యత్ కాలాలకి వర్తిస్తుంది. శాసనాల అధికారం లౌకికం. ఇలాంటి భావనలతో కుల వ్యవస్థని కట్టి వుంచారు. జన్మతః సంక్రమించే హెచ్చు తగ్గులకి సమర్థన ఏమిటి? ఆర్థికపరమైన హెచ్చు తగ్గులకు సాంఘిక వ్యవస్థ కారణం అనచ్చు. కాని బ్రాహ్మణుడు ఎక్కువ, శూద్రుడు తక్కువ అని ఏ కారణం చూపెట్టి విభజన కొనసాగిస్తారు? దానికి కర్మ కారణం. తాత్విక పరిభాషలో యీ పదానికి యే అర్థం చెప్పినా లౌకిక వ్యవహారంలోకి వచ్చేటప్పటికి 'చేసుకున్న పనుల ఫలితం' అని వివరించారు. దీనికి ప్రత్యక్షంగా కనిపించే వర్తమానంలో వున్న పనులు పూర్తి వివరణ యివ్వలేకపోయాయి. అందుకని పూర్వజన్మ కర్మల్ని కలిపారు యిలా పూర్వ, పరజన్మల క్రమం వుండడానికి "సంసార చక్రం" వీలు కలిగించింది. "సంసార బంధనాత్" అంటూ ఆత్మ కర్మని అనుసరించి జన్మలెత్తుతూ వుంటుంది. యిలాంటి పునర్జన్మ భావన కూడా

యితర మతాల్లో లేదు. హిందూ మత విస్తృత జీవిత పథకంలో యివన్నీ భాగాలు అయ్యేయి. వీటివల్ల కుల వ్యవస్థని పట్టుగా వుంచడానికి బలం చిక్కింది. భావనలో దీన్ని పట్టుగా వుంచాలంటే ధర్మ సూత్రకారుల విధి నిషేధాలని ఆ వ్యవస్థలోనివాళ్లు నెత్తిమీద పెట్టుకుని అనుసరించాలి. కులం హెచ్చుతగ్గుల్ని తక్కువ స్థాయివాళ్లు యెందుకు అంగీకరించారు? లౌకిక ప్రభుత్వ శాసనాల్ని దొంగతనంగానైనా ఉల్లంఘించే సాహసం చేసి వాళ్లు ధర్మ సూత్రకారుల ఆంక్షల్ని కలలో కూడా ఉల్లంఘించే ఊహలు చెయ్యరు. ఎందుకని? పాపం చుట్టుకుంటుంది. యింకా కష్టాల ఉచ్చుల్లో చిక్కుకుంటాం మరో జన్మలో! భావజాల శక్తి అదీ! పునర్జన్మ, కర్మ, పాపం లాంటి భావాలతో యీ సాంఘిక హెచ్చు తగ్గుల వ్యవస్థని బిగించ గలిగారు.

కర్మ సిద్ధాంతమున నోరు కట్టివేసి
స్వార్థలోలురు నా భుక్తి ననుభవింతు
కర్మమననేమొ దానికీ కర్తయేమొ
యీశ్వరునిచేత ఋజువు చేయించవమ్మ!

అని జాషువా 'గబ్బిలం'లో మొరపెట్టుకున్నారు.

"పరిచర్యాత్మకం కర్మశూద్రస్యాపి స్వభావమ్" (శూద్రుల కర్మ సేవ చేయడం) అని శ్రీకృష్ణుడే దేవుని వాక్కుగా గీతలో ఎవళ్ల కర్మలు యేవిటో వివరించి కట్టిపడవేస్తే (మోక్ష సన్యాస యోగం – భగవద్గీత 18 వ అధ్యాయం) యిక గబ్బిలం ఈశ్వరునితో యేమని ఫిర్యాదు చేస్తుంది? (యిక్కడ కర్మ అంటే చేయవలసిన పని అనే అర్థమే కావచ్చు, పూర్వజన్మకృత పాప పుణ్యఫలం కాకపోవచ్చు, కాని జన్మనిబట్టి విధించిన కర్మగానే తప్ప, స్వభావ శక్తి యుక్తులని బట్టి సిద్ధించే కర్మ కాదన్న అర్థమే యిక్కడ వెల్లడవుతోంది కదా!) అసలు ఆ జన్మ ఆ విభజనలో యెలా వచ్చిందీ అన్నదానికి సమాధానం అందదు కదా! దీనికి జవాబు ధర్మశాస్త్ర గ్రంథాల్లో కనిపించదు. మత బోధనల్లో కనిపించదు. ఎంతటి మహత్తరమైన గీతల్లోనూ దొరకదు. దానికి జవాబు సాంఘిక ఆర్థిక నేపథ్యంలో దొరుకుతుంది. చారిత్రక పరిణామంలో దొరుకుతుంది.

అధునిక యుగంలో జన్మతః సంక్రమించే వనుకునే యీ హెచ్చు తగ్గుల సమస్యకి సమాధానం దొరుకుతుంది. 'జన్మం చర్మం వెనకటి సంప్రదాయమూ నెరపే అసమానతలకి దేవిడీమన్నా జరిగింది. ధర్మ

శాస్త్రగ్రంథాల్ని, సృష్టికర్తని నమ్ముకున్నంత కాలం లభించని ముక్తి' యిప్పుడు లభ్యమైంది. అసమానతలకి కారణాలు సాంఘిక పరిస్థితులు, చారిత్రక పరిణామంలో ఒకనాడు చెల్లిన పద్ధతులు అవి. యివాళ చెల్లవు. సమానత్వ భావన పాతుకొంది. జన్మతః సంక్రమించే హెచ్చుతగ్గులు కొనసాగవు. ఇవాళ ఎవళ్లన్నా ఏ వృత్తినైనా అనుసరించవచ్చు. అయితే 'ద్విజ' సంప్రదాయం వాళ్లు మాంసం అమ్మడం, బ్రాహ్మణేతరులు పౌరోహిత్యం చెయ్యడం లాంటివి యింకా అభ్యంతరకరంగానే వున్నాయి. వేల యేళ్లనాటి ఆచారాలు ఒక్కసారే పోవు.

చట్ట పరంగా వర్ణాశ్రమ ధర్మాల్ని కాపాడవలసిన ప్రభుత్వం (రాజుకి ప్రత్యామ్నాయం) కులాలని రద్దు చేసింది. జన్మతః సంక్రమించే ఆధిక్య న్యూనత అంతరాలు పాటించడానికి లేదు. అస్పృశ్యత నేరం అయింది. సగోత్ర వివాహాలకి చట్టపరమైన అవరోధం యేదీలేదు. నిత్యజీవితంలో యివి ప్రాచుర్యంగా అమలు జరుగుతున్నాయా అనే అంశం వేరు. సూత్రపరంగా వాటి అమలుకి అవకాశం కలిగింది.

ఆధునిక యుగం లక్షణం యేమిటి? యీ లక్షణానికి అనువైన వ్యవస్థలు యేమిటి? యీ పరిధిలో కుల వ్యవస్థ స్థానం ఏమిటి? ఆధునిక యుగ లక్షణం ప్రజాస్వామిక దృక్పథం. యావత్ ప్రజానీకమూ ప్రజాస్వామ్యంలో భాగస్థులే. అధికారం, విద్య అవకాశాలు అందరికీ అందుబాటులోకి రావడం ఈ యుగ లక్షణం. ఒకే రకమైన అవకాశాలు వుండాలి. (ఆర్థిక పరమైన అంతరాలు తొలగేదాకా ప్రజాస్వామ్యం నిజమైన అవకాశంగా అందరికీ అందుబాటులోకి రాదు. అది వేరే రాజకీయ, ఆర్థిక సమస్య.) అందరూ సమానమేనన్న ప్రజాస్వామిక భావనతో పొసగని కుల వ్యవస్థ యింకా యెందుకు మనుతోంది?

ఇక్కడే ఆధునికతకీ, అవశేషాలకీ వున్న సంబంధం యేమిటన్న ప్రశ్న ఉత్పన్నమవుతుంది. ఆధునిక సాంఘిక రాజకీయ పరిణామంలో సాంప్రదాయకమైన ఆచారాలకీ, కట్టుబాట్లకీ కాలం చెల్లిపోవాలి. కనీసం సిద్ధాంతపరంగా అలా జరగాలి. కాని కులాన్ని పాటించడం సమసిపోలేదు. ఆధునిక రవాణా సౌకర్యాలు, పని పద్ధతులు, పాలనాపర నియమాలు కులం హెచ్చు తగ్గుల అంతస్తులకి స్వస్తి చెపుతున్నాయి. నగర జీవన పద్ధతుల వల్ల యెవళ్ల అవాసాలు వాళ్ళకే కేటాయింపై వుండే పద్ధతికి మంగళం పాడ్డం కనిపిస్తోంది. వీటివల్ల కుల వ్యవస్థలో ఒక ముఖ్యాంశమైన కులవృత్తి అనేది మాసిపోతుంది. మనువు శాసించిన రీతిలో వృత్తులు అవలంబించడం

మరుగున పడింది. బ్రాహ్మణుడు యే యే పనులు చేయకూడదో మనువు ఆదేశాలు జారీ చేశాడు. బ్రాహ్మణుడు ధనార్జన నిమిత్తం విద్యని బోధించకూడదు. సారాయిలు అమ్మకూడదు. జూద గృహాలు నడపకూడదు. వడ్డీ వ్యాపారం చెయ్యకూడదు. సేవకా వృత్తి చెయ్యకూడదు, నటనావృత్తి నవలంబించ కూడదు. కుక్కల్ని పెంచకూడదు. గొర్రెల్ని కాయగూడదు. (మను – 151 –156.) వీటిని యెందుకు ప్రస్తావించవలసి వస్తోందంటే, ఇవాళ బ్రాహ్మణులు యీ నిషిద్ధమైన పనులన్నిట్లోనూ వున్నారు. డబ్బుకోసం చదువులు చెప్పడం సరే సరి, రొయ్యల చెరువులు కూడా నిర్వహిస్తున్నారు. మనువు మిగిలిన వర్ణాలకీ యిలా నిషేధాలు విధించేడు గాని ధర్మ రక్షణ కంకణధారులైన బ్రాహ్మణులే మనువుని అతిక్రమించేటప్పుడు మిగతావాళ్లకి ఆంక్షలు వుంటాయా? ఇంతకీ ప్రసక్త విషయం అధునిక యుగంలో ఆ నియమాలు నిషేధాలు చెల్లడం లేదనే. యెందుకు చెల్లడం లేదు? ఉద్దేశ్యపూర్వకంగా అతిక్రమిస్తున్నారా? ఆ నియమాలు, నిషేధాలు జీవితంలో నిరుపయోగమయేయా? అలా అయిన పక్షంలో ఒకనాడు ఉపయోగపడినవి యిప్పుడు నిరుపయోగం అవడానికి కారణం యేమిటి? బ్రాహ్మణులే మనువు శాసనాలని అతిక్రమించవలసి వస్తోందంటే ఉద్దేశ్యపూర్వకంగా అతిక్రమించవలసి జరిగిందని అనలేం. ఏమంటే – హోదాని, గౌరవాన్ని మన్నననీ ఆధిపత్యంలో వుంచుకోవాలని చూసేవాళ్లే వాళ్లు. ఇక నిరుపయోగం అవడం. ఒకనాటి సాంఘిక వ్యవస్థకి నప్పిన ధోరణి కుల వ్యవస్థ కట్టుబాట్లు. ఆ సాంఘిక వ్యవస్థ మారింది, దాంతో ఆ కట్టుబాట్లు నిరుపయోగం అయాయి. ఒకప్పుడు ఉపయోగ పడినవి యిప్పుడు నిరుపయోగం కావడానికి ప్రధాన హేతువు సమాజ పరిణామం. సమాజం సాంఘిక ఆర్థిక నియమాలని బట్టి మారుతూ వుంటుంది. కాని ఏర్పాటు చేసి పెట్టుకున్న నియమాలని బట్టి సూత్రాలని బట్టి వర్తించదు. అంచేత సాంఘిక ఆర్థిక నియమాలు, ఒకనాటి వ్యవస్థని మరొక నాడు నిరుపయోగం చేస్తాయి. యీనాటి సాంఘిక పరిస్థితిని బట్టి యిది ప్రజాస్వామిక యుగం అని కదా పైన చూశాం. దీని ప్రధాన లక్షణం జన్మతః సంక్రమించే హెచ్చు తగ్గులు, హోదాలు, మన్ననలు చెల్లకపోవడం. పాలనలో భాగస్వామ్యం పొందడంతో సహా అన్నింటా అందరూ సమానమే. కులాల రీత్యా ఒకరు హెచ్చు ఒకరు తగ్గు అనేవి లేవు.

కులం నిర్దేశించే హెచ్చుతగ్గులు, హోదాలు, ధార్మిక శాసకత్వం విధి నిర్వహణ కార్యక్రమాలు అచరణలో యెక్కడా మనడం లేదు. యీనాటి శాస్త్రీయ, ప్రజాస్వామిక యుగంలో వాటికి పునాది లేచిపోయింది. అంటే కులాలు నామరూపాలు లేకుండా పోవాలి. కాని అలా జరిగిందా? యిక్కడ్నే కులాల పరిస్థితి చిత్రంగా వుంది. కుల వ్యవస్థ లేని కుల భావన ప్రాచుర్యంగా వుంది. ఎవరు ఏ కులమో గోప్య సమాచారం అందుతూనే వుంది. రిజర్వేషన్ల వల్ల ఆయా కులాల వారి సమాచారం లిఖిత పూర్వకంగానూ వెల్లడవుతూనే వుంది. కులం పేరుతో అవమానిస్తున్నారన్న భావంతో యెదురు తిరిగే రోజుల నుంచి పేర్లకి చివర ఆ కుల నామాన్ని పెట్టుకుని బహిరంగంగా రావడం కనిపిస్తోంది. కుల తత్వం సాంఘిక భద్రతకి ప్రమాదం తెచ్చిపెట్టేటట్టు తయారయింది. సాంఘికంగా ఒక పని విభజన యేర్పాటు చేసి జీవిత గమనాన్ని నిర్దేశించడానికి లక్షించిన కులం జీవిత గమనాన్ని కుంటుపరిచే సాంఘిక వ్యవస్థగా తయారైంది. ఇవాళ ఆధునిక యుగ జీవిత లక్షణాలకి కుల వ్యవస్థ పొసగదు. చట్టం కూడా అలానే నిర్దేశిస్తోంది. కానీ "కులభావన" విస్తరిస్తూ వుంది. ఎక్కడ వుంది దీని కీలకం?

ఆధునిక రాజకీయ వ్యక్తి సాంప్రదాయక ముడి సరుకుతో తయారై ముందుకు వస్తున్నాడు. అది కుల వ్యవస్థ. ఓ మేరకి ప్రజాస్వామిక "ఓటు" రాజకీయాలకి అసరాగా కనిపించింది. యిది, విస్తృత ప్రజాస్వామిక భావనకి అవరోధం. అయినా యిక్కడ్నే కులవ్యవస్థ సాంప్రదాయకంగా నిర్వహించిన పాత్ర కొంత ఆధునిక స్వభావాన్ని సంతరించుకుని దోహద పడుతుంది. ఉదాహరణకి కులం వృత్తుల రీత్యా ఒక రకమైన "స్పెషలైజేషన్" స్థిరపరిచింది, వృత్తిని స్థిరపరచింది. అంటే ఒక జీవికని హామీ యిచ్చింది. ఆర్థిక పరంగా అది సాంఘిక చట్రంలో అనుకూల అంశమే. అదీగాక ఆపత్సమయాల్లో ఒక అండగా నిలిచింది. ఒక రకమైన "భద్రత"ని కలిగించింది కులం. ఆ కులం వాళ్లందరూ ఒకటేనన్న మానసిక సాన్నిహిత్యాన్ని అందించింది. ఆ కుల పరిమితులకి లోబడి ప్రతిభా పాటవాల ప్రమేయం లేకుండా ఆదరణ అందించింది. యిదీ యిక్కడి చిత్రమైన పరిస్థితి. విస్తృత సాంఘిక పరిధిలో కులం విభజనని సూచించింది. పరిమిత సాంఘిక పరిధిలో ఆ బృందం మేరకి సన్నిహితత్వం కలిగించింది. యిలా సన్నిహితం కావించడం ఆధునిక రాజకీయ సిద్ధాంతాల అనుసరణలో భాగస్వాములయే వాళ్ల మధ్య యేర్పడే

సన్నిహితత్వం లాంటిది. అంటే ఒక సిద్ధాంతాన్నీ, కార్యాచరణనీ అంగీకరించేవాళ్లు ఆ భావ జాలం వల్ల యెలా దగ్గరవుతున్నారో అలాంటిదే యిదీనన్న మాట. యిది సంప్రదాయం తయారుగా అందించిన వ్యవస్థ. అయితే సంప్రదాయంలో వుండిన నియమ నిషేధాలు లేనిది. బరువు బాధ్యతలు లేనిది. వృత్తి కట్టుబాట్లు లేనిది. కుల పెద్దలు, వాళ్ల మాట శిరసా వహించడం లాంటి పరిమితులు లేనిది. మరి ఉన్నది ఏమిటి? అంతస్సారం లుప్తమైన కవచం. సాన్నిహిత్య భావన అన్న ఒకే ఒక సూత్రం బంధించి వుంచే సాంప్రదాయక వ్యవస్థ అవశేషం. రాజకీయ సిద్ధాంతాలు అనేకమందిని ఏకతాటి మీదకి తెచ్చినట్టే యిదీ అయా బృందాల్ని కలిపి వుంచుతోంది కదా, తప్పేమిటి అని అడగవచ్చు. యిక్కడే ఆధునిక తత్వంతో స్పర్థించే కుల విభజన తత్వం బుసకొడుతోంది. సాంప్రదాయక వ్యవస్థలో "మా కులం" "మా కట్టుబాట్లు" అనే భావనలకే పెద్దపీట. ఆ సాన్నిహిత్య భావనే మొదటి వరసలో వుండేది. ఆధునిక ప్రజాస్వామ్య యుగంలో "మా" అనే సాన్నిహిత్య భావన నుంచే "మన" అనే విస్తృత సాన్నిహిత్య భావనకి పురోగతి చెందాలి. యే వ్యక్తి అయినా తను, తన కుటుంబం అని మొదట భావిస్తాడు. అక్కడి నుంచి కులం, ఊరు, దేశం అనే భావనలతో పరిధి పెరుగుతుంది. యిలా పరిధి విస్తృతం కావడాన్నే "సార్వజనీన సాన్నిహిత్య భావన" అనవచ్చు. కుల భావననుంచి యీ మెట్టుకి యెదగాలి. ఎదగని పక్షంలో పరిమిత సాన్నిహిత్య భావనే పాదుకుని సార్వజనీన సాన్నిహిత్య భావనే ఆలంబనగా వుంటే సార్వజనీన సాన్నిహిత్య భావన అందని పరిమిత విభజనలు యేర్పడతాయి. కులం, మతం చరిత్రలో ఇలా పరిమిత పరిధులు యేర్పాటు చేసినవే. ఆధునిక జీవితానికి యీ పరిమితులు, విభజనలు వుండకూడదు. అప్పుడే శాస్త్రీయమైన భౌతిక వాద జీవిత అవగాహన వస్తుంది.

అంటే, అధునిక జీవిత తాత్వికతకి కులం పునాది మీద ఏర్పడ్డ విధి నిర్వహణలో సాన్నిహిత్య భావనలు సరిపోవు. జీవితం విస్తరిస్తోంది. కాబట్టి తత్సమానమైన భావనలు విస్తరించాలి. సాంఘిక హోదాలో ఒకప్పుడు ద్విజ సంప్రదాయాన్ని ఆచారాలని తామూ పాటించి హోదా సాధించాలని "క్రింది వర్ణా" లనే వాళ్లు ప్రయత్నించారు. యజ్ఞోపవీతం ధరించడం, శాకాహారం తీసుకోవడం, వితంతు పునర్వివాహాలు నిషేధించడం, బాలికలకి పుష్పవతులు కాకుండానే వివాహాలు జరిపించడం, కుల నామాల్ని మరింత మర్యాద ద్యోతక రీతిలో మార్చుకోవడం (నాయీ బ్రాహ్మణులు,

అగ్నికుల క్షత్రియులు, గంగపుత్రులు, అరుంధతీయులు, జాంబవతీయులు వగైరా) జరిగాయి. దీనంతటనీ "సంస్కృతీకరణ" అని మానవ శాస్త్ర పరిశీలకులు అన్నారు. ఇవాళ అలాంటి పనులేవీ చెయ్యటంలేదు. అలాంటి సంస్కృతీకరణ అవసరమూ పెద్దగా కనిపించడంలేదు. అంటే కుల సంబంధమైన ఆధిక్య న్యూనతలు, హోదాలు సాంఘికంగా పరిగణనలో లేనట్లేననాలి.

కులం నిర్వర్తించే విధులు పోయాయి. కులం రీత్యా జన్మతః సంక్రమించే ఆధిక్య న్యూనతలు పోయాయి. పాత కాలంలో చెల్లినట్లు కుల కట్టుబాట్లు, కులపెద్దల అజమాయిషీ పోయాయి. చట్టరీత్యా కులాన్ని గుర్తించడం పోయింది. వివాహ భోజనాదికాల విషయంలో ఆంక్షలు పోయాయి. కులాన్ని ధిక్కరించి కూడా బతకగల సాంఘిక పరిస్థితులు వచ్చాయి. అయినా కులం ఇంకా మనుగడ సాగిస్తూనే వుంది - సాంఘికంగా ఏ లక్ష్యమూ నిర్దేశితమై లేకపోయినా. ఏ నాటి నుంచో సంక్రమిస్తూ వచ్చిన వ్యవస్థ ఏదో ఇంకా చూరుపట్టుకు వేలాడుతోందిలే అనుకొనే రీతి మనుగడ కాదు. ఏ సాంఘిక బాధ్యతా జవాబుదారీతనం అవసరం లేకుండా దురభిమానాలు రెచ్చగొట్టే మనుగడ. దురభిమానం రెచ్చగొట్టడం ఏమిటి అనిపించవచ్చు. ఆధునిక ప్రజాస్వామ్య యుగంలో రాజకీయంగా సిద్ధాంత పరమైన అవగాహన నిర్దేశిస్తూ ఆచరణలో ఆ పునాది మీద పురోగతి సాధించాలి. కాని అలా కాక, అంటే సిద్ధాంత పరమైన అవగాహన కాక, కుల సాన్నిహిత్య భావన చోదకంగా ఉన్నప్పుడు ఆర్థిక వర్గ పోరాటం నిశితంగా ఉండదు. ఆర్థిక పోరాటం వల్ల పరిష్కారమవ్వాల్సిన సమస్యలు కుల సంకుచితత్వం మాటున మరుగు పడిపోతాయి. అందుకనే దురభిమానపూరితం అనడం.

స్వాతంత్ర్య పోరాట సమయంలో కుల సంఘాలు ఉండేవి. విద్యావకాశాలు మెరుగు పరుచుకోవడం, సంఘటిత పరచడం మేరకి ఒక రకంగా అనుకూలమైన కృషినే చేశాయి. కాని రాజకీయ పరిధి విస్తృతమై అవగాహన విస్తరించవలసి వచ్చినప్పుడు ఆ స్థాయికి ఎదగాలి. కుల సంఘాలు ఆ కర్తవ్యం నిర్వహించలేక పోయాయి. కులం వల్ల తమకి ఏమీ లబ్ధి కలగపోయినా ఆ కుల సభ్యులు తాత్కాలిక రాజకీయ ప్రయోజనం కోసం కత్తులు చేతపడుతున్నారు. ధనిక, పేద అంతరాలకు వ్యతిరేకంగా ఎత్తే కత్తులు కావవి (ధనిక, పేద విభజన అన్ని కులాల్లోనూ వుంది).

కానీ ఆ తారతమ్యాలు మరుగున పడవేసే దురభిమానంతో కుల స్పర్ధతో ఎత్తే కత్తులు అవి. దాని వల్ల ప్రజాస్వామ్యం పెదవి విరుస్తోంది. ప్రజాస్వామ్యం, సమానత్వం అనే భావనలు నినాదాలుగా హోరెత్తుతూ వున్న నేపథ్యంలో కుల వ్యవస్థ నిర్వహించే కార్య కలాపం ఇదీ. తమ పరిమితులకు ప్రయోజనకారిగా ఉన్నంత మేరకి ప్రతివాళ్ళూ కులం పట్టును సడలనివ్వడం లేదు. ఆ ప్రయోజనాలకు భంగకరం అయిన స్థితిలోనే "కులపిచ్చి" "దురభిమానం" "కులరక్కసి" అని గొంతుకలు చించుకుంటున్నారు.

మరి ఈ పరిమితులను అధిగమించడం ఎలాగ? ఆధునిక జీవిత విధానంలో కుల విహిత ధర్మాలకి కాలం చెల్లింది కదా! భావనగా మాత్రం కులం వుంది. నిజమైన ప్రజాస్వామిక అవగాహన పెరిగి అవకాశాలు అందరికి అందుబాటులోకి వచ్చినప్పుడు భావనలో వున్న ఈ వేర్పాటు కూడా సమసిపోవచ్చు. అయితే అది ఎప్పుడు జరుగుతుందీ అన్నదే సమస్య. మానవుడు "మానవునిగా మేలుకొని" "ఈ విశ్వం సమస్తం ఏలుకోవాలని" నడుం కట్టినప్పుడు.

★ ★ ★

# కాలోహ్యయం నిరవధి...

"కాలమనంత" మన్నాడు భవభూతి. "గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్" అని నన్నయగారు వ్యాసుని చేత సత్యవతికి చెప్పిస్తాడు. "మంచి గతమున కొంచెమేనోయ్ మందగించక ముందు కడుగె"య్యమని గురజాడ దీన్ని కొట్టిపారేశాడు. "భవిష్యత్తు మీదే నా నిఘా. అర క్షణం గడిచేసరికదే నాకు గత శతాబ్ది" అని శ్రీశ్రీ కరాఖండిగా చాటేడు. "కాలానికి ఒక రూపం లేదు దానికి పాపం లేదు. కాలం సవాల్ వంటిది సాహసవంతుడందుకొని ముందుకు సాగిపోతాడు. చప్పబడిన పెద్దన్నయ్య చతికిలపడిపోతాడు"అని తిలక్ హెచ్చరించాడు.

ఇంకా కాలం గురించి చాలా మంది చాలా రకాలుగా స్పందించారు. గతకాలం, గడుస్తున్న కాలం, గడవబోయే కాలం రకరకాల ప్రతి స్పందనలకి కారకమయ్యేయి. "చెడ్డరోజులు", "మంచి రోజులు" మనుషులకి యెదురవుతూనే వున్నాయి. జీవితం సాగుతూనే వుంది. కాలం గురించిన భావన, కాలానికి వున్న ప్రాముఖ్యం యేనాటి నుంచో మనిషిని చిక్కు పెడుతూనే వున్నాయి. తత్వశాస్త్రవేత్తలకి కాలభావన పెద్ద చింతనాంశం అయింది. "కాలం అంటే ఏమిటి?" అనే విచికిత్స మనిషి బుర్ర పనిచెయ్యడం ప్రారంభించిన నాటినుంచీ వుంది. యీ భావనకి తోబుట్టువు దేశం, అంటే స్థలం, ప్రదేశం. ఇంగ్లీషులో space (స్పేస్) అంటారు. యీ ఇంగ్లీషు పదానికి ఆకాశం, రోదసి, అంతరిక్షం అనే అర్థాలు వున్నాయి. యీ అర్థాల్లో స్పేస్ క్రాఫ్ట్, (అంతరిక్ష/రోదసి నౌక) లాంటి పదాలు ప్రయోగంలో వున్నాయి. 'ఆకాశంబు శూన్యంబు. అంటే ఏమీ లేదన్నమాట' అని సారా సీనులో మనవాళ్లయ్య ప్రకటిస్తాడు. "ఏటీ లేదా? గుడ్డోళ్లకి ఏటీలేదు. తెల్లోడు యెర్రోడా? పట్టణంలో గొట్టాలెట్టి అదే సూస్తాడే ఆకాశం కాసి" అని మునసబు సోమినాయుడు కొట్టిపారేస్తాడు. ఆకాశం అని వ్యవహరించేది ఒట్టి శూన్యమేనా? కాలం అనేది ఒట్టి భావనేనా? అనేక మంది పండితులు అనేక రకాలుగా

వ్యాఖ్యానించారు, వివరించారు. ఆధునిక భౌతిక శాస్త్రం వికసించేక చాలా ప్రశ్నలకి జవాబులు దొరికాయి, యింకా దొరుకుతూవున్నాయి.

మన దృగ్గోచర ప్రపంచంలో యేదేనా యెప్పుడేనా ఒక దేశ కాల పరిమితుల్లో వుంటుంది. దేశ కాలాలకు అతీతంగా యేదీ వుండదు. భౌతికమైన ఉనికి గల ప్రతీదీ దేశ కాల పరిమితుల్లోనే వుంటుంది. అలాగే దేశ కాలపరిమితులకు లోబడి ఉండే ప్రతీదీ మారుతూ వుంటుంది కూడా. ఏ మార్పూ లేకుండా స్థిరంగా ఏదీ వుండదు. శాశ్వతంగా యేదీ వుండదు. ఏంగిల్స్ చెప్పినట్టు శాశ్వతంగా ఉండేదల్లా మార్పు ఒక్కటే. భౌతికమైన ఉనికి గల ప్రతి దానికి యీ నియమాలు తప్పవు. యీ నియమాలు వర్తించే ప్రతీదానికీ దేశ కాల పరిమితి వుంది. అయితే భౌతికమైన ఉనికి లేనిదీ దేశ కాల బాధితం కానిదీ అమూర్తం, అపరిమేయం. భౌతిక శాస్త్ర రీత్యా అలాంటిది యేదీ వుండదు. ఉందని భ్రమించడమే భౌతికశాస్త్ర నియమాలు వర్తించని భగవద్భావన. ఆది మధ్యాంత రహితమూ, సర్వవ్యాపకమూ అయిన 'పదార్థం' అది. దాన్ని భగవంతుడు అన్నారు. భగవంతుడు అంటే పుంలింగ రూపం కావాలి. ఒక రూపం అంటూ వుంటే ఒక ప్రదేశం, ఒక ఉనికి సమయం వుండాలి. కాలానికీ దేశానికీ అతీతమైం దనుకున్నప్పుడు రూపం వుండ కూడదు. స్త్రీ పురుష భేదం సంగతి సరే సరి. మరి దేవుడు, దేవత అనే పుంలింగ, స్త్రీ లింగ విభజనతో ఆరాధిస్తున్నారు కదా? అదెలా? అందుకని కొందరు "విశ్వేశ్వరుడు సమవాచకం అనీ, లింగమును సమ రూపమే అనీ భావిస్తారు" అంటారు ఏనుగుల వీరాస్వామయ్య గారు (కాశీయాత్ర చరిత్ర.) కాలపరిమితి లేని భావనగా భగవత్ చింతన రూపొందింది. "ఆది అంతం లేని దానికి లెఖ్ఖేటి తమ్ముడూ" అని బైరాగి బుకాయింపుతో తన మాహాత్మ్యాన్ని చాటుకోజూస్తాడు. ఉనికిలో లేని వాటి గురించిన భావనలతో ఉనికిలో వున్నవాటి గురించిన భావనలు "భ్రమ" అయిపోయేయి. ఉనికిలో వున్న యీ భూమి మిధ్య కావడం, ఉనికిలో లేని 'బ్రహ్మ' సత్యం కావడం – యిలా దేశ కాలాతీతమైన మన్నికని వూహించుకున్న దాని ఫలితం. ప్రతీదీ దేశ కాల పరిమితులకి లోబడే వుంటుందన్న యదార్థాన్ని అందుకుంటే "జగత్ సత్యం, బ్రహ్మ మిధ్య" అని తెలుతుంది. యీ శాస్త్రీయవైఖరితో చూసినప్పుడు కాలం గురించిన భావన యెలా వుండాలి?

కాలాన్ని అర్థం చేసుకునే దృష్టి యెలా వుంది? దీన్ని గురించి తెలుసుకుంటే పై ప్రశ్నకి చిక్కు విడుతుంది.

కాలాన్ని గురించి అర్థం చేసుకునే తీరు జీవితాన్ని గురించి అర్థం చేసుకునే సరళిలోనే వుండేది. మనుగడని బట్టే మనసూ ఆలోచిస్తుంది. జీవితం గురించిన అవగాహన, అవలోకన మారుతూ వచ్చేయి. జీవిత వ్యవస్థల గురించిన అవగాహనా మారుతూ వచ్చింది.

భారతదేశంలో హైందవ జీవిత దృక్పథం యెలా వుందో హైందవ కాల భావనా అలానే వుంది. యివాళ్టికీ బ్రాహ్మణులు సంధ్యావందనంలో "కలియుగే, ప్రథమపాదే" "వైవస్వతమన్వంతరే" "శ్వేతవరాహకల్పే", "చాంద్రమాన వ్యావహారిక" "బహుధాన్యనామ సంవత్సర ...మాస,...పక్ష... తిధి" అంటూ సంకల్పం చెబుతూవుంటారు. యీ సంకల్పంలో గోత్ర ప్రవరాదులతో తమ చిరునామా యేకరువు పెడుతూ కాలమానం వల్లిస్తారు. ఇందులో సంవత్సర గణన, మాసం పేరు, పక్ష వివరణా, తిథి వక్కాణింపూ యదార్థానికి ఓ వేలు విడిచిన దూరంలో వుంటే, మిగిలినవి యుగం, మన్వంతరం, కల్పం స్వకపోల కల్పితంలో తప్ప దాఖాలాకి నిలవవు. (స్వకపోలం అంటే తన బుద్ధి వల్ల కల్పించిందని, కానైతే యిక్కడ ప్రాచీన కాలంలో వాళ్ల బుద్ధి వల్ల అని చెప్పుకుందాం.) యీ యుగాలూ, మన్వంతరాలూ, కల్పాలూ సరాసరి సాగిపోవు. ఇవన్నీ లయించి, మళ్లీ సృష్టి మొదలై, ఓం అంటూ అదే చక్రం బండికల్లులా తిరుగుతుంది. కాలం చక్రభ్రమణంలో గణనకి వచ్చింది. దీనికి కారణం ఒక రుతువు తర్వాత మరో రుతువు క్రమం తప్పకుండా తిరిగి తిరిగి వస్తూ పోతూవుండడం అన్న వాస్తవం. ఈ పరంపరలో సంచిత పరిణామాలు యేం కనిపించవు. ఈ రుతుచక్రం అలా తిరుగుతూనే వుంటుంది. వ్యవసాయం ప్రధాన జీవనాధారంగా, మౌలిక ఉత్పత్తి విధానంగా వున్నప్పుడు రుతువుల మీద ఆధార పడడం తప్పనిసరి – ప్రకృతి శక్తుల మీదనే ఆధారపడిన ఆ కాలంలో యిలా ఆధార పడడం మరీనూ. యిది జీవిత విధానం మీద ప్రభావం కలిగిస్తుంది. ఆ విధానమే జీవిత దృక్పథాన్ని నిర్దేశిస్తుంది.

హైందవ జీవిత దృక్పథం ప్రకారం రుతు చక్రం లాగానే జీవిత చక్రమూనూ. రుతువులు ఒకదాని తర్వాత ఒకటి క్రమరీతిలో సంభవిస్తూ వుంటాయి కదా! అలాగే ఆత్మ మళ్లీ మళ్లీ జన్మ లెత్తుతూ వుంటుంది. మనిషి ఆత్మ – మరో దృష్టి పరంగా సమస్త జీవుల ఆత్మలు పునర్జన్మ పొందుతూ యీ సంసార చక్రంలో పరిభ్రమిస్తూ వుంటాయి. దీనికి

కారణం కర్మఫలం. చేసిన పాపం, పుణ్యం మనిషి ఆత్మకి జమా ఖర్చుల ఖాతా యేర్పాటు చేస్తాయి. స్వర్గ నరకాదికాల ప్రాప్తి వాటిని బట్టి లభిస్తుంది. ఆ తర్వాత మళ్లీ జన్మ. మళ్లీ యిదే ఖాతా. ఇలా "బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" (అనేక జన్మలలో ఆచరించిన పుణ్యకర్మల ఫలితంగా జ్ఞాని నన్నాశ్రయిస్తాడు) అని గీత "విజ్ఞాన యోగం" ఉద్బోధిస్తోంది. యీ పాప పుణ్యాలు, బహుజన్మలు యెలా సంభవిస్తాయి, వీటికి మూలాధారం యేమిటి లాంటి విషయాల గురించిన చర్చ యిక్కడ ప్రస్తుతం అవసరం లేదు. చూడవలసిన విషయం "దేహాత్మబుద్ధి మాశ్రిత్య సంసారే భ్రమతాం నృణాం (దేహాత్మబుద్ధి కలిగి వుంటూ యీ సంసార చక్రంలో పరిభ్రమిస్తూ వుంటారు నరులు) పునరపి జననం పునరపి మరణం పునరపి జననీ జఠరే శయనం" అంటూ యిలా సంసార చక్రంలో బంధితులైన జీవులు మోక్ష సాధన కోసం ధ్యానిస్తూ ఆఖరికి యీ వలయం నుంచి బయట పడాలి. "జంతుర్జన్మ సంసార బంధనాల" నుంచి "ముచ్యత"మయే మార్గమే మనుషులు తెలుసుకోవాలి. అంటే "సంసారబంధనం", "బహుజన్మలు" అన్న భావన స్థిరంగానే జీవిత దృక్పథాన్ని నిర్దేశించిం దన్నమాట! అసలు బహుజన్మ లేమిటి, సంసార చక్రంలో బంధిత మవడం యేమిటి అనేలాంటి సందేహాత్మక ప్రశ్నలే తలెత్తలేదు! యిదంతా అలా జరిగే తీరే నన్న భావన ప్రామాణికంగా నిలిచిపోయింది. ఆత్మ తిరిగి తిరిగి జన్మలెత్తడం, చక్రభ్రమణంలో వుండడం, అనే భావన అతి ప్రాచీన కాలం నుంచీ వుంది. క్రైస్తవమతంలో, యూదు మతంలో, ఇస్లాంమతంలో లేని భావన యిది. భారతదేశంలో పరిఢవిల్లిన వివిధ మతాల్లోనూ వున్న విశిష్ట భావన యిది. జీవితానికి సంబంధించిన యీ చక్రభ్రమణ దృష్టి అన్ని రంగాలకీ విస్తరించింది.

ఈ చక్రభ్రమణ దృష్టి జీవితానికీ, ఋతుచక్రానికి, కాలానికీ ఒక్కలాగానే వర్తించింది. జీవితం విషయంలో పునర్జన్మలు, ఋతువుల విషయంలో 'పునరావృత్తి', కాలం విషయంలో చక్రనేమి క్రమ పరిభ్రమణం.

యీ భావనకి అనురూపమైనట్టే కాల విభజనా జరిగింది. కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం అని విభజించేరు. వీటిలో ఒక్కొక్క దానికీ సంవత్సర పరిమితులు వున్నాయి. అన్నిటి కంటే కృతయుగం కాలం యెక్కువ. అదే సత్యయుగం. తర్వాత సంధికాలం. ఆ సంధికాలం అయ్యేక త్రేతాయుగం. మళ్లీ సంధి కాలం. అదయేక ద్వాపర

యుగం. యీ యుగం సంధి కాలం ముగిసేక కలియుగం. తర్వాత ప్రళయం. మళ్లీ పునస్సృష్టి. ఇదే క్రమం పౌనఃపున్యంగా సాగుతూనే వుంటుంది. హిందూ దృక్పథం ప్రకారం మానవ ఆయుఃపరిమితి సుఖశాంతులు ఒక యుగం నుంచి యింకో యుగానికి తగ్గుతూ పతనమవుతూ వుంటాయి. కృతయుగంలో మానవుల ఆయుః పరిమాణం వేల సంవత్సరాలలో వుండేది. భూమ్మీద సుఖశాంతులు సొడ్డు పెట్టడానికి వీల్లేని తీరులో వుండేవి. కల్పవృక్షం, కామధేనువు మానవులకి యిష్టకామ్యార్థసిద్ధి కలిగిస్తూ కోరిక అనేది తలెత్తడానికి వీలు లేకుండా చేసేవి. ఇక అక్కడి నుంచి ధర్మచ్యుతి జరుగుతూ ఆయుఃప్రమాణం, సుఖశాంతులు దిగజారిపోయేవి. కలియుగంలో జీవితాన్ని నానారకాల యీతిబాధలూ పట్టి పీడిస్తాయి. బతుకు బండలైపోతుంది. ప్రళయం యెప్పుడో ముంచుకు వస్తుంది. సర్వం నాశనమై పోతుంది. ప్రస్తుతంలో కలియుగమే నడుస్తోంది!

బౌద్ధ, జైన మతగ్రంథాల్లోనూ యిలాంటి దృష్టే వెల్లడవుతోంది.

హైందవ దృష్టి మరింత పుంజుకుని యింకా పట్టుగల సిద్ధాంతాన్ని రూపొందించి, నిరంతర మన్వంతర చక్రాన్ని ప్రతిపాదించింది. అసలే ఊహకి అందకుండా వున్న కాలదర్శనను యీ మన్వంతర భావన మరింత జటిలం చేసింది. "లౌకికమైన సంవత్సర కాలము కంటె నధికమును దానికి మూలమును, నిత్యమును, నిరవయవమునైన కాలము పారమార్థికము. అదే అధిసత్యమనబడు కాలము. పరమాత్మ స్వరూపమైన యీ యధి సత్యమే 'కాలకాల మని' 'జ్ఞఃకాలకాలం' అను శ్రుతి వక్కాణించు చున్నది" అని మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారు, వ్యాసరత్నావళిలో వివరించేరు. హైందవ జీవిత దర్శనంతో మూస పోసినట్లు అతికే భావన యిది.

"లౌకికమైన కాలం" కంటే అధికమైందని ప్రకటించే యీ కాలాన్ని 'కల్పం' అని పిలిచారు. అది బ్రహ్మకి ఒక రోజు. కల్పంలో వెయ్యి మహాయుగాలుంటాయి. ఒక్కొక మహాయుగ చక్రం 43,20,000 సంవత్సరాల పరిమితితో వుంటుంది. అంటే వెయ్యింటికీ 4320000000 (అక్షరాలా ఎంతో లెక్కచూసుకోండి!). ఇది ఒక కల్పం అన్నమాట! యీ లెక్కంతా మానవ కాలమానంతో గణించినప్పటిదే. యిక బ్రహ్మకీ మానవులకీ మధ్యలో వుండే దేవతాగణం లెక్కలో యిది 12000 దివ్య సంవత్సరాలు. యిది బ్రహ్మకి సంబంధించిన ఒక రోజు పరిమితి. అలాంటి కల్పం (బ్రహ్మదివసం) సృష్టితో మొదలవుతుంది. ప్రళయంతో

సమాప్తమవుతుంది. అనంతంలో సంయోగం చెందుతుంది. ఇలాంటి "కల్పాల్లో" ఒకదాన్ని పధ్నాలుగేసి మన్వంతరాలుగా విభజించేరు. ప్రతి మన్వంతరంలోనూ డెబ్బై ఒకటి పై చిలుకు మహాయుగాలుంటాయి. అవి ప్రళయంతో అంతమవుతాయి. అలాంటి మహాయుగాలు తొమ్మిది వందల తొంభైనాలుగు వుంటాయి. యిప్పటికి యింకా ఆరు మహాయుగాలు గడవాల్సివుందట. మన్వంతరాలనే పేరు మనువుని బట్టి వచ్చింది. మనువు మానవ చక్రవర్తి. సూర్యదేవుడైన వివస్వంతుని సంతతి. విష్ణుమూర్తి మత్స్యావతారం యెత్తి ప్రళయసమయంలో యీ మనువుని రక్షించి మానవాళి మూల పురుషుడయేటట్టు చేశాడు. (అల్లసాని పెద్దన గారి 'మనుచరిత్ర'లో స్వారోచిషమనువు రెండవ మనువట.) ప్రస్తుతం. సప్తమ వైవస్వత మన్వంతరం జరుగుతోంది. మరోసప్త మన్వంతరాలు గడిస్తే బ్రహ్మాదివసం ముగుస్తుంది. ప్రస్తుతంలో జరుగుతున్న బ్రహ్మాదీవసం వరాహ కల్పమట! (పైన సంకల్ప ప్రస్తావనలో చెప్పుకున్నాం యీ విషయం.) అంటే, విష్ణుమూర్తి వరాహ అవతారం అన్నమాట. ప్రళయం సంభవించేక బ్రహ్మ మళ్లీ విష్ణుమూర్తి నాభిలోని పద్మం మీద ఆసీనుడై పునః ప్రత్యక్ష మవుతాడు. కల్హణుడు "రాజతరంగిణి"లో సప్తమ మనువు విషయం ప్రస్తావించాడు. యీ కల్ప భావన అంతా పురాణాల్లో వర్ణితమైంది. జరిగినవీ, జరగబోయేవీ భవిష్య పురాణాల్లాంటి పురాణాల్లో యెడాపెడా రాశేసారు.

చక్ర పరిభ్రమణ రీతిలో జీవితాన్ని, కాలాన్ని దర్శించిన దాని పుణ్యం యిది. ఇందులో చరిత్ర యెంత అనే విషయాన్ని వడగట్టి తేల్చడం బ్రహ్మతరం కాదు! అసలు బ్రహ్మే చక్ర పరిభ్రమణంలో కొట్టుమిట్టాడుతూ వుంటే చరిత్ర యిదీ అని యెలా విడదీయగలడు? యీ రకంగా హైందవ కాలదర్శనలో పురాణకల్పనా, చరిత్రా క్షీరనీరన్యాయంగా కలిసిపోయేయి. (జేమ్స్ మిల్ లాంటి వాళ్లు భారతీయులకి చరిత్ర లేదని ఆరోపించడం యీ కారణంవల్లనే. ఆయన "చారిత్రక కాల దృష్టిలో భారత ప్రాచీన చరిత్రను పునర్నిర్మించ దలచిన పండితు లందర్నీ ఆక్షేపించేడు" అని రోమిలా థాపర్ రాశేరు.) సామాన్య ప్రజానీకానికి వేలయేళ్లనాడు జరిగినవీ, నిన్న మొన్న జరిగినవీ ఒక్కలాగానే కనబడుతూ వుంటాయి. చరిత్రకీ, పురాణకల్పనకీ మధ్య వున్న తేడా అదే. పురాణకల్పనలో కాలక్రమ నియమమేదీ లేదు. బ్రహ్మకల్పంలో యిన్ని మన్వంతరా లున్నప్పుడు, యిన్ని

మహాయుగా ఉన్నప్పుడు ఎప్పటి కృతయుగమని ముచ్చటించుకుంటాం, యెప్పటి కలియుగమని ఖేదపడుతూవుంటాం? యీ సందర్భంలో మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు (సంస్కృత వాఙ్మయచరిత్ర రెండవ భాగం, లౌకిక వాఙ్మయము) రామాయణ మహాభారతాల గురించి రాసిన విషయాలని ప్రస్తావించుకోవచ్చు. "పరాశరులు ముగ్గురు నలుగురు, వ్యాసులు పెక్కండ్రు గలరనుటకు వైదిక, లౌకిక వాఙ్మయములందు ననేకాధారములు కలవు" లేదా వేదవ్యాసుడన్నది బిరుదనామము. "ఈ వైవస్వత మన్వంతరమున గడచిన యిరువైయెనిమిది ద్వాపరములందు నిరవై యెనమండుగురు ఋషులు వేదవ్యాస బిరుదము గాంచిరని" విష్ణుపురాణం చెపుతోంది. పరాశరులు ముగ్గురు నలుగురు, వ్యాసులు యిరవై యెనమండుగురు (అదీ చారిత్రక క్రమంలో మొదటిది కలూయీ, రెండవ లూయీ, పధ్నాల్గవ లూయీ అనీ; రెండవ పులకేశి, రెండవ విక్రమాదిత్య అనీ చెప్పుకున్నట్టు కాదు. యిరవైయెనిమిది ద్వాపరాలు గడిచేయి. ద్వాపరానికి ఒక వ్యాసుడు, ఆలెక్కన అంతమంది అని కల్పన రీత్యా). యిలా కాలాన్ని గురించి అంచనా వేసుకున్నప్పుడు, యెప్పటి దైతేనేం జీవుడు కడతేరి సిద్ధిపొందుతాడు అన్న ఊరట మోక్షంలో లభిస్తుంది.

సృష్టికి సంబంధించీ, మానవ జీవిత పరిణామానికి సంబంధించీ యెంత భావవాద దృష్టి అల్లుకుందో అంతా యిలా కాలం గురించీ "కల్పాల" కల్పనలో అల్లుకుపోయింది. జీవితానికీ, సృష్టికీ సంబంధించిన భావవాద దృష్టి అంటే కూడా జన సామాన్యానికి సరైన అవగాహన లేదు. "దేవుని దయ వల్ల పుట్టాం. దేవుడి దయ వల్ల మనకీ సుఖశాంతులు దక్కుతున్నాయి" అని యజ్ఞాలు, పూజలు చేస్తూ, క్రైస్తవ పరిభాషలో "కృతజ్ఞతాస్తుతులు" చేస్తూ వున్నప్పుడు యిందులో భావవాద దృష్టి యెంతో అంతు బట్టదు. భౌతిక కారణాల ప్రమేయం లేకుండా మనకి దృగ్గోచరంగా వున్నవన్నీ మనుషులతో సహా సంకల్ప మాత్రంగా సృష్టి అయి వచ్చేయన్న దృష్టి భావవాద వైఖరికి పునాది. అలాకాక భౌతిక హేతువుల వల్లే ప్రతిదీ ఉనికిలోకి వస్తూపోతూ వుంటుందన్నది భౌతిక వాద దృష్టి.

జీవిత దృక్పథంలో యెంత భావవాద వైఖరి అల్లుకున్నా యదార్థం పునాదిగా వున్న జీవితానికి భౌతిక వాద దృష్టిపూర్వక ఆచరణే అవసరం. ఉదాహరణకి శరీరం వుంది. రోగగ్రస్త మవుతుంది. ఆ బాధనుంచి

తప్పించుకునేందుకు మొక్కులూ, దైవప్రార్థనలూ ప్రధాన సాధకాలు కావు. వైద్య పరీక్షలూ, చికిత్సలూ కావాలి. యిదే ప్రధానం. (వీటికి తోడుగా పైవి వుంటే వుండవచ్చు - మానసిక దౌర్బల్యం వల్ల!) యిది భౌతిక వాద దృష్టి. దీనికి ఆచరణ గీటురాయి. కాలం విషయంలో భౌతిక వాద దృష్టి యెలా వుంది? యెలా వుండాలి?

కాలాన్ని చక్ర పరిభ్రమణంగా వూహించుకోవడమే భావవాద దృష్టి. చక్రభ్రమణ దృష్టి పురాణ పద్ధతికి చెందింది. ప్రాచీన సమాజాల్లో ఆనాటి జీవిత విధానానికి, ఉత్పత్తి విధానానికి తూగే రీతిలోనే పరిసరాల్ని, ప్రపంచాన్ని పరిశీలించేరు. ఆ పంథాలోనే కాలాన్ని, పురాణ గాథల కల్పనలతో కాలాతీతంగా పరిగణించేరు.

కాలం గురించిన చక్రభ్రమణ దృష్టి ఆధునిక విజ్ఞాన పురోగతి రీత్యా కాల్పనికం, మార్మికం, అలౌకికం.

యీ చక్రభ్రమణ దృష్టికి భిన్నమైంది ఆధునిక పరిశీలన. ఆధునిక దృష్టిలో కాలం చక్రభ్రమణంలో మాదిరి వృత్తంలో తిరగదు. కాలం సరళరేఖలా, రేఖాకృతిలో సాగుతుంది (linear). యీ దృష్ట్యా కాలం ఏక దిశాగమనంలో వుంటుంది. తిరిగి అవే ఘటనలు పునరావృత మవుతూ వుండవు. యిక్కడ జరిగేది చరిత్ర. యిది సాగుతూ వుంటుంది. యిది భౌతిక క్రమం.

భౌతికవాద దృష్టికి చారిత్రక దృష్టి ప్రతిఫలనం. చారిత్రక దృష్టిలో భేదాలున్నట్టే - అంటే భౌతిక వాద దృష్టి ప్రతిఫలనంలో భేదాలున్నట్టే - కాలాన్ని దర్శించే వైఖరిలోనూ భేదాలు వున్నాయి. చారిత్రక దృష్టిలో యాంత్రిక దృక్పథం, జడవాద దృక్పథం లాంటి వైఖరులు వున్నాయి. చక్రభ్రమణ పరిశీలనలోనూ జడవాద దృష్టి వుంది. యివి జీవిత దర్శనలో భావవాద, భౌతికవాద దృష్టులలాంటివి. చక్రభ్రమణ దృష్టిలో చక్రంలో తిరగడం, భౌతిక వాద దృష్టిలో క్రమానుగతంగా సాగడం అనేవి ప్రాతిపదికగా వున్న అంశాలు. యీ రెండింటి దృష్టిలోనూ పైన చెప్పుకున్న యాంత్రిక, జడవాద ధోరణులు వున్నాయి, చక్రభ్రమణ దృష్టిలో ఒక యుగం తర్వాత యింకో యుగం వస్తుందని కదా? అంటే ఆమేరకి కాలం క్రమగతిలో సాగుతూ వున్నట్టేనన్న భావనా వుంది. అయితే యిక్కడ సంఘటనలు తిరిగి, తిరిగి అవే సంభవిస్తూ వుంటాయి. (అంత మంది పరాశరులూ, వేదవ్యాసులూ మళ్లీ వాళ్లే)

అంచేత యీ క్రమానుగత పరిశీలనకి ప్రాముఖ్యం లేదు. మొత్తం భావనాత్మక భ్రమం చక్రభ్రమణంలో వుండడం వల్ల యీ యుగ క్రమానుగత దృష్టికి ప్రత్యేకతా లేదు.

యిక భౌతిక వాద దృష్టిలో వున్న యాంత్రిక, జడవాద వైఖరులని బట్టి కాలగమనం యెలావుంది? చక్రభ్రమణ భావవాద పరిశీలనలో సృష్టి, స్థితి, లయలు పౌనఃపున్యంగా సాగుతూనే వుంటాయి. యాంత్రిక చారిత్రక దృష్టి ప్రకారం సృష్టి సంకల్పమాత్రంగానే జరుగుతుంది. సాగుతుంది. స్వర్గధామం నుంచి పతనం సంభవిస్తుంది. ఆఖరికి "అంతిమతీర్పు" దినం వస్తుంది. దీన్ని క్రైస్తవ మతంలో 'డే ఆఫ్ జడ్జిమెంట్' అన్నారు. మహమ్మదీయమతంలో 'కయామత్ కా దిన్' అన్నారు. హిందువులు తమ ధోరణిలో ప్రళయకాలం, "బ్రహ్మణా సహముక్తి" అన్నారు. మొత్తం మీద యీ ప్రకృతి కంతా ఒక కాలంలో ఉపసంహారణ జరుగుతుంది. హైందవ భావనలో కలియుగంలో ధర్మచ్యుతి జరుగుతుంది. ధర్మ సంకేతమైన గోవు ఒంటికాలి మీద కుంటుతోంది. పాపం పండే రోజు వస్తుంది. శ్రీమహావిష్ణువు కల్కి అవతారం యెత్తి దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ చేస్తాడు. (20వ శతాబ్ది అంతానికి కలిపురుషుడు వస్తున్నాడని కొందరు సంప్రదాయవాదులు అంటూ వుంటే, కాదనీ యీ లెక్క తప్పనీ మరి కొందరు సనాతన పండితులు అంటున్నారు. యేమైనా దీనికి దాఖలా కాలమే.) క్రైస్తవ మతంలో క్రీస్తు మళ్లీ వస్తాడు. (ఇటీవలి కాలంలో క్రీస్తు పునరాగమనం గురించిన ప్రచారం యెక్కువగా సాగుతోంది.) జనం మాత్రం నమ్మకాల ఊబిలో కూరుకుపోయి గంగవెర్రులెత్తి పోతున్నారు.

ప్రాచీన జీవిత దృక్పథంలో కాలాన్ని చక్రభ్రమణ రీతిలో భావించేరనీ, దీనికి భిన్నంగా కాలం రేఖలా సాగుతుందన్నది ఆధునిక దృష్టి అనీ చూశాం. రుతుచక్ర భ్రమణాన్ని సారూప్యంగా తీసుకుని కాలచక్రం అన్న భావన పొడుకుంది. అలాగే యాంత్రిక భౌతిక వాద దృక్పథం జీవితంలో విస్తరించినప్పుడు కాలాన్ని యంత్రంలా పరిగణించడం వచ్చింది. కాల చక్రం బదులు కాలయంత్రం వచ్చింది. యిది యాంత్రిక భౌతిక వాద దృష్టి ప్రతిఫలనం. ప్రపంచాన్ని ఓ పెద్ద యంత్రంగా చూడడం యీ ప్రతిపాదనలోని ముఖ్య అంశం. యంత్ర నాగరికత పరిఢవిల్లుతూ వున్న దశలో యీ దృష్టి ప్రబలింది. లామెత్రే "మనిషి యంత్రం" అని ఓ గ్రంథమే రాశేడు. మనిషి యంత్రం. ఆవులు, గేదెలు పాలిచ్చే యంత్రాలు. యిలాంటి దృష్టి. అయితే మనుషులు కొంచెం చిక్కుగా

వుండే యంత్రాలు. యిలాంటి వైఖరితో కాలాన్ని దర్శించేటప్పుడు కాలమూ యంత్రమే. యీ యాంత్రిక భౌతిక వాదదృష్టి ప్రకారం వస్తువుల్లో మార్పు అయితే వుంటుంది. కాని ఆ మార్పువల్ల కొత్తది రాదు. అదే చర్యలు మళ్లీ తిరిగి జరుగుతూ వుంటాయి. గడియారం ముల్లు తిరిగి నిముషాలు గంటలు మారతాయి. కాని మళ్లీ అదే క్రమం. (యీ దృష్టితోనే 'డూమ్స్‌డే' అంతిమతీర్పు దినం లాంటివి రూపు తీసుకున్నాయి.) యిక్కడ పురోగమనం అన్న దృష్టే వుండదు. అన్ని యంత్రాల లాగానే మనిషీ యంత్ర మైనప్పుడు మనిషి చైతన్యం పాత్ర యేమీ వుండదు. యిదీ యాంత్రిక భౌతిక వాద దృష్టిలో వున్న ప్రధాన లోపం.

యీ చక్రభ్రమణ, యాంత్రిక భౌతిక వాద ధోరణులకి భిన్నమైంది చారిత్రక, భౌతిక వాద దృష్టి. దీన్నే గతితార్కిక భౌతిక వాద దృష్టి అంటారు. ఇక్కడ చరిత్ర పురోగమన శీలంగా వుంటుంది. చక్రభ్రమణ, జడవాద దృక్పథం ప్రకారం స్వర్ణయుగం, ఈడెన్ వన స్వర్గధామం గతంలో యెప్పుడో గడిచిపోయేయి. రాను రాను క్షీణించిపోయి, ధర్మచ్యుతి జరిగి ప్రళయం ముంచెత్తుతుంది. మొత్తంమీద పతనం, మానవ వినాశనం తప్పవు అనే దృష్టి పోతుంది. చారిత్రక భౌతిక వాద దృష్ట్యా స్వర్ణయుగం అనేది గతంలో యెన్నడూ లేదు. ధర్మాన్నీ, సాంఘిక న్యాయాన్నీ మీరి ప్రవర్తించడం వల్ల మనిషికి కష్టాలూ, కన్నీళ్లూ రావడం లేదు. కష్టాలూ, కన్నీళ్లూ వచ్చేటట్టు ధర్మం, సాంఘిక న్యాయం ఆచరణలో తప్పిపోవడం వల్ల యీ స్థితి వచ్చింది అంచేత మళ్లీ సాంఘిక న్యాయాన్ని స్థాపించాలి. అప్పుడు మళ్లీ మానవు లందరూ మంచి రోజులు దర్శిస్తారు. అసలైన స్వర్ణయుగం భవిష్యత్తులోనే వుంది.

కాలాన్ని చక్రభ్రమణ దృష్టితో చూసే రోజుల్లో మోక్షం సాధించుకునే ప్రయత్నమే ప్రాథమ్య క్రమంలో వుండేది. ఆ లక్ష్యం దిశలోనే లగ్నమై మానవ ప్రయత్నాలు సాగేవి. "ఘోర సంసార వికార సంతమస జాల విజృంభము" (నన్నయ - ఆది) బాపుకోవడమే (సంసారం అనే మహాంధకారాన్ని, మహామోహాన్ని) జీవిత లక్ష్యంగా వుండేది. యిది ఆ జీవిత దర్శనానికి అనురూపంగానే వుండింది. కాలచక్రం అలా సాగింది. ఆ కాల ధర్మం అదీ.

పెట్టుబడిదారీ యుగం వచ్చింది. కాలచక్రంపోయి కాలయంత్రం అన్న భావన వచ్చింది. యంత్రాలు లాభాలు తెచ్చిపెట్టాలి. ప్రతీదీ డబ్బుతో

పుస్తె ముడి వేసుకుంది. మనిషికీ మనిషికీ మధ్య నగ్న పాశవిక నగదు సంబంధాలు తప్ప మరే విలువలూ వుండేందుకు సందులేదు. కాలం కూడా అంతే. బెంజమిన్ ఫ్రాంక్లిన్ "Time is money" (కాలం అంటే డబ్బే) అని చాటి, కాలం పట్ల ఆధునిక వ్యాపార దృష్టిని సుస్థిరం చేశాడు. అప్పట్లో సోవియట్ యూనియన్‌ని సందర్శించడానికి చాలా మంది అమెరికన్లు వెళ్ళేవాళ్లు. అక్కడి క్యూలు, సరుకుల వేటలో జనం వెంపర్లాడ్డం చూసి 'యెంత సమయం వృధా చేస్తున్నారు! క్యూలలో, యింత టైమ్ సరుకుల వేటలో గడపడం యెంత నష్టం!' (డబ్బు రీత్యా) అని మహాబాధపడిపోయేవాళ్లు. వాళ్ల వ్యాఖ్యానాల్లోని సామంజస్యాన్ని గురించి ప్రస్తావించడం లేదు. టైమ్‌కీ డబ్బు లాభ నష్టాలకీ వున్న సంబంధ భావనని వ్యక్తం చెయ్యడమే ప్రస్తుతాంశం. చాలా పెద్ద పెద్ద కంపెనీలు ఆఫీసు సిబ్బందికి వాళ్ల వాళ్ల సీట్ల దగ్గరే కాఫీలు, టీలు, ఫలహారాలు సరఫరా చేస్తూ వుంటాయి. సబ్సిడీ యిచ్చో, నామ మాత్రం సొమ్ము వసూలు చేసో భోజనాలు అందిస్తూ వుంటాయి. భారతదేశం లాంటి పేద దేశంలో అయితే సిబ్బంది, ఆ విషయాలని ఘనంగా చెప్పుకుని "కంపెనీల" ఔదార్యాన్ని పొగిడి మురిసిపోతూ వుండడం కనిపిస్తుంది. అసలు విషయం ఆయా పనుల కోసం సిబ్బంది సమయాన్ని వృధా చేసి ఉత్పత్తికి నష్టం కలిగించ కూడదన్నదే. దీన్నంతట్నీ టైమ్ మేనేజ్‌మెంట్ కింద లెక్క గడతారు. సమయాన్ని ప్రయోజనాబద్ధంగా వినియోగించు కోవలసి వున్న మాట నిజమే. యిక్కడ ప్రధాన ప్రేరణ పెట్టుబడి – టైమ్ – లాభం అన్నదే. పని కార్యకలాపాల విషయంలో వర్తించే యీ బాపతు కాల భావనే కుటుంబ సంబంధాల విషయంలోనూ వర్తిస్తుంది. ఒక సామాన్య ఉద్యోగి వారంలో ఉదయం నుంచి సాయంత్రం దాకా పని చేసి యింటికి తిరిగి వచ్చేటప్పటికే పూర్తిగా సొమ్మసిలిపోతాడు. కుటుంబంతో గడిపే వ్యవధే వుండదు. ఏదన్నా సెలవు రోజున కొంచెం వెసులుబాటు లభిస్తే అది కాస్తా యే చిన్న సాంఘిక కార్యకలాపానికో ఖర్చయి పోతుంది. లేకపోతే యీ వారం రోజులుగానూ పేరుకున్న యింటి పనులకి సరిపోతుంది. భార్య భర్త – యిద్దరూ ఉద్యోగాలలో వుంటే పిల్లల పెంపకం, చదువు సంధ్యల అజమాయిషీ సమస్యలవుతాయి. అందుకని యే హాస్టల్లోనో చేర్చడం, వారం పది రోజులకోమాటు చూడ్డానికి వెళ్లడం, వారం రోజుల ప్రేమా

అతిగా ఒలక బోయ్యడం - యివన్నీ సాంఘికంగా తలెత్తే సమస్యలు. పెద్ద ఆర్జనలు, కార్లు, వినిమయ వస్తువుల మీద మోజులాంటివన్నీ కృత్రిమ విలువల్ని సృష్టిస్తున్నాయి. యీ వస్తువుల మోజులో, యీ 'కన్స్యూమరిజమ్' మరీచికల వేటలో కుటుంబ సంబంధాలు, ముఖ్యంగా మానవ సంబంధాలు బలై పోతున్నాయి. అందుకనే ఆధునిక పెట్టుబడిదారీ కాల గణనలో "జీవితం యాంత్రికం అయిపోయింది. భార్యాభర్తల సంబంధాలు, కుటుంబ సంబంధాలు, మనుషుల మధ్య సామాజిక సంబంధాలు యంత్రవతుగా తయారవుతున్నా"యన్న మూలుగులు వినిపిస్తున్నాయి. పూర్వం బానిసలతో ఉత్పత్తి చేయించుకునేవాళ్లు యివాళ "డబ్బు" కి ఐచ్ఛికంగా బానిసలైనవాళ్లతో ఉత్పత్తి సాగుతోంది. (ఉద్యోగాల్లో వున్న యిల్లాళ్లు, పురుషులు, పిల్లల సంరక్షణలు లాంటి విషయాలలో యెలాంటి చిక్కులు యెదుర్కొంటున్నారో, వేదనలు భరిస్తున్నారో తెలుపుతూ యిటీవలి కాలంలో పత్రికల్లో చాలా వ్యాసాలు వచ్చేయి). ఇంతకీ యిక్కడ ప్రస్తుతాంశం కాలాన్ని డబ్బుగా చూడ్డం.

యీ నేపథ్యంలో సమాజం ఎలా పరిణమిస్తున్నదీ కళ్లకు కట్టినట్లు కనిపిస్తూనే వుంది. కాలమే డబ్బు - డబ్బే కాలం అనే రీతిలో జీవితాన్ని చూసేటప్పుడు డబ్బు రూపేణా లాభం వస్తున్నా, మానవత్వపు విలువలు పతనం అవడం ద్వారా నష్టం కలుగుతోంది. పెట్టుబడిదారీ దృష్టిలో యేది లాభ దాయకం అయితే అదే ముందు. డబ్బు కూడబెట్టేందుకు ఉపకరించే ఏదైనా దిగదుడుపు లేనిదే. సామర్థ్యం, నైపుణ్యం, ముందుకు పోవడం, వేగం - యివన్నీ కొల బద్దలు అయేయి. పోటీ - సర్వరంగాల్లోనూ పోటీ. యీ పరుగులో సంవత్సరాలు నెలలై పోతున్నాయి. యిక గంటల, నిముషాల సంగతి చెప్పనే అఖ్ఖర్లేదు. దీనికి తోడు ఆధునిక ప్రసార, ప్రచార సాధనాలు విస్తరించడంతో ప్రపంచం - వైకుంఠం కాదు - అరచేతిలో యిమిడి పోయేట్టు అయింది. దీంతో సాంస్కృతికంగా కూడా దారులు "చదునై" పోతున్నాయి. యీ పోటీ, యీ పరుగు, యీ వేగం, యీ ముందుకు పోవడం సాంఘికంగా కాదు. సమాజశ్రేయస్సు కోసమూ కాదు. శుద్ధ వ్యక్తిగత పరిధిలో, సొంత లాభం కోసం, అన్నిట్నీ సొంతం చేసుకోవడం కోసం. ఆధునిక సమాజం ప్రసాదించిన "వరాల్లో" కాలాన్ని మార్కెట్‌కి తాకట్టు పెట్టడం ఒకటి.

ఈ పరిధిని భావనాత్మక రంగానికి విస్తరింపచేసి "పోస్ట్ మోడర్నిజమ్" అనే పేరుతో వ్యవహరిస్తున్నారు. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాల్లో పెరిగిన యీ భావనలు వర్ధమాన దేశాలలో కూడా అంది పుచ్చుకుని వంత పాడుతున్నారు. భారతదేశంలో కూడా యీ ధోరణి విస్తరిస్తోంది. ఆంధ్రదేశంలో కూడా "అధునికానంతర", "అత్యాధునిక" "అంటూ హోరతులు పట్టేస్తున్నారు. పాత కాలపు కుల, మత, శాఖా భేదాల కలుపు మొక్కలకి నీరు పోసిపెంచి పబ్బం గడుపుకునే పరిస్థితులే యింకా కొనసాగే భారతదేశంలో, గుళ్లు కట్టడం గోపురాలు కూల్చడం ఘనకార్యమై రాజకీయ పబ్బం గడపుకునే భారతదేశంలో ఆధునిక దృష్టి అలవడలేదు. యిక అధునికానంతర యేమిటి? యిక్కడి భౌతిక పరిస్థితులకీ యీ భావనలకీ పొంతన వుందా? అనే ఆలోచనలే లేవు. కాని "బహుళజాతి" కంపెనీ సమాజాల నాగరికత ఉపదేశించే తిరుమంత్రాన్ని పారాయణ చేసే వాళ్లకి అసలలాంటి ఆలోచనలు వచ్చే అవకాశమూ లేదు. అవసరమూ లేదు. పెట్టుబడీదారీ – సామ్రాజ్యవాద నాగరికతలో సకల సంబంధాలూ డబ్బుమయం. అయితే "అధునికానంతర" మని వ్యవహరించే నయావలస వాద ప్రపంచీకరణ నాగరికతలో సకల విలువలకీ అదే జాడ్యం అంటుకుంది. సాంస్కృతికంగా 'చదును' అవడం యిక్కడ ముఖ్య లక్షణం. కాలాన్ని యీ తీరులోనే పరిగణించడం యిక్కడ ముఖ్య అంశం. "ప్రపంచీకరణం" – అంతర్జాతీయం అనేది పోయింది; సార్వజనీనం లేదా విశ్వజనీనం పోయేయి; బహుశా అక్కడ కొన్నైనా విలువలు అంతర్లీనంగా వుంటాయనేమో – జరిపించేటప్పుడు ముందుకు పోవడం (యిక్కడా పురోగమనం అనే పదాన్ని వాడడం లేదు) విలువలు, సంబంధాలు అన్నీ "పాతకాలపు ఉత్పత్తి సరకులే." వినిమయ సంస్కృతి విస్తృతం అయేటప్పుడు పాత సరకుల్లాగానే వీటినీ "అవతల పారెయ్యాలి." సిద్ధాంతాలనేవి, ఆదర్శాలనేవి శుష్కమైనవి. దీనికీ నియతి వుండ కూడదు. వ్యాపార రీత్యా ఏదన్నా లబ్ధి వుంటుందా? ఉంటే దుమ్ముదులిపి వాడండి. లేకపోతే అవతల పారెయ్యండి. యివాళ రాజకీయాలు సిద్ధాంత రాహిత్యంతో "ప్రకాశిస్తూ వుండడానికి" రాజకీయాలు పెద్ద వ్యాపారం కావడమే కారణం. యిలా సకల సిద్ధాంతాల్నీ, విలువల్నీ "అవతల పారెయ్యడం" యీ "అధుని కానంతర" కాల భావన ధోరణి. అవతల పారెయ్యడమే కాదు, యే సిద్ధాంతాలనీ విలువలనీ ఆదర్శాలనీ అంటిపెట్టుకుని వుండకూడదు, అలా

అంటి పెట్టుకుని వుండడం "ఆటవికం" కూడా. యిటీవల కొంత కాలందాకా "వినిమయ సంస్కృతే" (పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానంలోని కాల భావనల వల్ల పుట్టింది) అన్నిట్నీ ఆవరించుకుంటోందని దాన్ని వ్యతిరేకించే పోరాటం కొనసాగింది. యిప్పుడు దాన్ని దాటిపోయి అన్నిట్నీ సరుకుల లాగానే పరిగణించి, వాడుకున్నాక 'అవతల పారెయ్యి' అనే ధోరణి అలముకుంటోంది. దీనికి వ్యతిరేకంగా యింకెంత పోరాటం చెయ్యాలో ఆలోచించాలి. పోరాటం చెయ్యాలన్న గుర్తింపు వుండడమే ఆధునికానంతర ధోరణికి వ్యతిరేకం!

వైయక్తిక, కుటుంబ, సాంఘిక సంబంధాలలో యీ పరిణామం నయావలస మార్కెట్ ప్రపంచీకరణ ధోరణి వల్ల వచ్చింది. కాలం పట్ల "వినిమయ" ధోరణి ప్రబలమైనదాని ఫలితంగా దీన్ని చెప్పుకోవచ్చు.

కాలాన్ని పురోగామి దృక్పథంతో చూసే విలువల్ని నిలబెడితే యీ దిగజారుడు తత్వం తగ్గుతుంది. ఆ దృక్పథమే గతితార్కిక భౌతిక వాద దృష్టి. దీన్నే గతితార్కిక చారిత్రక భౌతికవాదం అంటారు. ఆదిమ భౌతికవాదం కంటే, యాంత్రిక భౌతికవాదం కంటే యిది పురోగమన శీలమైన దృష్టి.

గతితార్కిక చారిత్రక భౌతిక వాద దృష్టి – యిదే మార్క్సిస్టు జీవిత దర్శన – కాలాన్ని పురోగమన శీలంగా వివరిస్తుంది. కాలం చక్రభ్రమణంలోనూ వుండదు, యంత్రవతుగానూ నడవదు. కాలం ముందుకు, ముందుకే సాగుతూ వుంటుంది. దేశం (Space), కాలం (Time) పదార్థచలనానికి సంబంధించే వుంటాయి. పదార్థం, చలనం దేశానికీ కాలానికీ యేదో బాహ్య సంబంధంతో వుండేవి మాత్రమే కాదు. చలన మనేది దేశ కాలాల అంతస్సారం. తత్ఫలితంగా పదార్థం, చలనం, కాలం, దేశం పరస్పరం అంతర్గత సంబంధంతో విడదీయలేనివిగా వుంటాయి. ఆధునిక శాస్త్ర విజ్ఞానం వల్ల యిది రుజువవుతోంది. ఐన్‌స్టయిన్ సాపేక్ష సిద్ధాంతం వల్ల కాలమూ, దేశమూ పదార్థానికి విడిగా వాటంతట అవే వుండవనీ, ఒక సార్వజనీన అంతస్సంబంధంతో వుంటాయనీ రుజువవుతోంది. యీ సార్వజనీన అంతస్సంబంధంలో వాటి స్వతంత్ర అస్తిత్వం లుప్తమవుతుంది. కాలగతి, వస్తువ్యాప్తి అవియేవేగంతో చలనంలో వుంటాయో దానిమీద ఆధారపడివుంటాయి. శాస్త్రజ్ఞానం అభివృద్ధి చెందే కొద్దీ దేశ కాలాల గురించిన భావనలు మరింత గాఢం అవుతాయి.

కాలాన్ని యిలాంటి శాస్త్రీయదృష్టితో పరిశీలించడం ఆధునిక శాస్త్ర యుగలక్షణం. దీనివల్ల వనరుల లభ్యమానస్థితి, వాటిని వినియోగపరచుకునే యోజన, ఉత్పత్తి ప్రణాళిక లాంటి వన్నీ సాధ్యమవుతాయి. అదనపు విలువ ఉత్పత్తికి సంబంధించి గట్టి పునాది మీద ఆధారపడిన విశ్లేషణ అందుతుంది. అదనపు విలువ ఉత్పత్తిలో (రోజుకి పది గంటలు, ఎనిమిది గంటలు పనిసమయం వుండాలని కార్మికవర్గం ఆందోళన చేసిన రోజుల్ని గుర్తుకు తెచ్చుకోండి) కాలం యెంత ప్రాముఖ్యం సంతరించుకుంటుందో శాస్త్రీయంగా రుజువు లభిస్తుంది. దీన్ని బట్టి జీవితంలోని సకల పార్శ్వాలలోనూ – కుటుంబ సంబంధాలలో సామాజిక సంబంధాలలో – యెన్నో మార్పులు చోటుచేసుకుంటాయి. "టైమ్ యీజ్ మనీ" అన్న పెట్టుబడిదారీ పాలనాత్మక సూత్రం వల్ల కుటుంబ, సామాజిక సంబంధాలు యెంత యంత్రవతుగా వున్నదీ తేట తెల్లంగానే వుంది. 'టైమ్ యీజ్ మనీ', కాలమే డబ్బు. కాలమే సంపదని పోగుచేస్తుంది. సంచితం చేస్తుంది అనే దాన్ని వ్యక్తిగత లాభాపేక్షతో అమలు పరచడం బదులు, సాంఘికంగా వినియోగపడే సంపద సంచితం చెయ్యడానికి విస్తరిస్తారు. యీ నయావలస కర్కశ సంబంధాల నుంచి విముక్తి చేసిన జీవ సంబంధాలు పాదుకుని, వికసించేందుకు ప్రాతిపదిక యేర్పడుతుంది. ఇది సామాజికంగా కాలాన్ని నియంత్రించే పద్ధతికి దారి.

కాలం చక్రభ్రమణంలో వుంటుందని భావించినా, యాంత్రిక భౌతిక వాద దృష్టితో యంత్రంలా సాగుతూ వుందని భావించినా, పురోగామి గతితార్కిక భౌతిక వాద దృష్టితో ముందుకు సాగుతూ వుంటుందని వివరించినా మానవుల అనుభవంలోవున్న కాలాన్ని కొలవడం సంగతి వుండనే వుంది. 'బ్రహ్మసత్యం జగన్మిథ్యా' అని వేదాంతం వల్లించే వాళ్లు కూడా ఆ రోజు తిథియేమిటో సంకల్పంలో చెప్పుకుంటూనే వుంటారు. పారలౌకిక పారమార్థిక భావాల ముసుగుని యెన్ని పొరలతో కప్పినా లౌకిక వ్యవహారానికి వచ్చేటప్పటికి యదార్థవిషయాల పరిశీలనాపరమైన భౌతిక దృష్టి తప్పనిసరి. రాత్రి, పగలు, సూర్యోదయం, సూర్యాస్తమయం చంద్రుడు క్రమేపీ కళలు పెరగడం, మళ్లీ క్షీణించడం లాంటి వన్నీ భౌతికంగా కనిపించే విషయాలు. మబ్బులు కమ్మితే సూర్యుడు కనిపించడు. సూర్యుడు కనిపించని రోజు దుర్దినం అనీ, చంద్రుడు లేని అమావాస్య రాత్రి అరిష్టమనీ నమ్మకాలు పెంచుకోవడం వేరే విషయం. ఆ నమ్మకాల సాంఘిక పునాది వేరు. కాని అసలు యదార్థంలో రాత్రి, పగలు కనిపిస్తూనే

వున్నాయి కదా! అలాగే ఓసారి పేల్చేసే యెండలు, ఓసారి "ఊళ్లూ బీళ్లూ ఏకం చేసే" వర్షాలు, ఓసారి గజగజ లాడించే చలిరోజులు, ఓసారి వరదలు ముంచెత్తడం, ఓసారి నీటిచుక్క లేకుండా ఎండిపోవడం లాంటివన్నీ శుద్ధ ప్రాపంచిక విషయాలుగా కనిపిస్తూనే వున్నాయి. వీటన్నిటి గురించి విషయ జ్ఞానం సంపాదించడం అవసరం. లోక వ్యవహారంలో "వార్తయందు జగము వర్తిల్లు చున్నది. వార్త నిర్వహింపవలయు బతికి" అన్న రాజ్యనీతికి రాజ్యపాలకులంతా బద్ధులే. (వార్త అంటే కుసీద, వాణిజ్య, గోరక్షలని. యివి వేదవేదాంగేది త్రయీ విద్యలకి భిన్నం. కుసీదమంటే వడ్డీవ్యాపారం. వార్త అంటే సమాచారం, చతురోక్తి లాంటి అర్థాలూ వున్నాయి. కాని నన్నయగారి నారద రాజనీతిలో ప్రసక్తమైన వార్త అంటే పైన చెప్పుకున్న వాణిజ్య, గోరక్షలే. నన్నయ గారి పద్యాన్ని ఉల్లేఖించుకుని 'వార్త' అనే పదాన్ని సరిగా ప్రయోగించలేని అజ్ఞానాన్ని ప్రదర్శించుకోవడం కనిపిస్తోంది.) అంచేత యిక్కడ చెప్పుకోవాల్సింది లౌకిక వ్యవహారంలో చుట్టూతా వున్న విషయాల గురించిన 'భౌతిక జ్ఞానం' అవసరం. యీ రకంగా కాలాన్ని అంటే వ్యవహారంలో వున్న కాలాన్ని మనుషుల అవసరాల దృష్ట్యా గణించడం తప్పనిసరి అయింది.

పైన చెప్పుకున్న చక్రభ్రమణాది కాలదర్శనలన్నీ తాత్వికంగా కాలం గురించిన భావనలు. ఇప్పుడు మనం చూడవలసింది వ్యవహారంలో వున్న కాలాన్ని గణించడం గురించి, దివారాత్రాలు, పక్షాలు, మాసాలు, ఆయనాలు, సంవత్సరాలు. ఇక ఆపైన పేరుకున్న యుగాలు, మన్వంతరాలు, కల్పాలు వగైరా కల్పనలు.

దివారాత్రాలు భూమి పరిభ్రమణం బట్టి యేర్పడతాయి. చంద్రుని గతిని బట్టి మాసాలు. సూర్యుని చుట్టూ భూమి పరిభ్రమించడం బట్టి ఆయనాలు, సంవత్సరాలు గణనకొచ్చేయి. ఇలా లెక్కలు కట్టాలంటే ఖగోళశాస్త్రం, గణితం బాగా అవగాహనలో వుండాలి. వ్యవసాయం నీటి పారుదల మీద ఆధారపడుతుంది. కాబట్టి నదులకి నీళ్లు యెప్పుడు వరదగా వస్తాయో, నదుల్లో నీరు యెప్పుడు యెండిపోతుందో తెలిసి వుండాలి. యీ జ్ఞానం సంపాదించడానికి భూమిని, చంద్రుణ్ణీ, సూర్యుణ్ణీ, నక్షత్రాల్ని బాగా పరిశీలించాలి. వాటి గతిని బట్టే భూమ్మీద యీ రకమైన కాలం మార్పులు వస్తున్నాయి. ఖగోళ శాస్త్రజ్ఞులు సంపాదించిన శాస్త్రీయమైన విజ్ఞానమే ఖగోళ విజ్ఞాన శాస్త్రం. దీనికి గణిత శాస్త్రం పునాది.

ఖగోళమంటే ఆకాశగోళం(?) అని ఖగోళశాస్త్రం అంటే తత్సం బంధమైన జ్ఞానాన్ని అందించేది అనీ అర్థాలు చెపుతున్నారు. ఇంగ్లీషులో 'ఆస్ట్రానమీ.' జ్యోతిశ్శాస్త్రం అంటే కూడా "సూర్యాదిగ్రహ నక్షత్ర సంచారమును తెలియచేయు శాస్త్రము" అని నిఘంటువులు అర్థం చెపుతున్నాయి. ఖద్యోతుడు జ్యోతి అనే రెండు పదాలకీ సూర్యుడు అనే అర్థం. జ్యోతిషం, జ్యోతిశ్శాస్త్రం వేర్వేరు. మొదటిది వేదాంగాలలో ఒకటి. రెండవది ఆయా గ్రహ సంచారాలని తెలియచేస్తుంది.

ఖగోళశాస్త్రం గురించిన పరిశీలనకి బహుశా మొదట 'జ్యోతిష వేదాంగమే' ఆధారమైవుండాలి. ఇది క్రీ. పూ. 500 నాటిది. ప్రస్తుతం యిది సంక్షిప్తంగా వుందనీ, భ్రష్టమైవుందనీ అంటున్నారు. ఇరవై యేడు నక్షత్రాలలో చంద్రుడి స్థానాన్ని బట్టి పౌర్ణమి, అమావాస్య యెలా యేర్పడుతున్నాయో లెక్కగట్టడం గురించి యిందులో వుంది. అయిదు సంవత్సరాల కాలం ఒక భ్రమణం పూర్తయేటప్పుడు యేర్పడే ఆయనాల గురించిన విషయం వుంది. యీ సంవత్సరాలలో ఒకటి 366 రోజులది. (ఆర్యభట్టు ఒక సంవత్సరంలో, అంటే సౌర సంవత్సరంలో, 365.358 రోజులు అని, భూమి గోళమనీ, తన అక్షం మీది సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తూ వుంటుందనీ చెప్పాడు. ఆర్యభట్టు క్రీ. శ. 499 నాటివాడు). అయిదు సౌర సంవత్సరాలలో 67 చంద్ర మాసాలుంటాయి. పూర్వకాలంలో నక్షత్ర గణనకి విశేష ప్రాముఖ్యం వుండేది. ఫిన్నిష్ భాషా శాస్త్రవేత్తలు యిటీవలి కాలంలో సింధు నాగరికత గురించి గాఢంగా అధ్యయనం చేశారు. సింధు నాగరికత నాటి లిపి యింకా గూఢంగానే మిగిలి పోయింది. అయితే అధునిక సాంకేతిక పరిజ్ఞానంతో ఆ లిపిని ఛేదించ ప్రయత్నించేరు. వాళ్ల అధ్యయనాలని బట్టి నక్షత్రాలు హరప్పా నాటి వన్న సూచన వచ్చింది. అలాగే అయిదు గ్రహాల పేర్లు ద్రవిడ సంబంధమైనవనీ, వాటిరంగుని బట్టి వాటి పేర్లు వచ్చేయని అంటున్నారు. (అంగారకుడు ఎర్రనక్షత్రం) యీ పరికల్పన స్థిరమైతే గనక నక్షత్రాలు భారతదేశ ఆవిష్కరణ అని సాంప్రదాయకంగా వున్న అభిప్రాయం నిలదొక్కుకుంటుంది. (అస్కొ పార్పొలా, "అన్నల్స్ అకాడమియే సైంటి యరమ్ ఫిన్నికే.) నక్షత్రాల్ని బట్టి సూర్యచంద్ర పరిభ్రమణాలని నిర్ణయించేవారు. దీన్ని బట్టే గ్రహణాలని, నదులకి వరదలు వచ్చే కాలాన్ని, ఋతువులని లెక్కగట్టేరు. సౌర చాంద్రమాన గణన ప్రాచీనం. దీన్ని భారతదేశంలో విస్తృతంగా వాడేవాళ్లు. జైనసాహిత్యంలోనూ యిది

కనిపిస్తుంది. నక్షత్రాల గురించిన తొలిప్రస్తావన తైత్తరీయ సంహితలో వుంది. యీ తైత్తరీయ సంహిత బ్రాహ్మణాలకి దగ్గరి కాలం నాటిది. ఇందులో నక్షత్రాల పేర్లు వున్నాయి. అంటే క్రీ. పూ. ఎనిమిది, ఏడు శతాబ్దాల నాటికే యీ అంశం స్థిరపడిందన్న మాట. అప్పట్లో యజ్ఞయాగాది క్రతువులు ప్రధానంగా వుండేవి. మొదట్లో అకలంక సారళ్యంతో వుండే యీ క్రతువులు రాను రాను చట్రంలో బిగిసి ఘనీభవించేయి. చేసే పని లక్ష్యం కంటే చేసే విధానం పట్టు బిగిసింది. కలశ, యూపస్తంభం యెందుకు పెడుతున్నామన్న దానికంటే యెలా పెట్టాలి అన్న దానికే యెక్కువ విలువ వచ్చింది. అలాగే యజ్ఞ వేదిక పరిమాణం, కొలతలులాంటి వన్నీ ముఖ్యం అయేయి. వీటన్నిటి దృష్ట్యా గణితం, ఖగోళజ్ఞానం విరిశాయి. యే నక్షత్రాల సమయంలో యే క్రతువులు ఆచరించాలో ముఖ్యం అయేయి. కాబట్టి నక్షత్ర జ్ఞానం, సూర్యచంద్రుల గతిక్రమ పరిశీలన ముఖ్యం అయేయి. కృష్ణయజుర్వేద తైత్తరీయంలో యీ విషయాల ప్రస్తావన వుంది. ఉదాహరణకి, "పునర్వస్వోరాదధీతైతద్వై పునరాధేయస్య నక్షత్రం యత్పునర్వసూ స్వ్యాయామేవైనం" అని పునర్వసు నక్షత్ర ప్రశంస వుంది ("పునర్వసూ నక్షత్రము పునరాధే యాగ్నికి సంబంధించింది. కాబట్టి పునర్వసూ నక్షత్రకాల యందగ్నిని పునరాధానం" చెయ్యాలి). యిదే విధంగా అమావాస్యనాడు పితృదేవతలకి పిండ ప్రదానం చేసే ఆచారం యిప్పటికీ శ్రోత్రియుల్లో కనిపిస్తుంది. అమావాస్యనాడే యెందుకు చెయ్యాలి? దీనికి వైదికాచారం యేమిటంటే వృత్రవధ చేసిన ఇంద్రుడు భయపడి చాలా దూరం పారిపోయేట్ట. ఆ ఇంద్రుణ్ణి యెవళ్లు వెతికి పట్టుకుంటారో వాళ్లకే మొదటి హవిర్భాగాన్ని యివ్వాలని ప్రజాపతి అన్నాడు. ప్రథమంలో పితృదేవతలు ఇంద్రుణ్ణి వెతికి పట్టుకున్నారు. అందుకని వాళ్లకి పిండ పితృయజ్ఞం చేస్తారు. దర్శ యాగ దేవతలకు అమావాస్య ఆరంభం. కాని పాడ్యమి రోజున ఆ యాగం చేస్తారు. దానికి ముందురోజు అమావాస్య కాబట్టి పితృదేవతలకు ఆ రోజే పిండదానం (అదే హవిర్భాగం) చేస్తారు. అలాగే చిత్ర యామమనే ఒక యాగంలో సినీవాలి దేవతకు హవిస్సు నివ్వడం వుంది. "సినీవాలి దేవత కోసం చరు రూప హవిస్సుని ఉంచాలి. సినీవాలి వాక్స్వరూపిణి కనుక సినీవాలి దేవతాక హవిస్సు వాక్పుష్టి హేతు వగుచున్నది." (తైత్తరీయం) సినీవాలి అంటే చంద్రకళతో వున్న అమావాస్య అని తైత్తరీయ పారిభాషిక అర్థం. సినీ చంద్ర కళా సాచాలా అస్యామితి – సినీవాలి. చంద్ర కళలేని

అమావాస్యకి కుహూః అని పేరు. తైత్తరీయంలో యీ ప్రస్తావనా వుంది. యింత వివరంగా తైత్తరీయం నుంచి యీ విశేషాలు ప్రస్తావించుకుందుకు కారణం యేమిటంటే – నక్షత్రాలు అమావాస్య పౌర్ణిమలు అనాటి జీవితంలో యెంతటి ప్రాముఖ్యం సంతరించు కున్నాయో తెలుసుకుందుకే. యిలాంటి కాలగణనకి సూర్య చంద్ర గ్రహగతులు తెలిసి వుండడం అత్యవసరం. భారతదేశంలో సౌరమాన చాంద్రమాన ప్రాచీన పద్ధతులు అమల్లో వున్నాయి. ప్రాచీన కాలంలో ఖగోళ పరిజ్ఞానానికి సంబంధించి మూడు స్వతంత్ర పద్ధతులున్నాయని పండితులంటున్నారు. ఈజిప్టులోని డెకాన్ (Decans) మెసపొటేమియా జోడయిక్ (Zodoic) చంద్రభ్రమణ గతిని బట్టి వుండేవి. చంద్రుడు ఒక పరిభ్రమణంలో 27 లేక 28 స్థానాల్లో వుంటాడు. యీ స్థానాల్ని భారతదేశంలో నక్షత్రరాశి అనీ, చైనాలో సియు (Rsiu) అనీ అంటారు. యివీ వేటికవి స్వతంత్రంగానే రూపు తీసుకుని వుంటాయి. కాని ఒకే మూలాధారం నుంచి వచ్చేయని చెప్పకోవాలంటే బహుశా చంద్ర స్థానాలకి సంబంధించి క్రీ.పూ.1000 యేళ్లనాటి బాబిలోనియన్ ప్రాచీన ఖగోళశాస్త్ర పరిజ్ఞానం ఆధారమై వుండచ్చు. తర్వాత ఆభావన ఇరాన్ గుండా వ్యాప్తి చెంది వుంటుంది. వాళ్లు కోరాన్ పూర్వదశ నాటి ఇరాన్ సస్యానియన్ వారసులైవుంటారని సూచితమవుతుంది.

నక్షత్రాలకి వున్న విశేష ప్రాముఖ్యాన్ని బట్టి 27 నక్షత్రాల్లోనూ చంద్రుని స్థానాన్ని బట్టి (అమావాస్య పౌర్ణమి యేర్పడ్డం) లెక్కగట్టి సంవత్సర కాలాన్ని గణించేవారు. సూర్యగతిని బట్టి ఆయనాల ప్రాతిపదికన లెక్కగట్టేవారు. యీ ఆయనాలు అయిదేళ్ల వృత్తాల్లో – ఒకోయేడు 366 రోజుల చొప్పన యేర్పడతాయి. అయిదువేల సంవత్సరాలలో 67 చాంద్రమాసాలు. వీటిని సమంగా భావించినట్లయితే 62 సైనాడిక్ మాసాలు (ప్రతి చక్రంలో నుంచీ 31,62 మాసాల్ని వదిలిపెడితే) సైనాడిక్ అంటే ఖగోళశాస్త్రరీత్యా కలయిక సంధి. (రెండు గ్రహాలు ఆ సమయంలో కలవడం) దీన్ని యుగం అంటారు. రెండు ఘటనలు కలిసే సందర్భం. (యుగం అంటే ఎద్దుల మెడ మీద తగిలించే కాడి. కవ, ద్వయం, జత అనీ నిఘంటువుల్లో అర్థాలున్నాయి. యుగళము, యుగ్మము అనే పదాన్ని రెండు, ద్వయం అని ప్రయోగించడం వుంది.) తర్వాత కాలంలో యుగం అంటే అనేక సంవత్సరాలన్న అర్థ విస్తృతి యేర్పడింది. యీ అర్థంలోనే కృత త్రేత ద్వాపర కలియుగాలని వ్యవహరించడం

వచ్చింది. కాలాన్ని చక్రభ్రమణంలో దర్శించే సంప్రదాయంలో ఒకో యుగానికి వేల లక్షల సంవత్సరాల పరిమితులు పెట్టుకోవడంలో వింత యేమీ లేదు. ఒక మనిషి జీవిత కాలాన్ని లేక అటూ యిటూ కొన్ని తరాల కాలవ్యవధినో పరిగణనకి తీసుకుని చెపితే యీ పురాణ ప్రవచిత పరిభ్రమణాలూ, ప్రళయాలూ, పునస్సృష్టులూ రుజువులకి నిలబడే పరిస్థితి యెదురవుతుంది! అప్పుడు వీటి పునాది మట్టాలు కదులుతాయి. (క్రీ.శ. మొదటి వెయ్యేళ్లు అయ్యాక ప్రపంచానికి ప్రళయం ముంచుకొస్తుందని భయపడ్డారు. కాని మామూలుగానే కాలం సాగింది.) ఆ బెడద లేకుండా వేల వేల సంవత్సరాల పరిమితులు నిర్ణయించుకుంటే వీటి నిజానిజాల్ని గురించి అడిగేవాడు వుండడు. చెప్పేవాడు వుండడు.

యీ దృష్టితోనే మానవ కాలం, పితృ కాలం, దేవ కాలం అని కల్పించారు. మానవుల ఒక నెల పితృకాలంలో ఒక రాత్రీ, పగలూ. మనుషులకి ఒక సంవత్సరంగా వున్న కాలం దేవతలకి ఒక రాత్రి, ఒక పగలు. యిక యుగాలు, మన్వంతరాలు, కల్పాలు మామూలు ఊహలకి అందవు.

సూర్యోదయ, సూర్యాస్తమయాలని బట్టి వ్యవహారంలో వేళని లెక్కగట్టడం కాలగణనకి మూలాధారం. చంద్రుడి గతిని బట్టి తిథులు లెక్కిస్తారు. ఇలా ఒక రాత్రి, పగలు కలిపి ఒక రోజుగా సమయ విభజన చేశారు. "సూర్యసిద్ధాంత" గ్రంథంలో (రెవరెండ్ ఇ. బర్గెస్ అనువాదం) గ్రహాల సగటు పరిభ్రమణాలు, దిశస్థానం, సమయం, గ్రహణాల సమయం రాశులు లాంటి సమయ చర్చ వుంది.

గ్రహాల గురించిన పరిజ్ఞానం, కొన్ని పదబంధాలు గ్రీకుల నుంచి గ్రహించినట్టు తెలుస్తోంది. అయినా భారతీయ సంప్రదాయానికి అనుసంధించి కొన్ని సంప్రదాయాల్ని నిలబెట్టడం జరిగింది. యిందులో కాలాన్ని తిథుల ప్రకారం గణించడం కనిపిస్తుంది. యివి సగటు చాంద్రమానంలో ముప్పై వంతులకి సమానంగా వుండేది. యీ అంశం బాబిలోనియా చాంద్రమాన, గ్రహగతుల పరిశీలనకి దగ్గర. ఘడియ, విఘడియ, క్షణం అంటూ విభజించుకుని వ్యవహరించడం జరిగింది. "శతపథబ్రాహ్మణం"లో సమయాన్ని గురించి సూక్ష్మ వివరణాత్మక చర్చ వుంది. శతపథ బ్రాహ్మణం ప్రకారం ఒక రోజుకి (ఒక రాత్రి, ఒక పగలు కలిపి 50,625 భాగాలు.) అతి సూక్ష్మ విభజనని 'ప్రాణం' అన్నారు. (ఉఛ్వాస, నిశ్వాసమా?) ఇలాంటి ప్రాణాలు 15 అయితే ఒక ఇదాని అవుతుంది. పదిహేను ఇదాన్షులు ఒక క్షిప్ర, పదిహేను క్షిప్రలు

ఒక ముహూర్తం. అలాంటి ముహూర్తాలు 15 అయితే ఒక రోజు. 360 దిన రాత్రుల్లో 10,800 ముహూర్తాలుంటాయి. (యీ ముహూర్తాలని సుముహూర్తం అనీ, దుర్ముహూర్తం అనీ, వదల వలసిన వర్జ్యం అనీ పంచాంగకర్తలు సిద్ధాంతీకరించడం నమ్మకం మీద ఆధారపడిన అంశం. వాటికిగా ముహూర్తాలు చెడ్డవికావు, మరోటీ కావు)

ఇక వైయక్తిక పరిధిలో కాలం ప్రభావం భిన్న రీతులుగా వుండొచ్చు. కాలం దానికిగా అది సాగుతూవున్నా - వ్యక్తులకు అనుభవంలో అనేక రకాలుగా అనిపించవచ్చు. తత్వవేత్త కాంట్ దేశ కాలాలు స్పర్శేంద్రియ అనుభూతులని సూత్రీకరించేడు. దేశం కాలం అనేవి అనుభూతమయేటువంటివి కావు. అనుభూతి సాధకాలు. స్పర్శ జ్ఞానానికి అర్థం కలిగించేవి. దేశకాలాలు అనుభూతి గ్రాహక రీతులు. అనుభూతే ప్రధానం. ఉదాహరణకి గడియారం టిక్ టిక్ మంటూ వుంటుంది. మనం గమనించం కాని దానిమీదే దృష్టి పెట్టినప్పుడు అంతకు ముందు అదే స్థాయిలో వున్న ధ్వని ఎక్కువగా వున్నట్టు అనిపిస్తుంది. యిక్కడ కాలగమనం కంటే - దాన్ని గడియారం సూచిస్తోందంతే. మనం దృష్టి పెట్టడమే ఎక్కువ. అదే మాదిరి ఒక తల్లి చంటిబిడ్డని పక్కలో పెట్టుకుని నిద్రపోతూ వుంది. పిడుగులు పడ్డా ఆమెకి మెలుకువ రాదు. కాని చంటిబిడ్డ కేర్ మంటే చటుక్కున తుళ్లిపడి లేస్తుంది. యిక్కడా చుట్టూవున్న పరిస్థితి కాదు, ఆ మానసిక స్థితి యేర్పడ్డమే ముఖ్యం. (కండిషన్డ్ రిఫ్లెక్సెస్ వివరిస్తూ కొడవటిగంటి కుటుంబరావు గారు యిదే ఉదాహరణ యిస్తారు.) కాంట్ యీ రకంగా కాల దేశాలని విశదీకరిస్తాడు. నేడు వీటినిబట్టి మనకి కలిగే ప్రతిస్పందనలే కాలాన్ని, దేశాన్ని నిర్ణయిస్తున్నా యనగలమా? వ్యక్తులకి అనుభూతమయే విషయాలకి సంబంధించి అనేక సంక్లిష్ట హేతువులుంటాయి. (కండిషన్డ్ రిఫ్లెక్సెస్ లాంటివి) "నరులక్కద్దు, మాబోట సిద్ధులకు చలీ, వేడీ యేమిట"ని బైరాగి బుకాయిస్తాడు. అంతమాత్రంచేత చలీ, వేడీ అనేవి వస్తుతః ఉన్న గుణాలు కావంటామా? మనకి అనుభూతమయే అంశాలు అనుభూతి చెందే తీరునిబట్టి మనమీద ప్రభావం కలిగించవచ్చు. అంతమాత్రంచేత అదే ప్రామాణికం అవదు. వస్తుతః వాటి లక్షణాలనిబట్టే సామాన్యీకరణం వుంటుంది. కవికి "క్షణికమై శాశ్వతమైన" అనుభవం అని అనిపించవచ్చు. కాని అసలుకి వున్నది అన్యమైందే. అనుభూతి అలంకారికతనుబట్టి కాలాన్ని, దేశాన్ని పరిగణించలేం.

ఉదాహరణకి సంవత్సరానికి 365 రోజులని సౌరమాన పద్ధతిలో లెక్కగడుతున్నారు. కాని వాస్తవానికి ఆరు గంటల కాలం మిగిలిపోతోంది. నాలుగేళ్ళకోసారి లీప్ సంవత్సరంగా పెట్టుకుని దీన్ని సరిపెడుతున్నారు. అలాగే చాంద్రమాన పద్ధతిలో కూడా అధిక మాసంతో యీ మిగుళ్లని సర్దుతున్నారు. మన అనుభవంలోకి రానంత మాత్రాన ఆ కాలం లేనట్టు కాదుకదా? అలాగే కాలం గడపడం గురించిన స్పృహ, త్వరగా గడిచింది, నీరసంగా గడిచింది లాంటి ప్రతిస్పందనలు మనుషులు తాము లగ్నమై చేస్తున్న పనినిబట్టి వుంటున్నాయి. వేసవిలో ఉత్తరప్రాంతం వాళ్లకి పొద్దు యెక్కువసేపు కనిపిస్తోంది. శీతకట్టులో అందుకు భిన్నంగా వుంటుంది. దీనికి భూమి భ్రమణం కారణం. (23–4–98 ది హిందూ పత్రికలో 'లాంగ్ అవర్స్' అని క్వశ్చన్ కార్నర్‌లో ఓ ప్రశ్నకి వివరణ ఇచ్చారు.)

కాలాన్ని మనం వినియోగించుకోవడం కోసం దాన్ని గణిస్తున్నాం. ఐన్‌స్టయిన్ 'సాపేక్ష సిద్ధాంతం' వచ్చేక కాలం గురించీ, దేశం గురించీ మరింత శాస్త్రీయ అవగాహన పెరిగింది. (అయితే కొందరు భావవాద మేధావులు పితృకాల, దేవకాలాలు యీ సాపేక్షిక సిద్ధాంతంబట్టి వున్నట్టేనని సిద్ధాంతీకరిస్తున్నారు! కాంతివేగం ప్రమాణంలో జరిగే దానికి వర్తించే నియమాలు భూమ్మీద జరిగే వాటికి భిన్నం అన్న విషయాన్ని విస్మరించడం వల్ల యీ వక్రీకరణ వచ్చింది.) యిటీవల స్టీఫెన్ హాకింగ్ అనే మేధావి ప్రతిపాదించిన రేడియేషన్ (దీన్ని హాకింగ్ రేడియేషన్ అని పిలుస్తున్నారు) సిద్ధాంతం ప్రకారం శాస్త్ర విజ్ఞాన పురోగతిలో బృహత్పరిణామాలు రాబోతున్నాయి. కాలం గురించీ దేశం గురించీ యింకా లోతైన అవగాహన అందబోతోంది. (రెలెటివిటీకి, క్వాంటమ్ మెకానిక్స్‌కీ ఏకత సాధించడం ద్వారా దేశ-కాలాల గురించిన అవగాహనని మరింత స్పష్టమైన రీతిలో సాధించాలని ప్రయత్నం. యీ మేధావి గురించి ఏప్రియల్ 24, 1998 ఫ్రంట్‌లైన్ పత్రికలో జాన్ నోబెల్ విల్‌ఫర్డ్ విశేషాలు తెలియజేశాడు.)

అధునిక యుగంలో చాలా విషయాలకి సంబంధించి ఒక అంతర్జాతీయ ప్రామాణికత యేర్పడుతోంది. సమయాన్ని గణించడానికీ అలాగే ఒక ప్రామాణికత వస్తోంది.

స్థానికంగా యే దేశానికి వుండే సంప్రదాయం ఆ దేశానికి వున్నా, ఆ తీరులో స్థానికంగా సమయం గురించిన అవగాహనా వ్యవహారం వున్నా

సార్వజనీనంగా వర్తించే కాలమానం యేర్పడింది. గ్రీన్‌విచ్‌మీన్ టైమ్‌ని ఒక ప్రామాణికం చేశారు. యిప్పుడు 'యూనివర్సల్ కో–ఆర్డినేటెడ్ టైమ్' అని వ్యవహరిస్తున్నారు.

జీవితంలో యెన్నిటి గురించో మూఢనమ్మకాలు వున్నట్లుగానే కాలం గురించీ మూఢ నమ్మకాలు వున్నాయి. పైన చెప్పుకున్నట్టు సుముహూర్తం, దుర్ముహూర్తం అనుకోవడం, ఫలానా తిథి శుభం, ఫలానా తిధి అశుభం అనుకోవడం లాంటివన్నీ యీ బాపతులే. రానురాను పతనమే తప్ప మెరుగుదల లేదని నిరాశపడ్డమూ యీ బాపతుదే.

"కాలం అద్దంలాంటిది. అంధయుగమైనా, స్వర్ణయుగమైనా అది మన ప్రతిబింబం" అన్నాడు తిలక్. చరిత్రలో సామాజిక పరిస్థితుల ప్రతిఫలనమే ఆ యుగాల పేరుతో చేసిన వర్గీకరణ. చారిత్రక కాలగమనంలో స్వర్ణయుగం ముందే వుంది. దాన్ని సాధించేందుకు సహేతుకమైన భౌతికవాద దృష్టి కావాలి. దేశ కాలాల గురించిన శాస్త్రీయ దృష్టితో పురోగమిస్తే స్వర్ణయుగ స్వప్నాన్ని వాస్తవం చేసుకోవచ్చు.

* * *

# భారతీయ సంస్కృతి

భారతదేశం, భారత ప్రజ అనేవి ఒక భావనాత్మక ప్రతిబింబమైనవే కాని భౌతికంగా యదార్థ స్వరూపం సంతరించుకున్నవి కావు. భారతదేశంలో 'ఒక జాతీయ భాషలేదు, వర్ణమాల లేదు. పది రూపాయల కాగితం మీద ఓ డజను భాషలు, లిపులు ఉంటాయి. భారతజాతి అనేదీ లేదు. అనేక రకాల శరీర ఛాయల వాళ్ళు అందరూ భారతజాతి కిందకే వస్తారు. భారతదేశ ప్రజల భోజనం ఇదీ అని ప్రత్యేకంగా ఏమీలేదు' అని డి. డి. కోశాంబి విశ్లేషించాడు. భారతదేశం అని వ్యవహరించే ఈ భూఖండంలో కాశ్మీరు నుంచి కన్యాకుమారి దాకా, అటు అస్సాం సరిహద్దునుంచి ఇటు పంజాబ్ దాకా వున్న ప్రాంతమంతా చేరుతుంది. అసలు 1947 ఆగస్టు 15 దాకా భరత ఖండమని వ్యవహరించే ఈ భూభాగం అంతా ఒకే ఏలుబడికిందకూ రాలేదు. ఇక ఈ విశాల భూభాగంలో నివసించే ప్రజల అలవాట్లు, ఆచారాలు ఎంత వైవిధ్యపూరితంగా వుంటాయో చెప్పనే అక్కర్లేదు. ఆదిమ తెగల నుంచి 'అత్యంతాధునిక' (!) నాగరికతల దాకా యెన్ని తేడాలు వున్నాయో చెప్పనే అక్కర్లేదు.

అయితే యింత భిన్నత్వం, యింత వైవిధ్యం పైకి కనిపిస్తూ వున్నా వీటికి రెట్టింపు ఏకత్వం వుండడం ఈ దేశ ప్రత్యేకత. భౌగోళికంగా, రాజకీయంగా ఒక ఏకత అనేది అంటూ యిటీవలి దాకా లేకపోయినా యి భూభాగంలో ఒక భావనాత్మక ఏకత యేనాటి నుంచో ఒక వారసత్వంగా సంక్రమిస్తూనే వుంది.

'ఉదయం బస్తనగంబు సేతువు హిమవ్యూహం' భరతవర్ష ఏకత భావాన్ని చాటే ఎల్లలుగా వున్నాయి. వర్షం అంటే ప్రపంచ భాగం. భరత వర్షం, భరత ఖండం అని ఈనాటికీ సంప్రదాయాన్ని అనుసరించే వాళ్ళు సంకల్పంలో చెప్పుకుంటూ వుంటారు. 'కురు, హిరణ్మయి, రమ్యక, ఇలావృత, హరి, కేతు మాల, భద్రాశ్వ, కిన్నెర, భారతా'లు నవవర్షాలని సంప్రదాయ పరిగణన. గంగా కావేరీ నదుల అనుసంధానం – గంగా కావేరీ సన్నిధేకురు చేయాలన్న భావన యేనాటిదో! అలాగే

రామేశ్వరంలో సికతా గ్రహణం చేసి ఆ ఇసుకను కాశీ ప్రయాగలలో గంగలో కలపడం ఆచారం. ఇదే విధంగా భరతఖండంలో నాలుగు దిక్కులనీ చుట్టి వుండే మోక్షదాయక క్షేత్రాల్ని ప్రస్తుతించేరు.

అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ అవంతికా

పురీ ద్వారవతీ చైవ సప్తైతే మోక్షదాయికాః

అని క్షేత్రాలను సూచించారు. అవంతిక ఉజ్జయిని, మహా కాళేశ్వర స్థానం. కాశీలో విశ్వనాథుడు. ఇవి రెండు శివక్షేత్రాలు. అయోధ్య, మధుర, ద్వారక విష్ణుక్షేత్రాలు, మాయ (అంటే హరి చాపం), కంచి శక్తి క్షేత్రాలు. చిత్రమేమిటంటే, విభిన్న మత దృష్టులు పునాదిగా వున్నవైనా ఈ నగరాలన్నీ మోక్షదాయకమని చెప్పడం. ఇందులో ఒక సాంస్కృతిక ఏకత కనిపిస్తుంది. విభిన్న మత దృష్టులనడం ఒక విధంగా సమంజసం కాదేమో! యేమంటే, ఇవన్నీ 'హిందూ జీవిత దృక్పథం' లో అంతర్భాగంగానే వున్నాయి. అన్నీ సమ్మిళితమయే 'హిందూ మతం' అనే పేరుతో వ్యవహృత మవుతున్నాయి. మతమే ఒక భావానాత్మక ప్రతిఫలన. దానికి భౌతికంగా ఒక ఆకారంగాని, నిర్దిష్ట స్వరూపంగాని లేదు. అయినా భావనాత్మకంగా సమైక్య పరిచే పునాది ఒకటి ఉంటుంది. కానైతే మతం సమైక్యం చేసే పరిధి సంకుచితంగా వుంటుంది – కనీసం ఇవాళ్టి సాంఘిక నేపథ్యంలో యేమంటే, ఆ సమైక్యత ఆయా విశ్వాసాలని అనుసరించే వాళ్ళకే పరిమితమవుతుంది. పై వాళ్ళని అది దూరంగానే వుంచుతుంది. అంటే, మత నిర్మాణ చట్రంలోనే ఈ లోపం వుంది. అయితే సమైక్య పరచడమూ, వేర్పాటుగా వుంచడమూ అనేవి విరుద్ధ అంశాలు. ఇవి రెండూ ఒకేచోట ఎలా వుంటాయి అన్న శంక కలగడం సహజం. ఈ శంకకి నివృత్తిని చారిత్రక నేపథ్యంలో అన్వేషించాలి. చరిత్రలో ఆయా మతాల ఆవిర్భావ సందర్భాలని ప్రస్తావించుకోవాలి. ఒక నిర్దేశిత ప్రాంతంలోని ప్రజల్ని ఆయా చారిత్రక సన్నివేశాల్లో అప్పుడు ఆవిర్భవించిన మతాలు యేకం చేశాయి. కాని అన్య విశ్వాసాలవారు ఎదురయ్యేటప్పటికి చిక్కులు తలెత్తేయి. సెమిటెక్ మత విషయంలో జరిగింది ఇదే. యూదు మతం, క్రైస్తవ మతం, ఇస్లాం మతం తమతమ విశ్వాసాలని అనుసరించే వాళ్ళకే పెద్ద పీట వేశాయి. 'క్రూసేడ్స్' – మత యుద్ధాలు – జరిగేయి. అన్యవిశ్వాసాల వాళ్ళని హీథేన్ అన్నారు. (అంటే అన్యమత సంబంధమైన అని అర్థం. కాని, దీంతోబాటు క్రూరుడు,

అసభ్యుడు అనే అర్థాలు కూడా చేర్చారు. హీథేన్ అనే మాటని కచ్చితంగా చెప్పాలంటే క్రైస్తవులు, యూదులు, మహమ్మదీయులు కాని వాళ్లందరికీ వర్తింపచేస్తారని బ్రౌణ్యంలో వివరణ వుంది.) మత పరంగా ఇలాంటి వైఖరి భారతదేశ సంస్కృతిలో లేదు. అన్యమత విశ్వాసాల వాళ్ళని ఏ ముద్రలూ వేయకుండా చూడడం భారత సంస్కృతిలో భాగం అయింది. మత విశ్వాసాలరీత్యా స్థూలంగా 'హిందూ' విధానం అని వ్యవహృతమవుతూ వున్నా, ఇందులోనే అనేక విశ్వాసాలు, దృక్పథాలు ఇమిడి వుండంవల్ల కలిసిమెలిసి జీవించక తప్పలేదు.

భారతసంస్కృతిలోని విశిష్ట అంశం సంయోజన భావం (synthesis).

ఈ వైఖరే భారతదేశంలో ఒక ఉదార ధోరణికి పునాది అయింది. అన్యవిశ్వాసాలపట్ల సహిష్ణుత వెల్లడి అయింది. 'శూన్యవాదులు శూన్యమనీ, వేదాంతులు బ్రహ్మమనీ, సాంఖ్యులు పురుష అనీ, యోగశాఖవాళ్ళు ఈశ్వర అనీ, కాలస్సర్వస్యకారణః అని విశ్వసించేవాళ్ళు అధిసత్త్వ కాలమనీ, ఆత్మవాదులు ఆత్మ అనీ, మాధ్యమికులు సత్ అసత్ మధ్యస్థమనీ, సర్వంగా విశ్వసించే వాళ్ళు సర్వమనీ ఆపరతత్త్వాన్ని పిలుచుకుంటారని' యోగ వాశిష్ఠం చాటుతోంది.

ఇంతేకాదు, ఆ త్రిలోకేశ్వరుడైన శ్రీహరిని 'యంశైవాఃసముపాసతే శివ ఇది బ్రహ్మేతి వేదాంతినో

*బౌద్ధాఃబుద్ధ ఇతి పటవః కరేతి నైయాయికాః*

*అర్హన్ని త్యథ జైన శాసనరతాః కర్మేతిమీమాంసకాః'*

(ఎవరిని శైవులు శివుడనినీ, వేదాంతులు బ్రహ్మయనినీ బౌద్ధులు బుద్ధుడనినీ, ప్రమాణవాదులైన నైయాయికులు కర్త అనినీ, జైనులు అర్హతుడనినీ, మీమాంసకులు కర్మ అన్నినీ పిలుస్తూ వుంటారో ఆ శ్రీహరి మా కోరికలు తీర్చాలని) ప్రార్థన చేస్తూ వుంటారు. ఈ ప్రార్థన ఆధునిక పాఠంలో ఒక భక్తుడు అల్లా, యెహోవా, అహుర్ మాజ్ద...అని క్రైస్తవులు, ముస్లిమ్‌లు, యూదులు, పార్శీలు భగవన్నామాన్ని స్మరించే పేరుల్ని కలిపి ప్రార్థన రూపొందించేడని బెనారస్ హిందూ విశ్వవిద్యాలయ ఆచార్యులు బి. ఎల్. ఆత్రేయ 'భారతీయ సంస్కృతి' అన్న వ్యాసంలో రాశారు. ఇలా పరతత్త్వం ఒకటేనంటూ భావించి బోధించడం ఒక విశిష్ట అంశం.

స్మార్తుల్ తత్త్వమటంచు నెంచగ మహాశైవుల్ మనోజిద్విష
న్మూర్తింగా నుతియింప వైష్ణవులు విష్ణుండంచు నెంచన్ దశం
గర్తారుండనుచుందురుష్కులు మొదలుగా

కొలిచేది ఒకటేనని చదలవాడ మల్లయ 'విప్రనారాయణ చరిత్ర'లో వివరించేడు. 'కర్తారు' డంటే అల్లా.

ఆకాశాత్పతితంతోయం యథా గచ్ఛతిసాగరం
సర్వదేవ నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి

(ఆకాశం నుంచి పడిన నీళ్లన్నీ (నదుల ద్వారా) యెలా సముద్రంలోకి పోతున్నాయో అలాగే సర్వదేవుళ్ళకీ చేసిన నమస్కారాలు కేశవుణ్ణే చేరుకుంటాయి). ఈ భావన ఒక విశాల దృక్పథానికి ప్రతీక.

ఈ దృష్టి భారతదేశ చింతనలోని అన్ని ఆలోచనా రీతుల్లోనూ ద్యోతకమవుతూనే వుంది. వేద ప్రామాణ్యాన్ని అంగీకరించని గౌతమ బుద్ధుని, వేదమే శిరోధార్యంగా వున్న హైందవ అవతారాల్లో ఒక అవతారం చేశారు. దీనికి అగ్నిపురాణం సాక్ష్యం ఇస్తోంది (16, 1 - 4). అల్లా పేరు మీద అల్లా ఉపనిషద్‌ని సనాతన పండితులే ప్రవచించేరు. రాధాకృష్ణ పండితులు 'కమ్యూనిజా'నికి కూడా 'ఏన్ ఐడియలిస్ట్ వ్యూ ఆఫ్ లైఫ్'లో మత ప్రతిపత్తిని కలిగించేరు. ఉదయ....కుసుమాంజలిలో దైవత్వభావనని బౌద్ధులకీ చార్వాకులకీ కూడా అందించేడు. ఇక నాస్తికులకీ పీటవుంది. 'ఈశ్వరుడు లేడనుకోవడం చేత కర్మఠులకు నాస్తికులు దూష్యులయినారు గాని జ్ఞానులకు వారు దూష్యులు కారని తోచుచున్నది...నాస్తికులును ప్రపంచము ఏ స్వభావముచేత జరుగుచున్నదని అంటారో ఆ స్వభావాన్నే జ్ఞానులు పరతత్వమని అంటారు. స్వభావమనే వాచకము పరతత్వమనే వాచకమునకు భిన్నమేగాని వస్తుభేదము ఉభయుల తాత్పర్యములోను లేనట్టు తోచబడుచున్నది. గనుక నాస్తికులున్ను జ్ఞానులకు సహపాఠులేగాని వేరు కాదు' (కాశీయాత్ర చరిత్రము: ఏనుగుల వీరాస్వామయ్య).

ఈ రకంగా అనేక చింతనాధోరణులు కలగలిసి భారత సంస్కృతి రూపు తీసుకుంది. చింతనా ధోరణిలోనే కాక దైనందిన జీవిత విధానంలో కూడా అనేక తరహాల విశ్వాసాలు కలిసి ఒక ఏకత ఏర్పడింది. హరప్ప నాగరికత అంశాలూ వారసత్వంగా సంక్రమించాయి. ఆర్య సంస్కృతి చిహ్నాలూ సంక్రమించాయి. హిందూతత్వం అని పిలిచే జీవనధోరణి పూర్ణరూపం దక్షిణాది ద్రవిడ ప్రభావం, ఆర్య నాగరికత లక్షణాలూ కలిసే

ఏర్పడిందని చెప్తారు. యజ్ఞయాగాదులు ఆర్య వైదిక కర్మకాండ అయితే, విగ్రహారాధన, యోగ, దేవీ ఆరాధన (మదర్ గాడెస్) లాంటివి అనార్య నాగరికతకు చెందినవి. వైదిక దేవతలకు రూపాలు లేవు. అసలు వైదిక దేవతలు aniconic (మానవాకృతిలో లేదా జంతురూపాల్లో మలచనివి.) ఇంద్ర, వరుణ, మిత్ర లాంటి దేవతలకు రూపాలూ లేవు. విగ్రహాలూ లేవు. తరువాత విష్ణు, శివ రూపాలు వచ్చేయి. గుళ్లు గోపురాలు వేదాల్లో లేవు. ప్రతిష్ఠాపనలు, విగ్రహస్థాపనలు ఆగమ శాస్త్రరీత్యా జరుగుతూ వుంటాయి. ఈ ఆగమశాస్త్రం వేదానికి సంబంధించింది కానేకాదు. 'ఆగమ విధానం కూడా వైదికేతరమైనను వైదిక విధాన సన్నిహితమై వేదోక్త మంత్రముల కలయికతో దేవాలయములం దాచరింపబడుతున్నది' అని మల్లాది సూర్యనారాయణ శాస్త్రి రాశారు. (సంస్కృతి వాఙ్మయ చరిత్ర: ద్వితీయ సంపుటం.) చిత్రమేమిటంటే, యివాళ లేనిగుళ్లు కట్టాలనే ప్రయత్నాలు సాగడం.

అంచేత భారత సంస్కృతిలో హైందవ బ్రాహ్మణ మత దృక్పథం, బౌద్ధదర్శనం, జైనతత్వం అన్నీ కలిసేయి. ప్రపంచంలో భారతదేశం బౌద్ధమత బోధన ద్వారా గణనీయమైన స్థానం సంపాదించింది. అశోకుని నాటినుంచే విదేశాలకి బౌద్ధమతం విస్తరించినా అది యే బలప్రయోగమూ లేకుండా హింసాత్మక పద్ధతి లేకుండా అహింసాయుతంగానే సాగింది.

జైన, బౌద్ధమతాల సిద్ధాంతాన్ని బ్రాహ్మణ మతం యిముడ్చుకుంది. అహింస, శాకాహారం లాంటి వాటిని సంప్రదాయ సనాతన సిద్ధాంతం అనుసరించింది. ఇక క్రైస్తవ మత బోధకులు ఎప్పుడో క్రీ. శ. రెండవ శతాబ్దంలోనే భారతదేశం వచ్చారు. పార్శీలు తమ సొంత గడ్డ అనేది లేకపోవడంతో భారతదేశమే వాళ్ల ఆశ్రయ స్థానం అయింది. భారతదేశంలో పోరాడి జయించాలని వచ్చిన ఇస్లాంమతం కూడా సూఫీతత్వాన్ని వైష్ణవ భక్తి శాఖతో కలిపి ఒక రకమైన 'భారతీయ'తని సంతరించుకుందని సునీతీకుమార్ ఛటర్జీ 'సిగ్నిఫికేషన్ ఆఫ్ ఇండియన్ కల్చర్' అన్న వ్యాసంలో తెలియజేశారు. ఇక స్థానికంగా చూస్తే శైవ, వైష్ణవ శాఖాభేదాలు పక్కపక్కనే అభివృద్ధి చెందాయి. 'హిందూమతం' పేరుతో చలామణీ అయ్యే జీవిత దృక్పథ పవిత్రగ్రంథం 'భగవద్గీత' అనేక ధోరణుల రాజీ పత్రం అని విజ్ఞులు అంటారు.

అంచేత భారత సంస్కృతి ముఖ్యలక్షణం భిన్నత్వంలో ఏకత, వైరుధ్యాల సామరస్యం. సునీతీకుమార్ ఛటర్జీ రాసినట్లు సమన్వయం,

సత్యజిజ్ఞాస, అహింస అనే మూడూ భారత సంస్కృతి మౌలిక విలువలు.

అయితే భారత సంస్కృతిని, హిందూ సంస్కృతికి కుదించడం సమకాలీన రాజకీయ ఎత్తుగడల్లో భాగంగా కనిపిస్తోంది. 'హిందూ మతం' అనే భావనకి ప్రవక్త ఎవరు? ఫలానాది నిర్దిష్టంగా హిందూ లక్షణం అని చెప్పడానికి వుందా? వర్ణవ్యవస్థ; కులం మాత్రం హిందూ లక్షణంగా విశిష్టం అయ్యేయి. అంటరానితనం అనేదీ 'హిందూ' లక్షణంలో భాగంగా సంక్రమించింది. కులం, అంటరానితనం సమాజాన్ని విభజిస్తున్నాయని, అవి స్వతహాగా సనాతన సంప్రదాయానికి సంబంధించినవి కావనీ ఏ నాటినుంచో వాటికి వ్యతిరేకంగా ఉద్యమాలు సాగుతూనే వున్నాయి. భారతీయ సంస్కృతిలోని భిన్నత్వాన్ని, సహనశీలతని, అహింసాధర్మాన్ని విస్తరింపచేసి, వాటిని ఇంకా గాఢంగా పాదుకొల్పాలని సంస్కరణ వాదులు నిర్విరామకృషి సాగించారు. మనుధర్మం హిందూస్మృతి చంద్రికల్లో అగ్రస్థానంలో వుందని అంటారు కదా! అలాంటి మనువు అంగీకరించని అనేక విషయాలు ఆచార బలీయతవల్ల హైందవ దృక్పథంలో చోటు చేసుకున్నాయి. ఉదాహరణకి మనువు మేనరికాలు ఒప్పుకోలేదు. (మను 111.5.)

*అనపిండా చ యా మాతుః అసగోత్రా చ యా పితుః*
*సా ప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణి మైథునే.*

(తల్లికి సపిండ కానట్టిదియు తండ్రికి సగోత్ర గానట్టిదియునైన కన్యయే ద్విజాతులలో వివాహమునకు తగినది. అట్టి భార్యయే సర్వ కర్మలకును తృతీయ పురుషార్థ ప్రాప్తికిన్నీ యోగ్యమైనది.)

కాని దక్షిణ భారతంలో ఆచారరీత్యా సంప్రదాయంలో స్థిరపడ్డ వీటిని స్మృతికారులెవరూ అడ్డగించలేకపోయారు. అడ్డగించడానికి దాక్షిణాత్య సంప్రదాయమూ ఒప్పుకోలేదు. దాంతో ఈ ఆచారం రాజీగా సాగిపోయింది. (ఇవాళ వైద్యశాస్త్రం అభ్యంతరం చెప్పడంతో ఈ మేనరిక సంబంధాలు వెనకడుగు వేస్తున్నాయి. స్మృతికారుల నిషేధంకంటే భౌతిక అవగాహన పెరగడంవల్ల ఆ ఆచారానికి అడ్డకట్టపడుతోంది.) అలాగే మనువు శాసించిన వాటినెన్నిటినో హిందూ సంప్రదాయ వాదులనే వాళ్ళే ఉల్లంఘిస్తున్నారు. ధనమాశించి విద్య బోధించరాదనీ, మద్యంలాంటి వాటిని విక్రయించరాదనీ, తోలు వస్తువు సంబంధమైన వ్యాపారాలు చేయకూడదని, సేవకా వృత్తిలో జీవించకూడదనీ మనువు బ్రాహ్మణులని

శాసించేరు. ఇవాళ పరిస్థితి ఎలా వుందో చెప్పక్కర్లేదు. మనువు సతీసహగమనాన్ని అంగీకరించలేదు. కాని ఎన్నో శతాబ్దాలు సనాతనులే ఈ ఆచారాన్ని అనుసరించారు.

ఇంత చెప్పుకున్నా ఇదీ హిందూమతం, ఇదీ హిందూధర్మం అని ప్రామాణికంగా చెప్పే నాథుడు లేడు. కంచి కామకోటి పీఠాదిపతులు, పూరీ శంకరాచార్యులు చెప్పే 'హిందూ తత్వం' ఒకటి. రామకృష్ణ మిషన్ వివేకానందుని బోధనలతో ప్రచారం చేసే సేవా ధర్మం ఒకటి. భగవద్గీతా సూత్రయజ్ఞాలు పోటాపోటీలు పడి జరిపించే అసంఖ్యాక స్వాముల వార్లు చెప్పే హిందూ వేదాంతం ఒకటి. బాబాలు, అమ్మలు అందించే మహిమాన్విత హిందూ ప్రేమతత్వం ఒకటి. ఇక ఆర్య సమాజ దయానంద సరస్వతీ స్వాములు జరిపించే శుద్ధి కార్యక్రమ హిందూభావం ఒకటి. (అసలు సంప్రదాయవాదులు జీవంవున్న ప్రాణినే బలి ఇచ్చి యజ్ఞాలు చేయాలంటే ఆర్యసమాజ వాదులు ప్రత్యామ్నాయ పిష్టపశువుని పెట్టచ్చు అంటారు. దేన్ని అనుసరించాలి?) ఇక హిందూమతంలోకి రావాలంటే బిగిసిపోయిన కులవ్యవస్థ వీలే కల్పించదు. పై మతాలవాళ్లు మతం మార్చుకుని హిందూ పరిధిలోకి రావాలనుకున్నా ఏ కులం వాళ్ళు రానిస్తారు? భోజన భాజనాదికాలకు, వివాహాలకు తలుపులు తెరుస్తారు? అంచేత 'హిందూమతం' భారతదేశ సంస్కృతిలో ఒక ధార మాత్రమే – దీన్ని మతం అని పిలవగలిగితే. హిందూ విశ్వాసాలు అని పరిగణించే వాటిని ఎవళ్లన్నా అనుసరించవచ్చు – ఇస్కాన్‌లాగా. కాని హైందవ జీవిత దర్శనలో కులవిహిత ధర్మాన్ని అనుసరించడానికి లేదు. అందుకు ఆయా కులాల్లో జన్మించడమే ఆధారం. వీటన్నిట్నీ మించి రూపొంది, వికసించినది భారత సంస్కృతి.

భారతసంస్కృతిలో వున్న మహత్తర లక్షణం సహనశీలత. హిందూ మత విశ్వాసాలు కూడా ఈ లక్షణానికి దోహద పడ్డాయి. కాని హిందూ కుల కట్టుబాట్లు ఏ అన్య ప్రభావాన్ని చొచ్చుకు రానియ్యలేదు. భారతీయ చింతనలో అన్నీ యిమిడేయి. హిందూ జీవిత దృక్పథ అంతర్గత నిర్మాణంలో కట్టుబాట్లు బిగిసిపోయేయి. హిందూత్వ భావనని పరిరక్షించాలని తాపత్రయ పడేవాళ్లు ఆ సంస్కృతిలో దేన్ని ముఖ్యంగా పరిరక్షించా లనుకుంటున్నారు?

కట్టు, బొట్టు, గాజులు, విగ్రహారాధన లాంటివన్నీ భారత నాగరికతకూ, సంస్కృతికీ ప్రతీకలని ఇటీవల కొందరు 'హిందూ సంస్కృతి' పరిరక్షకులు

వాదిస్తున్నారు. యిందులో ఒక విచిత్రం వుంది. ఆర్య సంస్కృతి, సనాతన ధర్మం అనేది హిందూ సంస్కృతికి పునాదులని చాటేవాళ్లు ఒక విషయం విస్మరిస్తున్నారు. భారతదేశ ప్రజలు, సంప్రదాయాలు ఆరు జాతుల కలయికవల్ల, తొమ్మిది ఉపశాఖలవల్ల, అయిదు భాషాకుటుంబాలవల్ల రూపు తీసుకున్నట్టు చరిత్ర తెలియజేస్తోంది. ఆర్యయజ్ఞం, అనార్య విగ్రహారాధన మిళితమై నిగమ, ఆగమ ఆచారానుసరణీయంగా జీవితంలో ప్రాముఖ్యం పొందేయి. నిత్యజీవితంలో వాడుకలో వున్న కుంకం, పసుపు, తమలపాకు, కొబ్బరిలాంటివన్నీ ఆస్ట్రిక్ వారసత్వంగా సంక్రమించినవేనని సునీతీ కుమార్ ఛటర్జీ రాశారు. హిందూ జీవితంలో, హిందూకర్మ కాండల్లో ముందు పీటీన వున్న యీ సరంజామా అంతా అవైదికమైందే! గాజులు హరప్పా నాగరికతలోనూ వున్నాయి. మరి హిందూత్వ వాదులు వీటిని హిందూ – భారత్ కాదు – సంస్కృతి చిహ్నాలుగా పరిగణించి, వాటికి లోటు జరిగితే ఆ సంస్కృతికే ముప్పుపడినట్లు చాటడమేమిటి? ఆర్య, ద్రవిడ, నిషాదులంతా పక్క పక్కనే కలిసి జీవించగా రూపొందించిన సంస్కృతి ఇది. అనేక తాత్విక చింతనలు పాయలుగా ప్రవహించి సమ్మిళితమై ఏర్పడిన భారత సంస్కృతి ఇది. దీనికి ఆయువుపట్టుగా వుండిన, వుండాల్సిన సహనశీలత, సమన్వయస్వభావం, సత్యజిజ్ఞాస అనే వాటికి భంగం కలిగించడం భారత సంస్కృతికి హిందూ సంస్కృతి చేస్తున్న అపచారం. యే విశ్వాసాల వాళ్లయినా మనుగడ సాగించడానికి చోటు కలిగించిన యీ విశాల దృక్పథంలో మతపరమైన దాడులు జరపడం భారత సంస్కృతిలోని పరమోత్కృష్ట 'అహింసా' ధర్మానికి అపచారం చేయడం అవుతుంది. 'సహనావవతు, సహనౌభునక్తు... మావిద్విషావహై' అన్న మహత్తర కామనకి తూట్లు పొడవడం అవుతుంది. భారత సంస్కృతి ఔన్నత్యాన్ని చాటే మహోన్నత ఆశయాలకి 'హిందూ సంస్కృతి'ని కాపాడాలనుకున్నవాళ్ళు భంగం కలిగించకుండా వుండేందుకు గుర్తుంచుకోవాల్సింది యిది:

సర్వస్తరతు దుర్గాణి సర్వోభద్రాణి పశ్యతు
సర్వః సద్బుద్ధి మాప్నోతు సర్వః సర్వత్ర నందతు

(అందరు కష్టాలు దాటిపోవాలి. అందరు భద్రమైనవాటినే చూడాలి. అందరూ సద్బుద్ధులే కావాలి. అందరూ అన్నివేళలా ఆనందాన్నే పొందాలి)

ఇలా కోరుకునేవాళ్లు హింసాత్మక ఘటనలకు దిగరు. అలా దిగకపోవడమే భారత సంస్కృతి.

(కె. ఎం. ఫణిక్కర్, నీలకంఠ శాస్త్రి, సునీతీకుమార్ ఛటర్జీ, ధూర్జటీ, ప్రసాద్ ముఖర్జీ, రాధాకమల్ ముఖర్జీ, ఆర్. ఎస్. శర్మ లాంటి మహారచయితల గ్రంథాలు భారత సంస్కృతిని విశ్లేషించాయి. వాటిని అధ్యయనం చేయచ్చు.)

* * *